# చతుర

ఫిబ్రవరి 2010
రూ. 10/-



గూండా
నెంబర్ వన్
118 ..

ప్రియమణి
అందం ఆరోగ్యం.. 98

వెంకటేష్
**ఆత్మకథ**
10 లో...

జన్మదిన్న
ప్రత్యేక
సంచిక

ప్రేమ ఎంత మధురం.. 106

'జాతర'
కథ వెనుక కథ.. 103

జన్మదిన ప్రత్యేక సంచిక

# చతుర


సంపుటి -33
సంచిక - 1
ఫిబ్రవరి 2010
385వ సంచిక







ముఖచిత్రం : ప్రియమణి
ముఖపత్రాలంకరణ : రాజుయాట


ఎన్ని ప్రతికూల పరిస్థితుల్లోనైనా జీవించేందుకే పోరాడటం ప్రతి ప్రాణి నైజం. ప్రకృతి వైపరీత్యాల్లో సర్వం కోల్పోయి నిరాశ్రయులైనవారు సైతం తనువు చాలించాలని అనుకోరు. అయితే కొద్దిమంది మాత్రమే బలవన్మరణాలకు పాల్పడతారెందుకు? ఆత్మవిశ్వాసంతో ధైర్యంగా తలెత్తుకుని జీవించే పరిస్థితులు మృగ్యమైపోతున్నాయా? లేదా మానసిక బలహీనతవల్ల అలాంటి నిర్ణయం తీసుకుంటున్నారా? మృత్యువు కోరల్లోనుంచి తృటిలో తప్పించుకున్న ఓ నిరుద్యోగి జీవిత పోరాటగాథ

**వెంకటేష్ ఆత్మకథ**

10వ పేజీలో..

బొమ్మలు : భాస్కర్

# స్త్రీ విముక్తికి కలంపట్టిన యోధ



పి.వి.అఖిలన్
(1922–1988)

**రచనా వ్యాసంగాన్ని సంఘ సంస్కరణ, దేశసేవ, మహిళాభ్యుదయం వంటి ఉన్నత లక్ష్యాల పరిపూర్తికి సాధనంగా మలచుకున్న విశిష్ట సాహితీమూర్తి, పెరుంగళూర్ వైద్యలింగం అఖిలాండమ్ (అఖిలన్). నవల, కథ, నాటకం, వ్యాసం, కవిత ప్రక్రియల్లో ఆయన కృతులు తమిళ సాహిత్యానికి అమూల్యాభరణాలు. 'చిత్తిరపావై' నవలకు 1975లో జ్ఞానపీఠ పురస్కారాన్ని ఆయన పొందారు.**

**అ**ఖిలన్ 1922 జూన్ 27న తమిళనాడులోని పదుక్కోట్టై జిల్లా కొడంబలూర్ గ్రామంలో జన్మించాడు. తండ్రి అటవీ శాఖోద్యోగి. పుత్రుడ్ని ఐ.సి.ఎస్. అధికారిగా చేయాలని ఆకాంక్షించారు. కాని అఖిలన్ బాల్యదశలోనే పితృవియోగ బాధకు లోనయ్యాడు. స్వరాజ్యోద్యమం ఉవ్వెత్తున సాగుతున్న కాలమది. పేదరికంలోనే చదువు సాగించాడు. మనసంతా దేశభక్తితో నింపుకున్న అఖిలన్ విద్యార్థిగా బంకించటర్జీ, సుబ్రహ్మణ్య భారతి వంటి మేటి రచయితల గ్రంథాలు చదివాడు. సాహిత్యాభినివేశం పెంచుకున్నాడు. ఆయనను గాంధీ విశేషంగా ప్రభావితం చేశారు. మొపాసా, చెకోవ్ రచనలు ఆకర్షించాయి. సామాజిక పరిస్థితుల్ని నిశితంగా అధ్యయనం చేశారు. విద్యార్థి దశలోనే పేదరికంపై ఆయన రాసిన కథ పలువురి ప్రశంసలందుకుంది. మెట్రిక్యులేషన్‌లో ఉత్తీర్ణుడయ్యాక అఖిలన్ పుదుక్కోట్టైలో కాలేజీ విద్య సాగించలేకపోయారు. గాంధీ పూరించిన స్వరాజ్యోదమ శంఖారావం అఖిలన్ గుండెలో మారుమోగింది. చదువుకు స్వస్తిచెప్పి స్వాతంత్ర్య సమరంలో సైనికుడయ్యాడు. 'శక్తి యువసభ'ను వేదికగా ఎంచుకుని పోరాటానికి నాంది పలికాడు. పేదరికంవల్ల అఖిలన్ నిరాశ చెందలేదు. భుక్తి కోసం తిరుచ్చిలో 1945లో రైల్వేలో మెయిన్ సార్టరుగా చేరాడు. రచనల ద్వారా దేశసేవా నిరతిని కొనసాగించాడు. 1957 వరకు సార్టరు ఉద్యోగంలో వున్నాడు. రచనను జీవికగా స్వీకరించి సాహితీ సౌరభాలు నలుదిశలా వ్యాపింపజేశాడు. అఖిలన్ ప్రతిభా విశేషాలు గుర్తించి ప్రభుత్వం చెన్నై ఆకాశవాణి కేంద్రంలో తమిళ విభాగ ప్రయోక్తగా ఒక దశాబ్దంపైగా ఆయన సేవలు వినియోగించుకుంది.

అఖిలన్ భావజాల సారాన్ని ప్రముఖ విమర్శకులు ప్రేమానందకుమార్ "గాంధీ నేతృత్వంలో




సాగిన భారత స్వాతంత్ర్యోద్యమ ఛత్రఛాయలో పెరిగిన గొప్ప భారతీయ నవలాకారుడు అఖిలన్" అని అభివర్ణించారు. ఆయన రచనల్లో దేశాభిమానం తొణికిసలాడుతుంది. వాటి లక్ష్యం సమాజహితం. ప్రధానంగా నవలాకర్తగా లబ్ధప్రతిష్ఠుడైన అఖిలన్ ఇతర ప్రక్రియల్లో సహితం రచనలు చేశాడు. 'అఖిలన్ కవిదైగల్' ఆయన కవితా సంపుటి. 'వాయువిల్ ఇన్బమ్' అనే నాటకం

ఆయనకు మంచి పేరు తెచ్చింది. ఆయన వ్యాస శైలి రమణీయంగా వుంటుంది. విషయ విశ్లేషణ పాఠకుల్ని అలరిస్తుంది. ఇళ్లైరుక్కు, మణమ గళుక్కు, కడైక్కలై, పేత్తియిన్ రహస్యంగళ్- మొదలైన ఏడు వ్యాస సంపుటాలు, సోవియట్ నాట్టిల్, మలేసియా సింగపూరిల్ అఖిలన్- వంటి యాత్రా కథనాలు వెలువరించాడు. తంగనగరమ్, కాణానకణ్ణన్, నల్లపైయ్యన్ వంటి బాల సాహిత్య రచనలు పిల్లల్ని ఎంతగానో ఆకట్టుకున్నాయి. అనువాద కళలో కూడా ఆయన దిట్ట. ఆస్కార్‌వైల్డ్ రచనకు అనుకృతి 'దాహం'. కథానిర్మాణంలో అఖిలన్ అసమాన ప్రతిభ వ్యక్తమవుతుంది. కథనం ఉత్కంఠభరితంగా సాగుతుంది. గాంధేయ మార్గంలో సామాజిక పరివర్తన జరగాలని చాలా కథల్లో ప్రతిపాదించాడు. వరకట్నం, కుటుంబాలలో స్త్రీల దైన్యస్థితి, ఆర్థిక వ్యత్యాసాలు, చీకటి వ్యాపారం, స్వరాజ్యోద్యమ ఘట్టాలు, వితంతు వివాహం, మానవసంబంధాలు మొదలైనవి యితివృత్తాలుగా తీసుకుని అఖిలన్ రచించిన కథలు పాఠకుల్ని బాగా ఆలోచింపజేస్తాయి. మనసులో చెరగని ముద్రవేస్తాయి. విడుదలై, నిలవినిలె ఎరిమల్లై, సత్తియ ఆవేశమ్, వేలియుమ్ పయురుమ్, శక్తివేల్, సహోదరర్ అన్రో, పశియుమ్ రుసియమ్ ఇత్యాది పదహారు కథా సంపుటాలను తమిళ పాఠకలోకం పెన్నిధులుగా భావిస్తుంది.

అఖిలన్ నవలా ప్రక్రియను ఉన్నతోన్నత శిఖరాలకు చేర్చాడు. ప్రపంచ దేశాలలో వున్న తమిళ కుటుంబాలలో తప్పక వుండే గ్రంథాలలో అఖిలన్ నవలలను మొదట పేర్కొనాలి. కలైమగళ్ బహుమతిని 1945లో అందుకున్న 'పెణ్' నవల తమిళ సాహితీ రంగంలో సంచలనం సృష్టించింది. దీనికి స్వరాజ్యోద్యమం నేపథ్యం. ఐ.సి.ఎస్.ను కాదని జాతీయతా స్ఫూర్తితో స్వతంత్ర పోరాటంలోకి దూకిన యువకుడు ఇందులోని ప్రధాన పాత్ర. ప్రతిపుట ఉద్విగ్నత నింపుకుంటుంది. 'మంగియనిలవు' ఆయన తొలి నవల. 'నెంజిన్ అలైగళ్' అఖిలన్ గాఢతర దేశాభిమానానికి నిదర్శనం. స్వాతంత్ర్యోద్యమ గాథను శక్తిమంతగా చూపుతుంది. నేతాజీ మహనీయతను ఆవిష్కరిస్తుంది. సమాజంలో ఉత్తమ సంస్కరణ రావాలని నిరూపించే నవల 'ఎంగేపోగిరోమ్.' అఖిలన్ రాజకీయ పరిజ్ఞానం ఎంత లోతైనదో ఈ నవల ద్వారా వ్యక్తమవుతుంది. రాజేంద్ర చోళుని విజయాలను రచయిత 'వేంగైయిన్ మైన్దన్' నవలలో చిత్రించాడు. పాండ్యుల చరిత్ర ఆధారంగా 'కయల్విళి', విజయనగర చరిత్రపై 'వెట్రితిరునగర్' నవలలు రాశాడు.

అఖిలన్ కలం నుంచి జాలువారిన పదిహేను నవలలో 'చిత్తిరపావై' అత్యంత ప్రాచుర్యం పొందింది. జ్ఞానపీఠ పురస్కారం సముపార్జించిన ఈ నవల మహిళా చైతన్యానికి సంకేతం. 'ఆనంది' ఇందులోని ప్రధాన పాత్ర. 'అణ్ణామలై' మంచి చిత్రకారుడు. పరస్పరం ఆకర్షితులవుతారు. అది ప్రేమగా పల్లవిస్తుంది. ఇలావుండగా అణ్ణామలై తండ్రి ఆశ్రయం పొందిన 'మాణిక్యం' దృష్టి ఆనందిపై పడుతుంది. దుర్గుణాలకు మారుపేరు మాణిక్యం. కొన్ని సంఘటనల ప్రభావంతో ఆనంది వివాహం మాణిక్యంతో జరుగుతుంది. అతనిలోని దుర్మార్గం, ధనదాహం, వంచన, కాముకత ఆనంది జీవితాన్ని నరకప్రాయం చేశాయి. అణ్ణామలై తీరని వ్యథకు లోనవుతాడు. అతనికి తండ్రి స్నేహితుని కుమార్తె సుందరితో పెళ్ళి అవుతుంది. సుందరికి ధనాశ అధికం. శృంగార చిత్రాలు గీసి డబ్బు సంపాదించాలని భర్తను వేధిస్తుంది. వారి మధ్య అంతరం పెరుగుతుంది. చివరకు ఆత్మహత్య చేసుకుంటుంది. మాణిక్యం కుయుక్తులకులోనై అణ్ణామలై తండ్రి మంచం పట్టి కన్ను మూస్తాడు. అణ్ణామలై హితైషి శారద ప్రోత్సాహంతో ఆనంది అణ్ణామలైను కలుసుకుంటుంది. ఆగ్రహించిన మాణిక్యంతో జరిగిన ఘర్షణలో ఆనంది మంగళసూత్రం తెగిపోతుంది. ఆనంది శాశ్వతంగా అణ్ణామలైతో జీవితం గడపడానికి వెళ్ళిపోతుంది. ఈ నవల తమిళనాట అనూహ్య స్పందన కలిగించింది. "శాస్త్రోకంగా పెళ్ళి చేసుకున్నంత మాత్రాన భర్తలు భార్యలను బానిసలుగా చూసే కాలం గతించింది" అని అఖిలన్ హెచ్చరిస్తాడు. సన్నివేశ కల్పనలో, పాత్ర చిత్రణలో, కథన విన్యాసంలో కొత్త పుంతలు తొక్కిన నవల ఇది.

అఖిలన్ రచనలు ఇతర భారతీయ భాషల్లోకి, ఇంగ్లీషు, రష్యన్, జర్మన్ తదితర విదేశీ భాషల్లోకి అనువాదమయ్యాయి. అణ్ణామలై చెట్టియార్ స్మారక పురస్కారం, తమిళ వికాస పరిషత్తు బహుమతి, తమిళ సాహిత్య అకాడమీ, కేంద్ర సాహిత్య అకాడమీ పురస్కారాలు ఆయన అందుకున్నారు. 1988 జనవరి 31న అఖిలన్ కాలధర్మం చెందారు. ఆయన రచనలు కాలావధులకు అతీతాలు.

**–గోవిందరాజు రామకృష్ణారావు**

# నాన్నా! నేను మారాను

కన్ను లేనప్పుడే కన్ను విలువ తెలుస్తుంది.. కాలు లేనప్పుడే కాలు విలువ తెలుస్తుంది! మనిషి నైజమే అంత! ఎదురుగా, అందుబాటులోనున్న దాని విలువ ఎన్నటికీ గుర్తించలేడు.. అతను గుర్తించేసరికి జరగాల్సిన నష్టం జరిగిపోతుంది..

నాన్న పోయాకే నాన్న విలువ తెలిసొస్తోంది.. బతికున్నంత కాలం ఆయన చెప్పేదంతా నసగా భావించానే తప్ప ఆయన వాత్సల్యాన్ని గ్రహించ లేకపోయా. పేకాటలో మునిగి, ఏ అర్ధరాత్రో అపరాత్రో ఇంటికి చేరితే తలుపుతీసేవాడు నాన్న. నేనింటికి వచ్చిందాకా ఆయనకు నిద్రపట్టేది కాదని అప్పట్లో అర్థంకాలేదు నాకు.

ట్యాంక్‌బండ్ 26 కథలు

తలుపు తీస్తూనే మందువాసనకు విలవిల్లాడేవాడు.. వాంతొచ్చినంత పనయ్యేదనుకుంటా! ముక్కుకు టవల్ అడ్డం పెట్టుకుని-

'ఏంట్రా చిన్నా.. ఈ తిరుగుళ్లు? మన ఇంటా వంటా లేని ఛండాలపు అలవాట్లన్నీ నీకెలా దాపురించాయిరా? ఈ తాగుడేమిటి? ఈ పేకాటలేమిటి? ' అంటూ తలగొట్టుకునేవాడు.

చెప్పులైనా విప్పకుండా మత్తుగా నేనలా మంచంమీద వాలిపోతే అవిటికాలుతో.. కర్ర ఆసరాతో వంటింట్లోకి వెళ్లి కాస్త అన్నం కూర కంచంలో వేసుకుని తెచ్చి ముద్దకలిపి నోట్లో పెట్టేవాడు. మత్తులో ఉండేవాడ్నేమో కసరికొట్టేవాడ్ని. కంచం విసిరికొట్టేవాడ్ని.. నోటికొచ్చినట్లు తిట్టేవాడ్ని.. 'ఇలా నసపెడ్తావ్ కనకే నేనీకొంపకు రాను.. ఫో! అవతలకి' అంటూ నెట్టేసేవాడ్ని! పాపం కింద పడిపోయేవాడు. కన్నీళ్లు పెట్టుకుంటూనే గదిలో చిందరవందరగా పడిన అన్నం మెతుకులన్నీ ఎత్తి, అలాగే కుంటుకుంటూ తీసుకెళ్లి వీధిలోని చెత్తడబ్బాలో వేసొచ్చేవాడు.. ఇంట్లో చెత్తడబ్బాలేక కాదు.. వేస్తే వదినకు తెలుస్తుందని, కాళికలా విరుచుకుపడుతుందని, ఆయన భయం మరి!

'వెధవ సంత! ఈ కొంపకు పట్టిందేదో శని! తాగుళ్లు, జూదాలు అర్ధరాత్రి అపరాత్రి తలుపుకొట్టడాలు.. ఏంటీ ఖర్మ? మీ అబ్బాయి, మీరూ కల్సి వేరే ఉండండి మామయ్యగారూ! ఇక నేను పడలేను.. నావల్ల కాదు..'

ఉదయం పదింటికి మెలకువ వచ్చేసరికి వదిన రంకెలు విన్పిస్తున్నాయి. అన్నయ్య ఆఫీసుకెళ్లినట్లున్నాడు. వదిన విశ్వరూపం ఎత్తితే క్షణం కూడా ఇంట్లో ఉండడు అన్నయ్య. నాన్న ఏదో చెప్పడానికి ప్రయత్నిస్తున్నాడు.. సింపుల్‌గా చెప్పాలంటే బతిమాల్తున్నాడు.

'మామయ్యగారూ మీరు పెద్దవారు.. అంటే అన్నానంటారుగానీ ఇలాంటి కొరగాని కొడుక్కోసం మీ పింఛన్ నాలుగు వేలూ తగలేస్తున్నారే? ఎప్పుడైనా ఒక్క రోజు పదిరూపాయలు మీ పెద్దబ్బాయికి ఇచ్చారా? పోనీ గాజులేయించుకోమ్మా అని నాకిచ్చారా? కన్నతండ్రి కాబట్టి మీ అబ్బాయి మిమ్మల్ని మేపుతారు.. మరి మీ ముద్దుల కొడుకును మేమెందుకు మేపాలి? మాకు పిల్లల్లేరా? చంటి వెధవలు.. వాళ్లను పెంచి ప్రయోజకుల్ని చేయాలా? వద్దా? వాళ్లూ ఎవరో కాదు..మీ మనవళ్లే! వాళ్లవల్ల మీ వంశం నిలబడుతుంది కానీ తాగుబోతు కొడుకువల్ల కాదు.. అతన్ని



ఇంట్లోంచి తన్ని తరిమేయండి.. లేదంటే ఇద్దరూ కట్టకట్టుకుని వెళ్లి ఏ గంగలోనైనా దూకండి.. సాయంత్రం ఇంటికి వచ్చేసరికి మీ ముఖాలు నాకు కన్పించడానికి వీల్లేదు. మీకో నమస్కారం' అనర్గళంగా సాగిపోతోందావిడ సాధింపు..

'ఇంటికి బియ్యం.. ఉప్పు.. పప్పు నేనే.. తెస్తున్నా..' నాన్న అంటున్నా విన్పించుకునే స్థితిలో ఉంటేగదా ఆవిడ?

నిజమే తనకు తెలిసి ఇంటిఖర్చంతా నాన్నదే! అయినా తనమూలంగా మాటపడక తప్పడంలేదు. నా సంగతి వదిలేసినా ఆవిడ ఏనాడూ నాన్నకు ప్రేమగా ఓ కప్పు కాఫీ ఇచ్చి ఎరగదు.. అన్నంపెట్టి ఎరగదు.. వంటింట్లో అవిటికాలితో అవస్థపడుతూ ఆయనే కంచం, మంచినీళ్లు పెట్టుకుని ఏదో రెండు మెతుకులు తినేవాడు. తర్వాత కంచం కడిగి, గిన్నెలు సర్ది, ఎంగిలెత్తి ముందుగదిలోకి వచ్చి పడుకునేవాడు.

అమ్మ పోయేనాటికి అన్నయ్య వయసు పదిహేను, నా వయసు పది! అప్పటి నుంచీ ఇద్దరినీ రెండుకళ్లలో పెట్టుకుని ప్రాణంలా పెంచాడు నాన్న. ఆయన గారాబాన్ని అలుసు తీసుకుని పదోతరగతికే పక్కదారిపట్టాను నేను! ఆయన పోరగా పోరగా ఎలాగో అత్తెసరు మార్కులతో మూడోసారి గట్టెక్కాను. ఆ తర్వాత చదవనని మొండిపట్టు పట్టాను. అప్పటికే అన్నయ్య డిగ్రీ పూర్తిచేశాడు. నేను బేవార్సుగా తిరుగుతూ పేకాట మొదలెట్టాను. అన్నయ్యకు ఎల్లైసీలో ఉద్యోగం వచ్చింది..

అప్పటికి నాకు మందూ అలవాటైంది. అన్నయ్యకు ప్రమోషన్ వచ్చింది. నేనేమో మాదకద్రవ్యాలూ మరిగాను. అన్నయ్యకు పెళ్లయింది.. నాకు కాలవగట్టుమీద కనకంతో పరిచయం అయ్యింది. తల్చుకుంటే చాలా గమ్మత్తుగా ఉంటుంది.. అన్నయ్య జీవితంలో ఒక్కో మెట్టే ఎక్కుతుంటే నేను ఒక్కో మెట్టే దిగజారాను. పెళ్లీపెటాకులు లేదు.. చదువు సంధ్యాలేదు.. నాలాంటి వాళ్లకు పిల్లనెవరిస్తారు?

ఒక కంటపాలు ఒక కంటనీరు అన్నట్ల యింది నాన్న పని. అన్నయ్య ఉన్నత శిఖాలకు చేరాడన్న సంతోషంకన్నా నేను అధఃపాతాళానికి జారిపోతున్నానన్న ఆవేదన ఆయన్ను కుంగదీసింది. నెత్తీనోరూ కొట్టుకున్నాడు. ఏడ్చాడు.. అయినా నా చెవులకు ఎక్కితేగా?

అప్పుడే నిద్రలేచినట్లు, కళ్లు నులుముకుంటూ లేచాను.. అంతే! వదిన నోరు ఠక్కున మూతపడింది. ఆవిడ నాతో మాట్లాడి ఎన్నో ఏళ్లయింది. చూపుల నిండా అసహ్యం నింపుకుని తనదారిన తాను ఆఫీసుకు వెళ్లిపోయింది. ఆవిడతప్పు మాత్రం ఏముందిలే? జూదరులు, తాగుబోతులంటే ఎవరికి మాత్రం ప్రేమాభిమానాలుంటాయి?

వసారాలో కూర్చుని శూన్యంలోకి చూస్తున్నాడు నాన్న! ఆయన్ను అలా చూస్తుంటే బాధ అన్పించింది. కన్నపాపానికి నా గురించి ఎన్నిమాటలు పడుతున్నాడీయన? వదిన పొమ్మంటోంది.. ఈ వయసులో ఎక్కడికి పోవాలా? ఎలా బతకాలా? అనే కాబోలు ఆ కళ్లలో దిగులు తిష్ఠ వేసుక్కూర్చుంది.

పాపం పిచ్చినాన్న! తనకాలు సరిగా పని చేయకున్నా దానికి మందులు కొనుక్కోడు. నా ఖర్చులకు మాత్రం గొణుగుతూనే డబ్బిచ్చేవాడు. ఆయనకు నేనంటే ఎందుకో ఇంత పిచ్చిప్రేమ!

మెల్లగా తయారై, అన్నంతిని కంపెనీకి బయలుదేరాను. క్రమంగా ఈ ఊబిలో నుంచి ఎలాగైనా బయటపడాలి. ఇవ్వాళ కంపెనీలో డ్యూటీ పూర్తికాగానే ఎక్కడా ఆగకుండా నేరుగా ఇంటికి వచ్చేయాలి.. నాన్న కళ్లలో వెలుగు చూడాలి.. అనుకుంటూ వెళ్లిన నాకు మధ్యాహ్నం రెండింటికే అన్నయ్యా కొడుకు చిట్టి ఫోన్ చేశాడు.. 'తాతయ్య ఇంట్లో లేడని! వాళ్ల అమ్మా నాన్నా ఇంకా రాలేదని'.

పిడుగు పడ్డట్టయింది. ఎక్కడికి వెళ్లినట్లు? కొలీగ్ బైక్ తీసుకుని ఆఘమేఘాల మీద ఇంటికొచ్చాను. ఆయన మంచం ఖాళీగా వెక్కిరించింది. పక్కింటివాళ్లని అడిగితే ఒంటిగంట వేళ ఆటో ఎక్కుతుంటే చూశామని, ట్యాంక్ బండ్‌కు పోనీమంటుంటే విన్నామని అన్నారు.

గుండె పగిలింది.. ఒకవేళ.. ఒకవేళ..

రయ్యిన బైకు ట్యాంక్‌బండ్‌కు పరుగుతీసింది. ఇంతపెద్ద ట్యాంక్‌బండ్ మీద ఆయనకోసం ఎక్కడని వెదికేది? ట్యాంక్ బండ్‌మీదే అటూ ఇటూ బైక్‌ను పరిగెత్తిస్తూ సాయంత్రందాకా వెదికాను. సాయంత్రం అన్నావదినలు అక్కడికి చేరుకున్నారు. ముగ్గురంకలిసి మళ్లీ వెదికాం.. అయినా నాన్న కన్పించలేదు.. అక్కడే ఉన్న ఓ పోలీసుకు చెప్పాం.. 'ఒకవేళ హుస్సేన్‌సాగర్‌లో దూకాడేమో? అదే జరిగితే శవం రేపటికిగానీ తేలదు..' అంటూ తేలిగ్గా అనేసి చక్కాపోయాడు. ఆ మాటలకు కుంగిపోయాను.. అక్కడే కూలబడిపోయాను. కళ్లవెంట ధారాపాతంగా నీళ్లు కారుతున్నాయి. నాన్న చచ్చిపోవడానికి వీల్లేదు.. ఆయన బతకాలి. నా కోసమైనా ఆయన బతకాలి. 'నాన్నా నువ్వెక్కడున్నా వచ్చెయ్.. నాన్నా నేను మారాను.. మారాను' అని నా మనసు ఘోషిస్తోంది..

–చంద్రప్రతాప్

# సాల్వేషన్ ఆర్మీ

ప్రపంచ వ్యాప్తంగా ఉన్న 'సాల్వేషన్ ఆర్మీ' సంస్థ బీదలకి సాయం చేస్తుంది. వారికి ఉచితంగా భోజనం, బట్టలు ఇచ్చి, నిద్రపోయేందుకు గూడునిస్తుంది. దీని వ్యవస్థాపకురాలు కేథరిన్ బూత్ జనవరి 17, 1820న ఇంగ్లండ్‌లోని డెర్బిషైర్‌లో జన్మించింది.

చిన్న వయసునుంచే కేథరిన్ సున్నిత మనస్కురాలు. మతవిశ్వాసం గలది. పన్నెండో ఏటకే బైబిల్‌ని ఎనిమిదిసార్లు చదివింది. పద్నాలుగో ఏట, ఆరోగ్యం పాడై క్షయ వ్యాధితో మంచం పట్టింది. ఆల్కహాల్ సమస్య మీద అనేక పత్రికలకి వ్యాసాలు రాసి, దానికి బానిసలైనవారిని తాగకుండా ఉండేలా ప్రోత్సహించింది. తన ఇరవై మూడో ఏట మెథడిస్ట్ మినిస్టర్ విలియం బూత్‌తో ప్రేమలోపడి, మూడేళ్ళ తర్వాత వివాహం చేసుకుంది. జూన్ 16, 1855న లండన్‌లో వారికి వివాహమైంది. కేథరిన్ చర్చి కార్యక్రమాల్లో చురుగ్గా పాల్గొనసాగింది. ఆ రోజుల్లో స్త్రీలు పబ్లిక్ మీటింగ్స్‌లో మాట్లాడటం అరుదు. అయినా ఆమె ఆల్కహాలిజం మీద మాట్లాడేది.




1865లో 'బ్యాండ్ ఆఫ్ హోప్' ధార్మిక సంస్థలో కేథరిన్ చురుగ్గా పాల్గొనసాగింది. తాగి స్పృహ లేని వాళ్ళని తీసుకువచ్చి మర్నాడు వారికి స్పృహ వచ్చేదాకా పడకలని ఏర్పాటు చేసేది. 1878లో దాని పేరు 'ది సాల్వేషన్ ఆర్మీ'గా మార్చింది. ఆమె భర్త విలియం బూత్‌ని జనరల్‌గా, కేథరిన్‌ని 'మదర్ ఆఫ్ ఆర్మీ'గా ప్రజలు పిలవసాగారు. కేథరిన్ దీన్ని చాలా అభివృద్ధి చేసింది. ఇళ్ళలోని పాత దుస్తులని సేకరించి బీదలకి ఇచ్చేది. ఈ రోజుకీ ప్రపంచ వ్యాప్తంగా ఉన్న సాల్వేషన్ ఆర్మీకి పాత దుస్తులు ఇవ్వడం పాశ్చాత్య దేశాల్లో మామూలే.

వీరికి ఎనిమిదిమంది సంతానం. ఐదుగురు కూతుళ్ళు, ముగ్గురు కొడుకులు. తన అరవై ఒకటో ఏట కేథరిన్ బూత్ అక్టోబర్, 4, 1890న మరణించింది. వారి ఇంటిని మానసిక వికలాంగుల కోసం ఆమె విరాళంగా ఇచ్చింది. 2005లో దీన్ని పడగొట్టి పునర్నిర్మించారు. చర్చ్ ఆఫ్ ఇంగ్లండ్ మొదట్లో సాల్వేషన్ ఆర్మీ పట్ల దురుసుగా వ్యవహరించి, దాన్ని క్రైస్తవ వ్యతిరేకిగా పేర్కొంది. అయితే 1882లో వారు చేసిన సర్వేలో ఓ రాత్రి 17 వేలమంది సాల్వేషన్ ఆర్మీ భవంతుల్లో ప్రార్థిస్తే, వివిధ చర్చీలలో 11 వేలమందే ప్రార్థన చేయడం గుర్తించి తమ తప్పిదాన్ని గ్రహించారు. కేథరిన్ కొడుకు బ్రామ్‌వెల్ బూత్ తల్లిదండ్రుల తదనంతరం సాల్వేషన్ ఆర్మీకి అధిపతి అయ్యాడు.



దుఃఖం తన్నుకొస్తుంటే తన్నుతాను కడతేర్చుకోవడానికి దూలానికి తాడుకట్టి, వదులుగా ముడివేశాడతను. కష్టాలకు శాశ్వత వీడ్కోలు పలుకుతూ ముడిలోకి తల దూర్చి, కాలితో స్టూలు తన్నబోయాడు.

అంతలోనే 'పోస్ట్' అన్న కేక.

'ఆత్మహత్య చేసుకునేవాడికి ఇప్పుడు ఆ పోస్టుతో పనేముంది?' అతనిలో కాసేపు అంతర్మథనం..

అయినా ఆగని దబదబా తలుపు బాదుడు.. దానికి తోడు 'అబ్బాయ్' అన్న పిలుపు.. ఆ తర్వాతేమైంది? ఆత్మహత్య ఆలోచన ఓ మానసిక రుగ్మతేనా? ప్రతివారూ, ముఖ్యంగా ప్రతి నిరుద్యోగీ చదివి తీరాల్సిన వెంకటేష్ నవల **ఆత్మకథ** ఈనెల చతుర కానుక.

"సాయం సంధ్య వేళ. పరిస్థితులు బాగా లేనివాడిని కష్టాలు ముసురుకున్నట్లుగా లోకాన్ని చీకట్లు కమ్ముకుంటున్నాయి. కష్టాలు కమ్ముకున్నవాడి మనసులోని దిగులులా ఉంది వాతావరణం.

మూడంతస్తుల ఆ మేడమీద బాగా పైన ఉన్న పెంట్‌హౌస్ బయట నిలబడి ఆకాశం వంక చూస్తున్న అశోక్ విరక్తిగా నవ్వుకున్నాడు.

'మన మనసును బట్టే చుట్టూ పరిసరాలూ, వాతావరణమూను' అనుకున్నాడు.

పశ్చిమాన కుంగిపోతున్న సూర్యుడికీ అశోక్ మొహానికి తేడా కనిపించడం మానేసి చాలా కాలమైంది. సూర్యుడికింకా రేపు ఉదయాన్నే ఉదయిస్తాననే నమ్మకమైనా ఉంటుంది. అశోక్‌కి ఆ ఆశ ఏనాడో అడుగంటిపోయింది.

నిరాశతో నిండిపోయిన, నిత్యం చిట్లించి ఉండే, గుంటలు పడిపోయిన కళ్లు... కొద్దిగా తెరచుకున్న రెండు పెదవుల మధ్య నుండి కనిపించే రెండు ఎత్తుపళ్లు... లోతుకుపోయిన దవడలు... ఎండిపోయిన పెదవులు... రేగి ఉన్న జుట్టు... మాసిపోయిన గడ్డం... తనమీద తనకి ఆశ, ఆసక్తి రెండూ లేని మనిషిలా ఉంటున్నాడు అశోక్ గత చాలాకాలంగా.

ఎప్పుడూ కడిగిన ముత్యంలాగా ఉండటం అతనికి చిన్నతనం నుంచీ అలవాటు. తల్లిదండ్రులనుంచి అబ్బిందా అలవాటతనికి. అయితే పరిస్థితుల ప్రాబల్యం వలన అతడలా తయారయ్యాడు ఇప్పుడు.

సూర్యుడు పూర్తిగా అస్తమించే వరకూ తదేకంగా చూసిన అశోక్, నెమ్మదిగా కదిలి, కిందికి వెళ్లడానికి మెట్లు దిగసాగాడు. ఆ మెట్లు ఎక్కడమూ, దిగడమే పెద్ద పరీక్షలా ఉంటోందతనికి యిక్కడికి వచ్చినప్పటి నుంచీ.

పైగా రెండో అంతస్తులో ఉండే కుక్క ఒకటి... కాస్త అలికిడైతే చాలు 'భౌ' మంటూ అరుస్తుంది. ఆ అరుపుకే సగం చచ్చిపోయినట్టు అనిపిస్తుందతనికి.

కుక్క గుర్తుకు రాగానే భయం ఆవహించింది అశోక్ మనసునిండా. జడుస్తూ జడుస్తూ వచ్చాడా అంతస్తుకి.

చుట్టూ కట్టిన మెస్‌లోంచి చూస్తే పడుకుని నిద్రపోతోందా కుక్క. హమ్మయ్య అనుకుంటూ అడుగులు చప్పుడు కాకుండా నడవసాగాడు. 'భౌ' అంటూ గట్టిగా అరుపు వెనకనించి.

హడలిపోయాడు అశోక్.

ఆ మెస్ దాటి బయటికి రాలేదు కుక్క. అయినా దాని అరుపు చాలు... అసలే అర్భకంగా ఉన్న అశోక్‌లాంటి వాడిని హడలగొట్టేందుకు. మనసులోనే తిట్టుకుంటూ కిందికి నడిచాడు.

"ఇంకెంత... ఇదే ఆఖరిసారి దీనికి దడవడానికి. మరో అరగంటకో, గంటకో ఏ అరుపులూ వినిపించని ప్రశాంత లోకానికి వెళ్లిపోతాను..." అనుకున్నాడు.

మెట్లన్నీ దిగి కిందికొచ్చాడు. తాపీగా నడవసాగాడు. మనసునిండా ముసురుకున్న ఆలోచనలు...

"ఎలాంటి జీవితం ఎలా అయిపోయింది? కడుపునిండా తిని ఎన్ని రోజులయింది? కంటినిండా నిద్రపోయి చాలా యుగాలై పోయినట్టుగా ఉంది. జీవితం మీద ఆశ, ఆసక్తీ ఏనాడో పోయాయి. ప్రపంచం అంతా సుఖంగా, సంతోషంగా ఉంది. మనుషులంతా ఎవరి సంపాదనలో వాళ్లు, ఎవరి బాధల్లో వాళ్లు ఉన్నారు. నాకొక్కడికే ఏ పనీలేదు. సంపాదనా లేదు. నా బాధని పంచుకునే నాథుడూ లేడు. నా గోడు వినే తీరిక ఎవరికీ లేదు. నేనున్నానని ఆసరా యిచ్చే చెయ్యి లేదు. కాసింత ఓదార్పునందించే తోడు లేదు. నాలాంటి వాళ్లుండటం వలన ఎవరికీ ఉప

యోగం లేదు... ఆఖరికి నాకు కూడా. నాలాంటివాడు బతికి ఉండటం ఈ భూమికి భారం... అంతకుమించి ఏమీ లేదు. ఏ...మీ...లే...దు."

అశోక్ ఆలోచనల్లో పడి చౌరస్తా దగ్గరికి వచ్చేశాడు. నాలుగు వైపులనుంచీ వెల్లువలా వాహనాలు. చౌరస్తా మధ్యలో ఉన్న సిగ్నల్ స్తంభంలోని లైట్లని బట్టి ఒక్కోసారి ఒక్కోపక్క ట్రాఫిక్ ముందుకు కదులుతోంది.

ఒక్కక్షణం ఎటు వెళ్లాలో అర్థం కాలేదు అతనికి. పచ్చలైటు వెలిగి ఒక పక్క వాహనాలు కదిలాయి. అతను కూడా అటే అడుగులు వేశాడు.

ఆ అడుగులకు గమ్యం- అతడి జీవితాన్ని అంతంగావించడం. అతడు వెళ్తున్నది ఆత్మహత్య చేసుకుని చనిపోవడానికి.

★ ★ ★

తూర్పుగోదావరి జిల్లాలోని కోనసీమ ప్రాంతంలో ఒక మధ్యతరగతి ఇంట్లో పుట్టి పెరిగాడు అశోక్. అతడి తల్లిదండ్రుల నలుగురి సంతానంలో పెద్దవాడు. ఇద్దరు తమ్ముళ్ళు, ఒక చెల్లాయి ఉన్నారతనికి. తండ్రి మ్యూజికల్ షాప్ నడిపేవాడు. ఆడియో క్యాసెట్స్ చేసి అమ్ముకోవడం ఆయన వ్యాపారం.

ఇంటర్ సెకండియర్ చదువుతున్న వరకూ ఏ ఇబ్బందీ ఎరక్కుండా పెరిగాడు. అతనివరకూ ఎప్పుడూ ఇబ్బంది రాకుండా పెంచాడు తండ్రి. అశోక్ ఇంటర్ సెకండియర్‌లో ఉండగా ఆయనకి పక్షవాతం వచ్చింది. మంచానపడిన మనిషి మరింక లేవకుండా అయిపోయింది. కేవలం ప్రాణం మాత్రమే ఉంది ఆయనకి. అన్ని అవయవాలూ ఉండీ లేనట్టు అయిపోయాడు. ఆ దుఃఖం నుంచి తేరుకోవడానికి చాలాకాలం పట్టిందా కుటుంబానికి.

ఇంటికి పెద్దకొడుకుగా బాధ్యత అశోక్‌మీద పడింది. చదువు అర్ధాంతరంగా ఆపేసి షాపు చూసుకోవడం మొదలుపెట్టాడు.

తండ్రితో షాపుకు వెళ్ళడం అలవాటు ఉండటంవలన పెద్దగా కష్టం కాలేదు అతనికి, ఆ వ్యాపారం నిర్వహించడం. పైపెచ్చు అది ఎంతో ఇష్టమైన వ్యాపకం అతనికి.

కాలేజీ స్నేహితులు కూడా ఎంతో సాయమందించారు అతనికి. వ్యాపారం లోటులేకుండా సాగుతున్నా, తండ్రి మందుల ఖర్చులకీ, ఆయన్ని అప్పుడప్పుడూ హాస్పిటల్‌కి తీసుకెళ్ళడానికీ అప్పులు చేయక తప్పడంలేదు.

తనకి కష్టంగా ఉంటున్నా ఆ కష్టాన్ని ఇంటివరకూ వెళ్ళనివ్వడంలేదు అశోక్. తండ్రిలాగానే అతడు కూడా బాధలన్నీ తానే మోస్తూ, కుటుంబ బాధ్యతలని నెరవేరుస్తున్నాడు.

తన తమ్ముళ్ళ, చెల్లెలి చదువు సంధ్యలకీ, పోషణకీ, వాళ్ళకి ఉండే చిన్నాచితకా ఖర్చులకీ ఎప్పుడూ లోటు చేయడంలేదు. వాళ్ళు కూడా కుటుంబ పరిస్థితి తెలిసినవారు కావడంతో అతన్ని దేనికీ ఇబ్బంది పెట్టరు.

తండ్రి పెంచిన పెంపకం అలాంటిది. తన పిల్లల మధ్య అప్యాయత, అనుబంధాలు బలంగా ఉండాలనీ, బాధ్యతలు కూడా తెలుసుకోవాలనీ నిత్యం తపించేవాడాయన.

మూడు సంవత్సరాలపాటు సులువుగానే సాగిపోయాయి రోజులు. అశోక్ తండ్రి ఆరోగ్యం మెరుగుపడనూ లేదు. దిగజారనూ లేదు. తను బెంగపడితే పిల్లలు బెంబేలు పడతారని నిబ్బరంగానే రోజులు గడుపుకొంటూ వస్తోంది అతడి తల్లి. అతడి తోడబుట్టినవాళ్లు కూడా సర్దుకుపోతూనే చదువు సంధ్యలు సాగిస్తున్నారు.

అయితే ఈ మూడేళ్లలోనూ బయటి

ప్రపంచంలో ఎన్నో మార్పులు శరవేగంగా జరిగిపోయాయి. ప్రపంచమే ఒక కుగ్రామంగా మారిపోతున్న క్రమంలో, ఆధునిక సాంకేతిక పరిజ్ఞానం ఎల్లెడలా వ్యాపించి, కాలంతోపాటు పరిగెత్తలేనివాళ్ళని వెనక్కి నెట్టేసి, తనతో వచ్చేవాళ్ళని వేగంగా ముందుకు తీసుకుపోతూ ఉంది.

సుదీర్ఘకాలంపాటు సంగీతప్రియులకి ఆనందాన్ని పంచిపెట్టిన ఆడియో క్యాసెట్లు కనుమరుగవడం ప్రారంభించాయి. సీడీలు, డీవీడీలు వచ్చాక, సీడీ/డీవీడీ ప్లేయర్లని సులభంగా కొనుక్కోగలిగిన ఆర్థిక స్థోమత లభించాక అంతా క్యాసెట్లని మరచిపోయారు.

భారతదేశంలో ప్రజలకి తిండిగింజలు, కూరగాయలు, పౌష్టికాహారం, తాగునీరూ, మరుగుదొడ్లూలాంటి ప్రాథమిక అవసరాలు తేలిగ్గా లభించవుగానీ అత్యాధునిక సాంకేతిక పరికరాలు- సెల్‌ఫోన్లు, డీవీడీ ప్లేయర్లు, హోమ్ థియేటర్లు, ప్లాస్మా టీవీలు-లాంటివి మాత్రం చాలా వేగంగా అందుబాటులోకి వచ్చేస్తాయి.

అశోక్‌కి ఇవేవీ తెలియవు. కానీ తన వ్యాపారం మందగించడం మాత్రం తెలిసింది. ఇప్పుడు క్యాసెట్లు కొనేవాళ్ళు లేరు. రికార్డింగ్ చేయించుకునేవాళ్ళు లేరు.

ఏ ఆటోలవాళ్లో అప్పుడప్పుడూ వస్తున్నారు. అయితే అదీ గిట్టుబాటయ్యే వ్యవహారం కాదు.

చాలారోజులవరకూ ఇంట్లో ఈ విషయం తెలియకుండా జాగ్రత్తపడుతూ వచ్చినా, తల్లి గ్రహించింది అతడి బాధని.

ఆమె కాస్త లాలనగా అడగ్గానే బావురుమంటూ ఆవిడ ఒడిలో పడుకుని జరుగుతున్న సంగతులన్నీ చెప్పేశాడు.

తల్లీకొడుకులిద్దరూ తీరిగ్గా చర్చించుకునే సరికి భయంకరంగా పైకి తేలాయి బోల్డన్ని అప్పులు. అంధకారమయమైన భవిష్యత్తు.

ఆవిడ కాస్త స్థిమితంగా ఆలోచించగలిగింది. కొడుక్కి ధైర్యం చెప్పింది.

"కష్టాలు మనుషులకి కాక మానులకొస్తాయా నాన్నా. నువ్వూరికే కంగారు పడిపోకు. ఏటెల్లకాలం రోజులన్నీ ఒకేలా ఉండవు. ఈ అప్పులంతా ఎంత? కాస్త కష్టపడితే తీరిపోతాయి. నువ్వేమీ పాడుచెయ్యలేదు కదా. ఇవాళ్టేపు రోజులన్నీ యిలాగే ఉన్నాయి. ఆ వ్యాపారం కాకపోతే యింకోటి చేసుకుందాం. నువ్వేమీ బెంగపడకు. ఈ విషయాలన్నీ తమ్ముళ్ళకి తెలియనివ్వకు. బయట కూడా ఎవరితోనూ అనకు" అంటూ ఓదార్చింది.

చాలాసేపు బెక్కుతూ ఉండిపోయాడు అశోక్.

"ఏడవకు నాన్నా! లే... లేచి కాస్త మొహం కడుక్కో. హాయిగా చదువుకోవాల్సిన వయసులో ఎన్ని కష్టాలొచ్చాయిరా నీకు... యిదంతా ఏ జన్మలోనో చేసిన పాప ఫలితం... ఎలా రాసిపెట్టి ఉంటే అలా జరుగుతుంది. లే... లేచి మొహం కడుక్కుని రా..." కళ్ళు తుడుచుకుంటూ అన్నదామె.

అశోక్ లేచి వెళ్ళి మొహం కడుక్కుని వచ్చాడు.

"అప్పులిచ్చినవాళ్ళెవరన్నా డబ్బులకోసం గొడవ చేస్తున్నారా నాన్నా?" అడిగింది తల్లి.

"లేదమ్మా. ఎలాగో కొంత కొంత జమ చేస్తున్నాను. ప్రస్తుతం కాస్త ఫరవాలేదు. ముందు ముందు ఏమిటనే నా బెంగ..."

"ఏం చేస్తే బావుంటుంది మరి?" సాలోచనగా అందామె.

"ఇదే చెయ్యాలంటే కంప్యూటర్ కొనాలమ్మా. సీడీ రికార్డింగ్‌లు అవీ పెట్టాలి. వీడియో సీడీలు కూడా అద్దెకి తిప్పుకోవచ్చు."

# నైతికత కన్నా గొప్పదేది?

భారత స్వాతంత్ర్యోద్యమంలో నేతాజీ సుభాష్ చంద్రబోస్‌ను దేశబంధు చిత్తరంజన్‌దాస్ గొప్పగా తీర్చిదిద్దారు. ఆయన కనబరచిన నైతికతకు ఈ సంఘటన ఓ ఉదాహరణ. చిత్తరంజన్‌దాస్ తండ్రి స్నేహితుడికి సాయం చేయబోయి ఆర్థిక ఇబ్బందులకు గురయ్యారు. కోర్టు ఆయన 'దివాలా' తీసినట్టు ప్రకటించింది. చిత్తరంజన్‌దాస్ పెరిగి పెద్దవాడై ధనం సంపాదించి, తన తండ్రికి అప్పిచ్చిన వారందర్నీ పిలిచి



బాకీలను తీర్చసాగాడు. ఆయన చేస్తున్న పని చూసి మిత్రులు ఆశ్చర్యపడ్డారు. 'మీరు ఇలా చేయవలసిన అవసరంలేదు. కోర్టువారు మీ తండ్రిని దివాలా తీసిన వ్యక్తిగా నిర్ణయించారు. ఆ అప్పులను తీర్చవలసిన బాధ్యత మీకు లేదు' అన్నారు.

'మీరు చెబుతున్నది కోర్టువారు ఇచ్చిన తీర్పు. కానీ నైతికమైన సూత్రం కోర్టువారి ఆర్డరు కంటే గొప్పది. అంతేకాదు. మా కుటుంబానికి- దివాలా తీసిన వారు- అన్న మచ్చను నేను తుడిచి వేయదలచుకున్నాను' అని సి. ఆర్. దాస్ జవాబిచ్చారు.

"అవన్నీ కావాలంటే ఏమాత్రం అవుతుంది? "

"అవుతుందమ్మా. ఒక ముప్ఫై నలభై వేలదాకా అవుతుంది"

"అమ్మో... అంతే..."

"అవునమ్మా. అందుకేగా నాకీ బెంగంతా..."

"మరి షాపులో కాసెట్లకదీ ఎంతొస్తుంది? "

అశోక్ విరక్తిగా నవ్వాడు... "నిన్న మొన్నటిదాకా ఎంతో విలువైన పెట్టుబడమ్మా ఆ కాసెట్లు మనకి. యిప్పుడెందుకూ పనికిరావు. ఊరికే యిస్తామన్నా పట్టుకెళ్ళేవాళ్ళు ఎవరూ ఉండరు..."

"ఎలాంటి రోజులొచ్చాయి? ఆ కాసెట్ల మీదనే మిమ్మల్నింతవాళ్ళని చేశారు మీ నాన్నగారు. ఇప్పుడెందుకూ కొరగాకుండా పోయాయన్నమాట"

అతడి తమ్ముళ్ళు యింట్లోకి రావడంతో అక్కడితో ఆగిపోయిందా సంభాషణ.

★ ★ ★

రేపు ఏం చేయాలా అని నిత్యం ఆలోచిస్తూనే మామూలుగా షాపు తెరవసాగాడు అశోక్.

ఎంత ఆలోచించినా ఆలోచనలతో బుర్ర పగిలిపోతోంది తప్పితే ఏమీ తోచడం లేదు. ఏమి చెయ్యాలన్నా అంతా డబ్బుతో ముడిపడి ఉంది. ఆ డబ్బు తన దగ్గర లేదు.

తన తండ్రికి వారసత్వంగా వచ్చిన స్వంత యిల్లు తప్ప వాళ్ళకి యింకేమీ ఆస్తి లేదు. తల్లి ఒంటిమీద పుస్తెలు తప్ప వేరే బంగారమూ లేదు. వాళ్ళని నమ్మి కాస్త అప్పు యిచ్చేవాళ్ళు కూడా యింకెవరూ లేరు. యిచ్చేవాళ్ళు అందరి దగ్గరా అప్పటికే అప్పులు చేసేశాడు అశోక్.

ఏ ప్రభుత్వ పథకాలతోను అతడికి చేయూత లభించదు. ఏ బ్యాంకూ, ఆ వ్యాపారానికి లోను యివ్వదు. అతడి చదువుకి సరిపడ సరైన ఉద్యోగం ఏదీ రాదు. బయట ఏ షాపులోనైనా పని చేద్దామన్నా ఆ చిన్న ఊళ్ళో షాపులవాళ్ళు యిచ్చే జీతం ఆ కుటుంబానికి ఒక మూలకి కూడా సరిపోదు. వేరే వ్యాపారం చేసే నైపుణ్యమూ లేదు. దానికి పెట్టుబడిగా కావాల్సిన డబ్బు కూడా వాళ్ళవద్ద లేదు. పైగా ఆ వ్యాపారం

## కొత్తగాలి...

**పల్నాటి యుద్ధం**
**బొబ్బిలి యుద్ధం వారసులం**
**మనలో మనం కాక**
**వేరెవరితో చేస్తాం యుద్ధం!?**

– మాధవీ సనారా, అనకాపల్లి

ఉన్నట్టుండి ఆపితే ఆ షాపు మీద చేసిన అప్పులన్నీ తీర్చాలి. లేదంటే వాళ్ళంతా యింటిమీద పడతారు.

ఊళ్ళో పరువుపోతుంది. తండ్రి ప్రాణాలే పోవచ్చు. తల్లి ఎక్కడా తలెత్తు కోలేకపోతుంది. అందులోనూ ఆవిడ బాగా అభిమానవంతురాలు. మిగతా పిల్లలు బెంగటిల్లిపోతారు.

వంద రకాలుగా ఆలోచించినా పరిష్కార మార్గం ఏమీ తోచలేదు అశోక్‌కి.

తల్లి ఎవరి దగ్గరా ఈ విషయాలు చెప్పవద్దని అన్నా, స్నేహితులతో ఆ విషయాన్ని చర్చించాడు అశోక్. ఎవరికీ ఏమీ తట్టలేదు. అతడిని ఆదుకునేంత స్థోమత కలిగినవాళ్ళు కూడా కాదు ఆ స్నేహితులు. అక్కడికీ కొద్దో గొప్పో సహాయం చేస్తామని ముందుకొచ్చారు ఒకరిద్దరు.

చివరికి ఒక స్నేహితుడు అన్నాడు "మనతో చదివిన రాజేష్ యిప్పుడు హైదరాబాద్‌లో ఉన్నాడు. ఏదో కంపెనీలో పనిచేస్తున్నాడు. నువ్వు కూడా అక్కడికి వెళ్ళిపోతే మంచిదేమో. జీతం బాగా వస్తుంది. నెమ్మదిగా అప్పులు తీర్చేసుకుంటే తర్వాత అంతా అక్కడికి వెళ్ళిపోవచ్చు" అని.

మిగతావాళ్ళు కూడా ఆ ఆలోచనకే ఓటు వేశారు. అలాంటిచోటికి వెళ్ళిపోతే ఏదో ఒక అవకాశం దొరుకుతుందనీ, కాస్త కష్టపడితే ఈ ప్రాబ్లమ్స్ నించి బయటపడిపోవచ్చనీ, అదృష్టం బావుంటే అక్కడే హాయిగా సెటిల్ అయిపోవచ్చనీ ప్రోత్సహించారు. హైదరాబాద్‌లో ఉండేవాళ్ళంతా రాష్ట్రం నలుమూలలనుంచీ వచ్చి సెటిల్ అయినవాళ్ళేనని స్టాటిస్టిక్స్ చెప్పారు.

ఆ మాటలు వింటుంటేనే ఎంతో ఉత్సాహంగా అనిపించింది అశోక్‌కి. యింటికి వెళ్ళగానే తల్లితో చెప్పాడా ఆలోచన. ఆమె ఒప్పుకోలేదు. కలోగంజో అంతా ఇక్కడే ఉండి తాగుదామనీ, అందరినీ వదిలి అతనొక్కడూ అంతదూరం వెళ్లడం తనకిష్టం లేదనీ అంది. బతుకుతెరువుకోసం ఉన్న ఊరిని వదిలివెళ్ళాల్సిన రోజులొచ్చాయి కదాని ఏడ్చింది.

ఆమె కాస్త మామూలు మనిషి అయ్యేవరకూ ఆగి నెమ్మదిగా నచ్చచెప్పాడు అశోక్. కొన్నాళ్ళు ఓపికపడితే ఇబ్బందులన్నీ తొలగిపోతాయనీ అంతా హాయిగా ఉండవచ్చని అన్నాడు.

భవిష్యత్ మీద ఏ ఆశాలేని ఇక్కడ ఉండేకన్నా అలాంటిచోటికి వెళ్ళి ఏదో ఒకటి చేసుకుంటూ హాయిగా బతకవచ్చనీ, మొదట తను అక్కడికి వెళతాననీ, అక్కడ బాగుంటే అందరమూ వెళ్ళిపోదామనీ, తమ్ముళ్ళ చదువులు పూర్తయ్యేసరికి వాళ్ళకి కూడా అక్కడే ఏవో ఉద్యోగాలు దొరకకపోవనీ, చెల్లెలికి చదువు చెప్పించి, మంచి సంబంధం చూసి పెళ్ళిచేయొచ్చనీ, అత్యాధునిక సౌకర్యాలు ఉండే ఆసుపత్రులు అక్కడ ఉంటాయి గనుక తండ్రికి కూడా అక్కడ మంచి వైద్యం చేయించవచ్చనీ ఎంతో ఆశగా చెప్పాడు. అయినా ఆమె ఒప్పుకోలేదు. అతన్ని విడిచి తను ఒక్క క్షణం కూడా ఉండలేనని అన్నది.

అయితే అశోక్ పట్టిన పట్టు విడవలేదు. రకరకాలుగా ఆమెని కన్విన్స్ చేసి చివరికెలాగైతేనేం ఒప్పించగలిగాడు.

...అది జరిగిన వారం రోజుల తర్వాత

అశోక్ హైదరాబాద్ ప్రయాణం ఖరా రైంది.

అప్పటికి విషయం యింటిల్లిపాదికీ తెలిసింది తండ్రికి తప్ప. తర్వాత నెమ్మదిగా చెప్పొచ్చులే అనుకున్నారు. చెబితే వినే స్థితిలో తప్ప, ఎదురు ఏమీ చెప్పలేని స్థితిలో ఉన్నాడాయన.

ఆ సాయంత్రం ఏడు గంటలకి బస్సు. తను వస్తున్నట్టూ, బస్సు ఆగేచోటికి వచ్చి రిసీవ్ చేసుకోమనీ, కొన్నాళ్ళపాటు అతనితోపాటే ఉంటాననీ, తనకి ఏదో ఉద్యోగం చూడవలసిన బాధ్యత కూడా తనదేననీ రాజేష్‌కి ఫోన్‌చేసి చెప్పాడు ముందే.

పొంగుకు వస్తున్న దుఃఖాన్ని బలవంతాన అదిమిపెట్టుకుంటూ బట్టలు సర్దుకుంటున్నాడు అశోక్. మొహం కడుక్కునే బ్రష్ దగ్గరనుంచీ, స్నానం తర్వాత తుడుచుకునే టవల్ వరకూ అతనికి సంబంధించిన ప్రతి వస్తువూ ప్యాక్ చేయడం పూర్తయ్యేసరికి, అప్పటివరకూ ఏడుపుని ఉగ్గబట్టుకున్న తల్లి ఒక్కసారిగా బరస్ట్ అయిపోయింది. బావురుమంటూ ఏడ్చేసింది. మగపిల్లలిద్దరూ కళ్ళలో నీళ్ళు నింపుకుని ఆమెకి దగ్గరగా జరిగారు. అమ్మాయి మాత్రం వెక్కివెక్కి ఏడుస్తూ అశోక్‌ని పట్టేసుకుంది.

అశోక్‌కి దుఃఖం ఆగలేదు. బావురుమంటూ ఏడ్చేశాడు ఒక్కసారిగా. అప్పటివరకూ తన కుటుంబం తనకి దూరమవుతుందన్న ఆలోచనే లేదు అతనిలో. హైదరాబాద్ వెళ్తాడు... ఏదో ఒక పనిచేస్తాడు... డబ్బులు సంపాదిస్తాడు... యింటికి పంపిస్తాడు... ఎంతసేపూ యిదే ఆలోచన మనసులో. వేరే ఆలోచనలకి తావు లేకుండాపోయింది.

ఇప్పుడీ ఏడుపుల వలన తన కుటుంబానికి తను దూరం కాబోతున్నాననే విషయం స్ఫురణకి వచ్చింది.

రేపు ఈ ఇల్లు ఇలాగే ఉంటుంది.

## కొత్తగాలి...

**అమ్మ ఆకలిని**
**కన్నది**
**పసిదాని ఆకలి**
**అమ్మయింది**

**– కొలకలూరి ఇనాక్, హైదరాబాద్**

మంచంమీద తండ్రీ, యింటిపనులు చేసుకుంటూ తల్లీ... చదువుకుంటూ తమ్ముళ్ళూ, చెల్లెలూ... దొడ్లోని వేపచెట్టూ, వీధిలోని చేతిపంపూ... తురాయి చెట్టూ... అన్నీ యిలాగే ఉంటాయి. పుట్టిన క్షణంనించి ఈ క్షణం వరకూ తనతో పెనవేసుకున్న ఈ పరిసరాలు యధావిధిగా అలానే ఉంటాయి.

త...ను ఒ...క్క...డే ఉండడు.

అశోక్‌కి సెండాఫ్ యివ్వడానికి మిత్రులు వచ్చేవరకూ అంతా ఆ దుఃఖ సాగరంలోనే ఉండిపోయారు. తర్వాత కంటి చివరల నిలిచిన దుఃఖపు చారికలని మాత్రం తుడుచుకుని- దుఃఖాన్ని మాత్రం గుండె బరువెక్కేలా మనసులోనే నింపుకుని- అశోక్‌ని బయటికి పంపించారు.

తండ్రికిదంతా తెలియదు. దాదాపు మూడేళ్ళనించీ ఆయనది ఒక్కటే ప్రపంచం. ఆ ప్రపంచంలో ఏ భావానికీ తావులేదు.

ఇప్పుడు కూడా ఆయన తనదైన ప్రపంచంలో అలాగే ఉండిపోయాడు.

★ ★ ★

దుఃఖం మనసు చుట్టూ ముసురుకుంటున్నా, దాని జాడ మాత్రం పైకి తెలియనివ్వకుండా బస్సులో కూర్చున్నాడు అశోక్.

బరువెక్కిన హృదయాలతో స్నేహితులు వీడ్కోలు చెప్పారు. బస్సు వద్దకి వచ్చిన

తమ్ముళ్ళు కన్నీళ్ళు ఆపుకోలేకపోయారు.

సరిగ్గా ఏడు గంటలకి బస్సు బయలుదేరింది.

ఇంటి తాలూకు ఆలోచనలని బలవంతంగా బయటకి నెడుతూ హైదరాబాద్ గురించి ఆలోచనల్లో పడ్డాడు అశోక్.

బస్సులో యాభైమందిదాకా ప్రయాణికులు ఉన్నారు. ఒక్కొక్కరిదీ ఒక్కోపని కావచ్చు హైదరాబాదులో. కానీ తనలాగా పని వెతుక్కుంటూ వెళ్ళేవాడు ఒక్కడూ కనిపించలేదు.

తన ఊరికి సమీపంగా ఉన్న ఈ పట్టణం నుంచి రోజుకి దాదాపు పది బస్సులు హైదరాబాద్ వెళ్తాయి. అంటే అయిదొందల మంది... యింకా రాష్ట్రం నలుమూలలనించీ ఎంతమంది... ఎన్ని మార్గాలద్వారా... ఊహకి కూడా అందదేమో... అంతమందికి దొరికే ఉపాధి తనకీ దొరకకపోతుందా? ... ఏమో? ... చూద్దాం...

బస్సులోని వీడియోలో ఏదో సినిమా వేశారు. మనసు దానిమీద లగ్నం కాకపోయినా కళ్ళు మాత్రం టీవీకి అప్పగించాడు అశోక్.

...సినిమా పూర్తయ్యాక టీవీతో పాటు లైట్లు కూడా ఆర్పివేయబడ్డాయి. అంతా నిద్రకి ఉపక్రమించారు.

చాలాసేపు దొర్లగా దొర్లగా, అసహనంగా సీటులో కదలగా, కదలగా ఎప్పటికో నిద్రపట్టింది అశోక్‌కి.

తెల్లావారేసరికి బస్సు హైదరాబాదులో ఆగింది.

అశోక్ బస్సు దిగేసరికి బస్సు గుమ్మంలోనే కనిపించాడు రాజేష్.

నిద్ర లేచిన క్షణంనించీ టెన్షన్ పడుతోన్న అశోక్ అతడిని చూడగానే రిలీఫ్ ఫీలయ్యాడు.

ఒక బ్యాగ్ అశోక్ తీసుకుంటే, మరో బ్యాగ్ రాజేష్ అందుకున్నాడు. దగ్గర్లో ఉన్న కేఫ్‌లోకి తీసుకెళ్ళి టీ చెప్పాడు రాజేష్.

బయటకొచ్చిన తర్వాత ఆటోమీద రాజేష్ రూమ్‌కి బయలుదేరారు. ముప్పావుగంట తర్వాత ఆ ప్రాంతానికి చేరింది ఆటో. మరో పదినిమిషాల తర్వాత రాజేష్ ఉంటున్న బిల్డింగ్ వచ్చింది.

ఈడ్చుకుంటూ రెండంతస్తులు ఎక్కేసరికి కుక్క 'భౌ' అంది.

అశోక్ ఉలిక్కిపడ్డాడు.

రాజేష్ నవ్వుతూ అశోక్ భుజం తట్టి "కంగారు పడకు. బయటకు రాదులే" అన్నాడు.

పైనున్న రూమ్‌కి చేరుకున్నారిద్దరూ.

ఆ రూమ్‌ని చూడగానే నీరసించిపోయాడు అశోక్.

అప్పటివరకూ అతని ఊహల్లో ఉన్నది లేదు. రూమ్ అంటే పెద్ద గదీ, ఒక పక్కగా మంచం, దానిమీద పరుపు, దుప్పటీ, ఫ్యానూ, ఒక మూలగా టీ.వీ., టీపాయ్ వంటి సౌకర్యాలెన్నో ఆ రూమ్‌లో ఉంటాయి.

తీరా వాస్తవంలోకి వచ్చి చూస్తే-

ఒక మూలగా ఒక చింకి చాప, ఆ పక్కనే స్టవ్, నాలుగు వంట పాత్రలు, మరో మూలన ఎగురుతోన్న పత్రికలు, యింకో మూలన బట్టల మూటల్లో బట్టల బ్యాగులు... అప్పటికే యింకో యిద్దరు ఆ రూములో ఉన్నారు. ఒకడు నేలమీద కూర్చుని అద్దం ఒడిలో పెట్టుకుని గడ్డం గీసుకుంటున్నాడు. రెండోవాడు అప్పటికే ఫ్రెష్ అయినట్టున్నాడు, బట్టలు వేసుకుంటున్నాడు.

అశోక్‌ని ఆ యిద్దరికీ పరిచయం చేసి, చకచకా వంటపాత్రలు సిద్ధంచేసి వంట చేసేశాడు రాజేష్. ముగ్గురూ గబగబా భోజనం చేసేసి పూర్తిగా మేకప్ అయిపో

యారు.

"మేం బయటికి వెళ్ళొస్తాం. అందులో అన్నం ఉంది. కూర అదిగో. కావాలంటే పచ్చడి వేసుకో. ఈ బిల్డింగ్ ఎదురుగానే పెరుగు అమ్ముతారు తెచ్చుకో. యిప్పుడు టిఫినూ, మధ్యాహ్నం భోజనం అంతా అదే. ఈ పూటకి రెస్టు తీసుకుంటే సాయంత్రం వచ్చాక మిగతావి ఆలోచిద్దాం" అన్నాడు రాజేష్.

ఆ రూమ్ పక్కనే ఉన్న బాత్‌రూమ్ చూపించి బయటికి వెళ్ళిపోయాడు.

తాపీగా అన్ని కార్యక్రమాలూ పూర్తిచేసుకున్నాక ఏదో తెలియని ఒంటరితనం ఆవహించింది అశోక్‌ని.

చాపమీద వెల్లకిలా పడుకుని సీలింగ్ వంక చూస్తూ, ఏవేవో ఆలోచనలు సాగిస్తూ చాలాసేపు గడిపాడు. కాసేపు పాత పేపర్లు తిరగేస్తూ గడిపాడు. ఉదయం ఏమీ తినకపోయేసరికి బాగా ఆకలిగా అనిపించి ఆ అన్నం తినేసి మధ్యాహ్నం ఒక కునుకు తీశాడు.

మళ్ళీ ఒంటరిగా ఆలోచించసాగాడు, సాయంత్రం రాజేష్ వచ్చేవరకూ...

★ ★ ★

"నిన్నే ఆదివారం కదా. మళ్ళీ ఆదివారం వరకూ నాకు ఖాళీ ఉండదు. ఈలోగా ఏదో ఒకటి ట్రైచేస్తూ ఉంటాననుకో... ఆ రోజైతే కాస్త నలుగురినీ కలిసి నాలుగుచోట్ల ప్రయత్నించొచ్చు. ఓపిక పట్టి ఈ వారం రోజులు గడిపితే ఏదో ఒకటి దొరుకుతుంది. కొంచెం ఇబ్బందిగానే ఉంటుందనుకో. మొదట్లో నాకూ అలాగే ఉండేది. ఒక్కసారి ఏదైనా పనిలో పడ్డామా, ఇక ఆలోచించడానికి కూడా టైమ్ దొరకదు. అంత బిజీ బిజీ ఇక్కడ..." అన్నాడు రాజేష్.

"సరే!" అన్నాడు అశోక్.

మరికాసేపటికి ఒకరి వెనుకగా ఒకరు రూమ్‌మేట్స్ వచ్చి చేరారు. వాళ్లు వస్తూ వస్తూ కర్రీ పాయింట్‌నించి కర్రీ ప్యాకెట్లు తెచ్చారు. రాజేష్ వంట చేశాడు. అంతా స్నానాలు చేసి భోజనాలు చేశారు. ఆ చిన్న గదిలో చింకిచాప మీద నలుగురూ వరుసగా పడుకున్నారు. క్షణాల్లో వాళ్ళు నిద్రపోయారుగానీ అశోక్‌కి నిద్రపట్టలేదు. కొత్త ప్రదేశం, మనసుకి నచ్చని ప్రదేశం, మరోపక్క దోమలు, బుర్రనిండా ఆలోచనలు. అటూ ఇటూ దొర్లుతూ ఆ సుదీర్ఘమైన రాత్రిని గడిపాడతను.

ఉదయాన్నే వాళ్ళంతా ఒకరి వెనుక ఒకరు వెళ్ళిపోయారు.

అశోక్ ఒక్కడే.

ఆ నాలుగు గోడల మధ్య... చుట్టూ హైదరాబాద్ మహానగరం... మధ్యలో ఒక్కడే. అన్ని లక్షల మంది జనాభాలో ఎవరికీ అతను తెలియదు. వాళ్ళలో ఎవరూ అతనికి తెలీదు.

అతన్ని చుట్టుముట్టి ఉన్నది ఒక్కటే. ఒంటరితనం.

ఒక్కరోజు కాదు, రెండు రోజులు కాదు సు..దీ...ర్ఘ...మై...న వారం రోజులు ఒంటరితనం. మధ్యలో రెండుసార్లు ఇంటికి ఫోన్ చేయడానికీ, కిరాణా షాపుకీ మాత్రమే బయటికి వెళ్ళాడు.

వాళ్ళింటి పక్కనే ఒకరింట్లో ఉంది ఫోను. అక్కడికే చేస్తున్నాడు.

ఆ మహానగరంలో ఉండలేనని అనిపిస్తున్నా, ఇంటికి ఎప్పుడెప్పుడు వెళ్లిపోదామా అని మనసు పీకుతున్నా ఆ విషయం తల్లితో అనలేకపోయాడు.

తన అన్ని బాధలనీ మనసులోనే దిగమింగుకున్నాడు.

ఆ వారం రోజుల ఒంటరితనమూ అతడిలో డిప్రెషన్‌ని నింపింది. ఆత్మన్యూనతతో తనలో తాను కుంచించుకుపోసాగాడు అశోక్. ప్రపంచమంతా బాగానే

ఉందనీ, తనొక్కడే ఎందుకూ పనికిరాని వాడ్ననీ అనుకోసాగాడు. అలవాటు లేని ఆ ఒంటరితనాన్ని భరించలేకపోయాడ తను. మరో పక్కన క్షణక్షణం గుర్తుకొచ్చి బాధని పెంచే కుటుంబసభ్యులు... ఏ భావాల్నీ పంచుకోవడానికి ఎవరూ లేదు.

రాజేష్, అతని రూమ్‌మేట్స్ అశోక్ ఉద్యోగం కోసం ఏదో ప్రయత్నాలు చేస్తూనే ఉన్నారు. అయితే వాళ్ళకి మరీ తీరిక లేకపోవడంతో ఆ ప్రయత్నాలు మందకొడిగా సాగుతున్నాయి.

రెండు వారాలు గడిచేసరికి అశోక్ పరిస్థితి మరీ దారుణంగా తయారయింది. డిప్రెషన్ అతడిని పూర్తిగా వశపరచుకుంది. భరించలేనంత ఆత్మన్యూనత...

సరిగ్గా అదేరోజు యింటికి ఫోన్ చేస్తే, షాపు తియ్యకపోవడం మూలాన అప్పుల వాళ్ళు యింటి మీదకి వచ్చి పడ్డారనీ, మరోపక్క తండ్రి ఆరోగ్య పరిస్థితి బాగాలేదనీ అతడి తల్లి చెప్పి ఏడ్చింది.

అప్పట్నుంచీ అశోక్ బెంగ మరీ ఎక్కువయింది.

"ఎందుకీ వెధవ బతుకు... ఎవర్ని ఉద్ధరించడానికి? ... నావల్ల ఎవరికీ ఉపయోగం లేదు... అందరూ బాగానే ఉన్నారు కదా... నాకే ఎందుకు రావాలి ఇలాంటి కష్టాలు... ఏం పాపం చేశానని యింత మానసిక వేదన... ఏదో సాధించేద్దామని యిక్కడికొచ్చి పడ్డాను... తీరా చూస్తే ఎందుకూ పనికిరానని అర్థమవుతోంది. ఎవర్నో నమ్ముకుంటే జరిగేపని కాదు... భూమికి భారంగా పడివుండటం కన్న చచ్చిపోవడం మేలు..." యిలా ఆలోచిస్తూ ఉండగా మెరిసిందా ఆలోచన... చచ్చిపోవడం మేలు అనుకున్నప్పుడు వచ్చిందది...

"అవును... నేను చచ్చిపోతే నా కుటుంబానికి మూడు లక్షలు వస్తాయి. అన్ని సమస్యలూ పరిష్కారమవుతాయి..."

**కొత్తగాలి...**

**కొత్త క్యాలెండర్‌లో**
**అన్నీ పాత పండుగలే!**
**ఒక్క కొత్త పండుగ లేదు?!**

– కందాళై రాఘవాచార్య,
నిజామాబాద్

అశోక్ పేరుతో తండ్రి యిన్స్యూరెన్స్ పాలసీ కడుతున్నాడు, ఆయన పేరుతో కట్టేది కాకుండా. ఈ మధ్యనే ప్రీమియం కూడా కట్టాడు తను. బతికి తన కుటుంబానికి ఏమీ చెయ్యలేనప్పుడు చనిపోయి ఆ డబ్బు వచ్చేలా చేస్తే వాళ్ళయినా సుఖంగా ఉంటారు. రోజూ యిలా మానసిక వేదన పడుతూ బతకడం కంటే అదే నయం.... మనసులో ఆ ఆలోచన మెదిలినప్పట్నుంచీ నిరంతరం అదే ధ్యాస అయిపోయింది అశోక్‌కి. ఒంటరిగా ఉన్నప్పుడు మరీ తీవ్రమవుతోంది ఆ ఆలోచన.

అతడిలో వచ్చిన ఆ మార్పుని రాజేష్ గమనించినా యింటి మీద బెంగ అనుకున్నాడు. ఎప్పుడూ యిల్లు వదిలి ఉండని వాడు యిలా రావలసి వచ్చేటప్పటికి కుదేలయిపోతున్నాడు అనుకున్నాడు.

అయితే అశోక్‌ని ఎలా ఓదార్చాలో తెలియదు రాజేష్‌కి. ఒక చిన్న ఓదార్పుతో అశోక్ ప్రస్తుత సమస్య సమసిపోతుందని కూడా అతనికి తెలియదు.

ఒక్క క్షణం..

బలహీనమైన ఒకే ఒక్క క్షణం, మనిషి జీవితాన్ని బలమైన మలుపు తిప్పుతుంది. ఆ క్షణంలో తీసుకున్న నిర్ణయం అమలు చేయడానికి మరొక్కక్షణం ఆలోచిస్తే ప్రపంచంలో చాలామంది జీవితాలు మరో రకంగా ఉండి పోయేవి.

క్షణికావేశంలో హత్యలు చేసినవాళ్ళూ

ఆత్మహత్యలు చేసుకున్నవాళ్ళు ఆ క్షణం తాము సరిదిద్దుకునే అవకాశం లేనిపని చేస్తున్నామని అనుకోరు. అలా అనుకుంటే లోకంలో యిన్ని ఆత్మహత్యలు, హత్యలూ, యింకా మరెన్నో ఘోరాలూ ఉండేవి కావు.

ఆ రోజంతా ఆలోచించినా అశోక్, చని పోవడమే సరైన నిర్ణయం అనే నిశ్చ యంతో ఉన్నాడు.

ఇక్కడ యిలా రోజూ మానసిక వేదనని అనుభవిస్తూ, ఒంటరిగా పడి ఉండటం కంటే, ఇదంతా భరించలేక వెనక్కి వెళ్ళి పోయి తన కుటుంబానికి మొహం చూపించడం కంటే తను చనిపోవడమే మేలనే నిర్ణయానికి వచ్చాడు.

అందుకే మరికొంచెం సేపుంటే రాజేష్ రూమ్‌కి వచ్చేస్తాడని గబగబా బయట కొచ్చి నడుస్తున్నాడు.

ట్రాఫిక్ రద్దీగా ఉన్నప్పుడు ఏ లారీ కిందో లేదా ఏ ట్రైన్ కిందో పడిచావడం మంచిదని అతని ఆలోచన. చూడ్డానికి అది యాక్సిడెంట్‌లా ఉండాలి. కావాలని ఆత్మహత్య చేసుకున్నట్టు ఉండకూడదు.

అదే స్థిరనిశ్చయంతో నడుస్తున్నాడు అశోక్.

ఆ క్షణం అతడి మనసులో ఏమీ లేవు. అంతా బ్లాంక్‌గా ఉంది. బతుకు మీద ఆశగానీ, గతం గురించిన ఆలోచనగానీ, తల్లిదండ్రులూ, తోబుట్టువులూ, స్నేహితులకి సంబంధించిన జ్ఞాపకంగానీ ఏమీ లేవు. అలాగే చావుపట్ల భయం కూడా లేదు.

చావు ధైర్యంతో మృత్యువుని వెతుక్కుంటూ నడుస్తున్నాడతను.

★ ★ ★

ఏదో కోలాహలం వినిపించి నడుస్తోన్న అశోక్ తలతిప్పి చూశాడు. రవీంద్రభారతి! అందులో ఏదో మీటింగ్ జరుగుతున్నట్టుంది. ఆ ఆవరణంతా జనం. రోడ్డు అంచుదాకా ఉన్నారు. ఒకటే గోల, గొడవ...

ఎదురుగా పెద్ద విన్నైల్ హోర్డింగ్ మీద ఫోటోని చూసి పక్కన ఆగాడు అశోక్. ఆ ఫోటో అంతలా ఆకర్షించింది అతన్ని.

ఆ ఫోటో ప్రఖ్యాత సినీ గేయరచయిత విరించిది.

విరించి గురించి విపులంగా తెలుసు అశోక్‌కి. అతనన్నా, అతని పాటలన్నా చిన్నతనం నుంచీ ఎంతో యిష్టం అశోక్‌కి. క్యాసెట్ల మీద ఆయన ఫోటోల ద్వారా, ఒకటి రెండు సినిమాల్లో ఆయన వేసిన పాత్రల ద్వారా ఆయన రూపం కూడా సుపరిచితమే.

సినిమాల్లో ఎన్నో మ్యూజికల్ హిట్ పాటలు రాశాడాయన. పైగా అవన్నీ

## హరికథా పితామహుని చతురోక్తులు



**సంగీత సాహిత్యాలలో మేరు శిఖర సమానుడైన హరికథ పితామహుడు ఆదిభట్ల నారాయణదాసు సరస సంభాషణాచతురుడు. ఎంతటివారికైనా హాస్య చమత్కారాలతో నోటికి తాళం వేయగల నేర్పు ఆయన సొంతం. ఆయన చతురోక్తుల్లో మచ్చుకు కొన్ని..**

ఒకసారి దాసుగారు సాహితీ బంధువైన పిఠాపురం రాజావారి దర్శనానికి బయల్దేరారుట. దాన్ని చూసి రాజావారు, 'కవి 'వృషభులు' ఎక్కడికో బయలుదేరారే? ' అన్నారట చమత్కారంగా.

వెంటనే దాసుగారు, 'ఇంకెక్కడికి? కవుల పాలిటి కామధేనువైన తమ వద్దకే' అన్నారట గడుసుగా.

నిండైన సాహిత్య విలువలని కలిగి ఉంటాయి. మేటర్ ఏమిటని ఆసక్తిగా చదివాడు అశోక్.

తెలుగు పాటకి జాతీయ స్థాయిలో అవార్డు వచ్చిన శుభ సందర్భంలో ఆ పాట రచయిత శ్రీ విరించి గారికి నటరాజ కళాసమితి తరపున ఘన సన్మానం... అని కూడా హోర్డింగ్ మీద ఉంది. అతిథులుగా ఆ ఏరియా ఎమ్మెల్యే, ఆ సినిమాలోని హీరో, ఆ సినిమా దర్శకుడు, నిర్మాత, ఆ పాటని కంపోజ్ చేసిన సంగీత దర్శకుడు వచ్చారు.

సినిమా వాళ్ళమీద ఉండే సహజమైన ఆసక్తి వలన కాబోలు అంత మంది జనం... అందులోనూ ఆ హీరో వరుస హిట్లు కొడుతూ ఈ మధ్యనే క్రేజ్ పెంపొందించుకుంటున్నాడు.

ఇక ఆ నిర్మాతకీ, దర్శకుడికీ, సంగీత దర్శకుడికీ, ఎన్నో హిట్ సినిమాలని అందించిన వాళ్ళుగా ముందే క్రేజ్ ఉంది.

అందుకే ఇంత జనం.

అశోక్ నోరు వెళ్లబెట్టుకుని చూస్తున్నాడా జనాన్ని.

"విరించిని అభిమానించేవాళ్ళు ఇంత మంది ఉన్నారా? ... ఆ హీరో నటించిన ఆ సినిమా పాటకి జాతీయ అవార్డు వచ్చిందా? ... ఎప్పటికైనా సంగీత దర్శకుడు ఇళయరాజానీ, పాటల రచయిత విరించినీ కలుసుకోవాలనీ, వాళ్ళిద్దరికీ పాదాభివందనం చేసి ఈ జన్మకిది చాలు అనాలని ఎన్నోసార్లు అనుకునేవాడు తను ఆ రోజుల్లో... ఎంతెంత అద్భుతమైన పాటలు... ముఖ్యంగా వాళ్ళిద్దరి కాంబినేషన్‌లో వచ్చిన పాటలు మరీ మధురాతి మధురంగా ఉండేవి... ఎలాంటి విషయం మీదనైనా సరే మనిషి వందరకాలుగా అనుభవించిన అనుభూతిని నాలుగు అలతి అలతి మాటలతో ఆయన పాట కట్టేవాడు... ఆయన పాటలోని భావాన్ని బాలసుబ్రహ్మణ్యం అత్యద్భుతంగా పలికించేవాడు... ఆ పాటలు పదికాలాలపాటు శ్రోతల్ని ఉర్రూతలూగించేవి. పాటలని కూడా ప్రపంచంలో పెరిగిన వేగం ప్రభావితం చేసింది. ఇప్పుడంతా సంగీత వాద్యాల రణగొణ ధ్వనే తప్ప పాట ఎక్కడా వినిపించడంలేదు. అయినా సినిమాల్లో బరువైన సన్నివేశాల్లో వచ్చే పాటలూ, కాస్త మంచి టేస్ట్ కలిగిన దర్శక నిర్మాతలూ, క్రియేటివ్ దర్శకులుగా పేరు పడ్డవాళ్ళూ, సినిమాని శాసిస్తూ సినిమాలు తీసేవాళ్ళు, అత్యద్భుతమైన ట్యూన్ కట్టిన సంగీత దర్శకులూ... వీళ్ళందరి మొదటి ఛాయిస్ విరించే. ఏనాడూ ఏ పాటలోనూ ఎవరి నమ్మకాన్ని వమ్ము చేయలేదాయన., ఆయన కలం బలం అలాంటిది..." అలా ఆలోచిస్తూ నిలుచున్న అశోక్‌ని ఒక పెద్ద జనప్రవాహం లోపలికి నెట్టుకుపోయింది, అతడి ప్రమేయం లేకుండానే.

ఒక్కసారిగా ఉక్కిరిబిక్కిరి అయిపోయాడు అశోక్. ఊపిరి సలపనట్టుగా ఉంది పరిస్థితి.

వెనక్కిరావడం మాట అటుంచి, కనీసం అటూ ఇటూ కదలడానికి కూడా అవకాశం లేదు.

మళ్లీ వెనకాల నుంచి కెరటంలా తోసుకొచ్చారు జనం. ఆ దెబ్బకి లోపలి హాలులోకి వెళ్ళిపడ్డాడు అశోక్.

"గేట్లు బంద్ చేయండి... గేట్లు బంద్ జేయండి... సెక్యూరిటీ... ఏం చేస్తున్నారక్కడ... జనాన్ని కంట్రోల్ చేయండి... లేదంటే మొత్తం ప్రోగ్రామ్ రసాభాస అయిపోతుంది" ఎవరో అరుస్తున్నారు.

మరికాసేపటికి ఆ హడావిడి సద్దుమణిగింది. ప్రవాహానికి ఆనకట్ట కట్టినట్టు అయింది. నిశ్చలంగా ఎక్కడివాళ్ళక్కడ ఉండిపోయారు.

లోపల మీటింగ్ హాల్‌లోకి అడుగు పెట్టే గుమ్మం పక్కనే గోడకు ఆనుకుని నిలబడ్డాడు అశోక్.

చాలా అసహనంగా ఉంది అతనికి. 'వెధవ జనం' అంటూ తిట్టుకున్నాడు. పోనీ కార్యక్రమమైనా చూద్దాం, విరించి అయినా కనపడతాడు అనుకోవడానికీ లేదు. ఎదురుగా నిలబడిన వాళ్ళ తలకాయలు తప్ప ఏమీ కనబడడంలేదు.

స్పీకర్లలోంచి మాత్రం మాటలు వినిపిస్తున్నాయి. ఉపన్యాసం సాగుతోంది. కచ్చితంగా ఎమ్మెల్యేదే అయివుంటుంది. తమ ప్రభుత్వం గురించీ, ముఖ్యమంత్రి కళాపోషణ గురించీ చెబుతున్నాడు. తమ ప్రభుత్వమే సినిమారంగానికి ఎన్నో రాయితీలు కల్పించి చేయూతనిస్తోందని అంటున్నాడు.

అకస్మాత్తుగా పెద్ద పెద్ద కేకలు, ఈలలు... చాలామంది స్టేజివైపు చూస్తూ చేతులు ఊపుతున్నారు.

అప్పటికర్థమైంది అశోక్‌కి వాళ్ళంతా ఎవరికోసం వచ్చారో... ఆ సినిమా హీరో కోసం... అతని అభిమానులై ఉంటారు. ఇప్పుడు అతను స్టేజిమీదకి వచ్చినట్టున్నాడు. అందుకే అంత కోలాహలం...

ఎమ్మెల్యే ప్రసంగం అయిపోగానే హీరో కాబోలు మైకు ముందుకొచ్చాడు. మళ్లీ గోల...

"అందరూ నన్ను క్షమించాలి. ఫిల్మ్‌సిటీలో నా నెక్స్ట్ ఫిల్మ్ షూటింగ్ జరుగుతోంది. అందరికీ తెలుసుగా... అంజలి మూవీస్ వారి సినిమా... ఇప్పుడే వెళ్ళాలి.

శ్రీ విరించిగారి పాటకి జాతీయ అవార్డు రావడం మనందరికీ గర్వకారణం. ఆ పాట నేను హీరోగా నటించిన సినిమాలోనిది అవ్వడం నా అదృష్టం. అంత మంచి పాటకి ప్రేరణ అయ్యే సన్నివేశాన్ని సృష్టించిన మా దర్శకుడికీ, అంత మంచి సన్నివేశానికి తగ్గట్టు అద్భుతమైన పాట రాసిన విరించి గారికీ, మా ప్రొడ్యూసర్‌గారికీ నా కృతజ్ఞతలు తెలుపుకుంటూ, ఈ శుభసందర్భంలో ఇక్కడ ఉండలేకపోతున్నందుకు మరోసారి అందరినీ క్షమించమని కోరుకుంటూ... సెలవు..."

అతని మాటలు పూర్తయ్యాయో లేదో మళ్ళీ ఈలలు, కేకలు... వాటితో కలసి చప్పట్లు.

హీరో స్టేజి దిగి వెళ్ళిపోతున్నట్టున్నాడు. అంతా చేతులూపుతున్నారు. కొద్దిసేపట్లోనే అతడ్ని దగ్గర్నించి చూడాలని కాబోలు అంతా బయటకి పరిగెత్తారు.

ఆ పరిగెత్తిన వాళ్ళలో చాలామంది తిరిగి లోపలికి రాకపోవడంచేత హాలు సగం ఖాళీ అయింది.

ఇప్పుడు కొంచెం వెసులుబాటుగా ఉంది లోపల.

తను కూడా బయటికి వెళ్లిపోదామనుకున్నవాడు కాస్తా స్టేజి మీద మనుషులు బాగా కనిపిస్తూ ఉండడంతో ఆగాడు అశోక్. ముఖ్యంగా విరించి.

నిలబడినవాడు నిలబడినట్టుగానే శిలలా ఉండిపోయి తదేకంగా చూడసాగాడు అశోక్.

పిట్టలా చిన్నమనిషి విరించి. అయితేనేం? ఆ కళ్లలో ఏదో శక్తి ఉంది. ఎంతో విజ్ఞానం ఉంది. పొట్టిగా కనిపిస్తున్న ఆ చేతులే వేలాది అద్భుతమైన పాటల్ని రాసింది... నూనె పెట్టి, నొక్కి దువ్విన జుత్తుకింది ఆ బుర్రనించేనా చమత్కారాలతో కూడిన ఆలోచనలు ఉద్భవించింది... ఏదేమైనా ఆయన జన్మ ధన్యం... ఇప్పుడీ అవార్డు ఆయనకి రావడం వలన ఆ అవార్డ్ కూడా ధన్యత పొందింది...

నిర్మాత ప్రసంగం అయిపోగానే దర్శకుడి ఉపన్యాసం మొదలైంది. అయితే

అతను ఎక్కువసేపు మాట్లాడలేదు. క్లుప్తంగా నాలుగు మాటలు మాట్లాడాడు. సెలవు తీసుకుని కూర్చున్నాడు.

"ఇప్పుడు జాతీయ అవార్డు గ్రహీత విరించిగారు మాట్లాడతారు" ఆ మాటలు వినగానే ఏకధాటిగా చప్పట్లు కొట్టారు జనం.

అశోక్ కూడా అప్రయత్నంగా చప్పట్లు కొట్టాడు.

అందరికీ నమస్కారంచేస్తూ మైకు ముందుకొచ్చాడు విరించి. "అందరికీ నమస్కారం....

నా పాటకి జాతీయ అవార్డు రావడమంటే అది తెలుగు బాషకి దక్కిన గౌరవం అనుకుంటున్నాను... నా చేత వేలాది పాటలు రాయించిన దర్శక నిర్మాతలకీ, వాటికి మంచి ట్యూన్లు కట్టిన సంగీత దర్శకులకీ, నా పాటలని అభిమానించి ఆదరించిన ప్రేక్షక దేవుళ్లకీ ఈ అవార్డు అంకితమిస్తున్నాను.

"ఎదురుగా ఉన్నది చిట్టచివరి గోడని
ఏడుస్తూ చెప్పుకోకు నీ గోడుని
కాస్త దూరంగా సారించు నీ దృష్టిని
అదే యిస్తుంది
గమ్యానికి చేరే శక్తిని..."

నా పాటలో నాకూ, చాలామంది శ్రోతలకీ నచ్చిన చరణాలివి. నిజానికి నేనేనాడో రాసుకున్న వాక్యాలవి.

ఈ సినిమాలో వాటికి తగిన సిట్యుయేషన్ ఉండటంతో ఆ వాక్యాలని కలుపుతూ పాట రాశాను.

కోరుకున్నవన్నీ దూరమైపోతున్నాయని నిరాశ చెందిన హీరో ఆత్మహత్య చేసుకోవాలని బయలుదేరుతుంటే నేపథ్యంగా వచ్చే పాట యిది... చాలా సందర్భాల్లో నేను వెలువరించే భావాల్ని ఆలంబనగా చేసుకుని ఆ సన్నివేశాన్ని కూర్చానని దర్శకుడు రాజా యిప్పుడే మాకు చెప్పారు.

అయితే ఈ సందర్భంగా మీకొక విషయం చెప్పాలని నాకు అనిపిస్తోంది. మీరంతా చాలాసార్లు వినే ఉంటారా మాటలని...

ఆత్మహత్యలు చట్టరీత్యా నేరం. మహా పాపం కూడా.

ఈ ప్రపంచంలో రోజూ కొన్ని వేల మంది ఆత్మహత్యలు చేసుకుంటున్నారు. ఇంకా చాలా జీవితం ఉండగానే బలవంతంగా ప్రాణాలు తీసుకుంటున్నారు. ప్రమాదవశాత్తుగానో, మరొకరి చేతిలోనో ప్రాణాలు పోగొట్టుకునే వారిది ఒక రకం విషాదం. కానీ బలవంతంగా ప్రాణాలు తీసుకునేవారిది మాత్రం చాలా ఘోరమైన విషాదం.

నాకేనాటినించో ఈ విషయాలు చెప్పాలని కోరిక. బాధ గాయంలా సలుపుతుంటే మందు యిమ్మని మరణాన్ని అడగకు, అడగకు అంటూ ఒక పాటలో రాశాను. ఇంతకాలానికి విపులంగా రాసే అవకాశం వచ్చింది. ఆ పాటకే జాతీయ అవార్డు వచ్చి దాన్ని మరింత పాపులర్ చేసింది.

ఇవన్నీ కాకుండా సమాజానికి కొన్ని మాటలూ చెప్పే ఉద్దేశంతో, నా జీవితం పది మందికి స్ఫూర్తి కావాలనే ఆశయంతో, నా గాథ తెలిసిన వారైనా ఎన్నడూ ఆత్మహత్యకి ప్రయత్నించకుండా ఉంటారనే ఆశతో నా ఆత్మకథని పుస్తక రూపంలో తెచ్చాను. దాన్ని అమ్ముకుని

**కొత్తగాలి...**

**ప్రజలు**
**డిపాజిట్లు**
**పోగొట్టగలరు**
**పోగొట్టుకోగలరు!**

**– బి.కృష్ణవేణి, చెన్నై**

సొమ్ము చేసుకునే ఉద్దేశ్యం నాకు లేదు. అందుకే నామమాత్రపు ధరకే దాన్ని మార్కెట్లోకి తెచ్చాం. ఈ సభకి వచ్చిన వారికి ఆ పుస్తకం ఉచితంగానే దొరుకుతుంది. ఆసక్తిగల వాళ్లు వెళ్లేటపుడు బయట ఏర్పాటు చేసిన స్టాల్‌లో తీసుకోవచ్చు.

సరే, ఆ విషయం గురించి నేను ఇంతలా ఎందుకు చెప్తున్నాను? ఏకంగా పుస్తకం ఎందుకు రాశాను? అదే అంశంతో రాసిన పాటకి జాతీయ అవార్డు వచ్చినందుకు మాత్రం కచ్చితంగా కాదు...

ఎందుకంటే ఒకనాడు నేనూ ఆత్మహత్యకి ప్రయత్నించాను కాబట్టి. ఆరోజు నేను చనిపోయి ఉంటే ఇదంతా కోల్పోయి ఉండేవాడ్నన్న బాధ నన్ను నిరంతరం వెంటాడుతుంది కాబట్టి.

ఆ మాటలతో ఒక్క క్షణం నిశ్శబ్దం ఆవరించిందా హాల్లో. అందరూ బిగుసుకుపోయినట్లు అయిపోయారు.

అశోక్ అయితే మరీను. ఆయన నోటి వెంట ఆత్మహత్య అన్నమాట రాగానే అతడు ఉలిక్కిపడ్డాడు.

మిగతా మాటలు వింటూ "ఈయనకేం ఎన్నయినా చెప్తాడు? ఒడ్డున నిలబడి ఉన్నవాడికి నీటిలో కొట్టుకుపోతున్నవాడిని చూస్తూ ఏదయినా చెప్పడం ఎంతో ఈజీ. దిగితే తెలుస్తుంది లోతు. ఈయన స్థానంలో నేనుంటే ఈయనకన్నా బాగా చెప్పుదును నీతి వాక్యాలు..." అనుకున్నాడు.

అయితే చివరి వాక్యాలు అశోక్‌లోని చులకన భావాన్ని తుత్తునియలు చేశాయి. అందులోనూ ఆ మాటలు చెప్తున్నపుడు ఆయన కంటికొసన కన్నీరు...

కంటి చివర నిలిచిన ఆ కన్నీటి బొట్టుని పట్టుకోవడానికి వందలాది కెమెరాల ఫ్లాష్‌లు పోటీపడ్డాయి.

పొంగుకొస్తోన్న దుఃఖంతో బొంగురుపోతోన్న గొంతుని గొంతు సర్దుకున్నట్టుగా నటిస్తూ సర్దేశాడాయన.

"ఒకప్పుడు నేను చాలా దారుణమైన కష్టాన్ని అనుభవించాను. పూట తిండికి కూడా లేకుండా పస్తులున్నాను. జీవితంతో పోరాడి పోరాడి అలసిపోయాను. ఇంక పోరాడే ఓపిక లేదనుకున్న క్షణం ఆత్మహత్య చేసుకుందామని నిర్ణయించుకున్నాను.

నేను చదివిన పుస్తకాలు గానీ, వాటి ద్వారా నేను పొందిన జ్ఞానం గాని ఏదీ గుర్తురాలేదా క్షణం. కేవలం చచ్చిపోవాలన్న ఆలోచన తప్ప మరొకటి నా మనసులో లేదు. కానీ చిత్రమైన ఊహించని సంఘటనలతో నేను నా ప్రయత్నాన్ని వాయిదా వేసుకున్నాను. ఫలితం మీ కళ్ల ముందే ఉంది.

నేను ఒక్కో విజయమూ సాధిస్తూ, ఒక్కో మెట్టు ఎక్కుతున్నపుడల్లా నాకు నా గత జీవితం గుర్తుకొస్తూనే ఉంది. అనుక్షణం నన్ను బాధిస్తూనే ఉంది. యిదికాక పేపర్లలో ఎవరైనా ఆత్మహత్య చేసుకున్నారన్న వార్త విన్నా, చదివినా ఎంతో కలత పడిపోతాను నేను. నా వంతుగా నేను ఆత్మహత్య ప్రయత్నాల్ని ఆపడానికి ఏదో ఒకటి చేయాలని అనుకుంటూ ఉంటాను. నా చాలా పాటల్లో ఈ విషయం చెప్పాను. ఆశావాదాన్ని రంగరిస్తూ ఆ పాటలు రాశాను. యిప్పుడు నా ఆత్మకథని వెలువరించాను. అందరూ చదవడానికి వీలుగా నామమాత్రపు ఖరీదు పెట్టాను. అలాగే అన్ని గ్రంథాలయాలలోను అది దొరికే ఏర్పాటు చేస్తున్నాను.

దయచేసి అది చదివినవారు, మరింత మందితో చర్చించండి. మీ ఎరుకలో యిబ్బందుల్లో ఉన్నవాళ్ళని గమనించండి. వాళ్ళని ఓదార్చండి. ఆత్మహత్య ఆలోచనల

నించి బయటపడెయ్యడానికి ప్రయత్నించండి.

ఈ క్షణంలో సభాముఖంగా నేను కొన్ని మాటలు చెప్పదలచుకున్నాను. ఆ మాటల వలన కనీసం ఒక్కరు ఆత్మహత్య ప్రయత్న నుంచి విరమించుకుంటే నా మాటలకీ, నా పుస్తకాలకీ సార్ధకత లభించిందని భావిస్తాను.

భగవంతుడు మనకోసం జీవితం మొత్తం మీద ఎక్కడో ఏదో పెట్టి ఉంచుతాడు. లేకుంటే మనల్ని సృష్టించి ఉండేవాడు కాదు. అయితే మనకోసం ఏదీ లేదనుకుని అక్కడితో జీవితాన్ని ముగించాలనుకోవడం మూర్ఖత్వం. అందుకే మన సనాతన ధర్మాలు సైతం ఆత్మహత్య మహా పాతకం అన్నాయి.

జీవితమంటే గులాబీ మొక్కని కింద నుంచి పైకి ఎగబాకడం లాంటిది. ఎక్కే క్రమంలో చెయ్యివేసిన చోటల్లా ఒక్కో ముల్లు తగులుతుంది. యింక చాలు. యిక్కడితో ఆపేద్దాం అని పదేపదే అనిపిస్తూ ఉంటుంది. పక్కకి చూస్తే పచ్చపచ్చగా మెరుస్తూ ఆకుల్లాంటి జీవితాలు కూడా కొన్ని కనిపిస్తాయి. వాటితో పోల్చుకుని మనకి ముళ్ళు తప్ప ఏవీ లేవనుకుంటే దుఃఖమే మిగులుతుంది. కానీ మనకోసం కూడా ఏదో ఉందని పట్టుదలతో పైకి వెళితే చక్కటి గులాబీ మన స్వంతమవుతుంది.

మన చేతికున్న అయిదువేళ్ళు సమానంగా ఉండవు. ప్రపంచంలో ఏ యిద్దరి జీవితాలూ ఒకలా ఉండవు. మన జీవితాన్ని మరొకరితో పోల్చుకుంటూ కుంగిపోవడం మహాదారుణం. అన్నింటికన్నా చిన్నదైన చిటికెన వేలిమీదనే శ్రీకృష్ణుడు గోవర్ధనగిరిని పైకి లేపాడు.

మూర్ఛపోయిన లక్ష్మణుడికి స్వస్థత చేకూర్చడానికి సంజీవని కావాల్సి వచ్చింది. రాముడి ఆజ్ఞతో ద్రోణ పర్వతాలకి వెళ్ళిన హనుమంతుడికి సంజీవని ఏదో తెలియదు. అవతల స్పృహలో లేని లక్ష్మణుడు, ఇవతల మూలిక ఏదో తెలియని అయోమయం. ద్రోణ పర్వతాలంత పెద్ద సమస్య. దాన్ని తలచుకుంటూ కుమిలిపోతే హనుమంతుడు పిపీలీకం అంత అయిపోయేవాడు. సమస్య అలా కొండలాగానే ఉండిపోయేది. కానీ హనుమంతుడు ఏం చేశాడు? సమస్యకన్నా పెద్దగా ఎదిగాడు. సమస్యనే పిపీలీకం అంతచేసి తను మాత్రం పర్వతమంత ఎదిగి, కొండని మోసుకొచ్చి తన రాముడి ముందు పెట్టాడు. మనం కూడా అంతే. సమస్యల్ని పెద్దవిగా చేసుకుని చూడడం మానేద్దాం. స్థిత ప్రజ్ఞతతో ఆలోచించి సమస్యని చిన్న

## ముందరి కాళ్లకు బంధం

దాసుగారి హరికథ అర్ధరాత్రి దాటటంతో ముందు వరుసలోని భక్తుడు గట్టిగా ఆవలించాట్ట. ఒకవేళ ముందు వరుసలోని వాడు ఆవలించి నిద్ర ఆపుకోలేక మెల్లిగా లేచివెళ్లాడా, గొర్రెల మందలా చాలామంది అతన్ని అనుసరించే ప్రమాదమూ ఉంది! అందుకే దాసుగారు అతణ్ణి, అలాంటివారిని ఉద్దేశించి-



'ప్రథమం ఆవలించటం
ద్వితీయం కాళ్లు చాపటం
తృతీయం తుళ్లిపడటం
చతుర్థం లేచిపోవటం'

అన్నార్ట. అంతే! జనం పెద్దగా నవ్వేసరికి, ఆవలించేవాళ్లు, నిద్రలో జోగుతున్నవాళ్లు కిమ్మనకుండా కాళ్లకు బంధం వేసినట్లు కూర్చుండిపోయారట.

దిగా చేసుకుందాం. సమస్యల్ని చూసి భయపడడం మానేసి, మనల్ని చూసి సమస్యలే భయపడి పారిపోయేలా చేద్దాం.

ఏ సమస్యకీ చావు చిట్టచివరి శాశ్వత పరిష్కారం కాదని మనం గుర్తుంచు కుందాం. పదిమందికి గుర్తుచేద్దాం.

ఈ బలవంతపు మరణాల్ని ఇక్కడితో ఆపేద్దాం...

ఇక మాట్లాడలేనట్టుగా మాటలాపేసి, అందరికీ చేతులు తలపైదాకా లేపి జోడిస్తూ.. నెమ్మదిగా తన సీటు దగ్గరికి నడవసాగాడు విరించి.

ఒక్క క్షణం నిశ్శబ్దం తర్వాత సముద్రపు హోరులా చప్పట్లు. ఎంతకీ ఆగని చప్పట్లు... ఆపాలని కూడా ఎవరికీ తోచ లేదు.

ధారాపాతంగా కారుతోన్న కన్నీళ్లని తుడుచుకోవాలని కూడా తోచలేదు అశో క్‌కి.

విరించి మాటలు, తన మనసులో గడ్డ కట్టుకుపోయిన బాధలని కరిగించినట్టు అయింది అతనికి. ఆత్మీయమైన స్పర్శకి కరిగి వర్షించిన దిగులు మేఘాలవలె అతడి కళ్లు వర్షించసాగాయి.

ముందున్నదంతా చీకటేనని నిరాశతో నిండిపోయిన వాడికి కాస్త ఓపికపడితే వెలుతురు కనిపిస్తుందని ఓదార్చి ధైర్యం చెప్పినట్టుగా అనిపించింది.

తను తొందరపడి తీసుకున్న నిర్ణయాన్ని తాత్కాలికంగా వాయిదా వేయదలచుకుని బయటికి నడిచాడు.

విరించి చెప్పినట్టే బయట స్టాల్‌లో పుస్తకాలు ఉచితంగా ఇస్తున్నారు. ఒకరి ద్దరు అశోక్ కళ్లముందే అవి తీసుకుని వెళుతూ ఉన్నారు.

అశోక్ కూడా అప్రయత్నంగా నడిచి ఆ స్టాల్ ముందు నిలిచాడు. లోపలి వైపున కుర్చీలో కూర్చున్న వ్యక్తి అతనికి ఒక పుస్తకం అందించాడు.

'ఆత్మకథ' అన్న పేరుగల పుస్తకం అది. పైన పుస్తకం పేరు... కింద రచయిత పేరు... మధ్యలో బొమ్మ.

తలదించుకుని లోయవైపు నడుస్తోన్న మనిషి... పైన ఆకాశంలో ఉదయిస్తోన్న సూర్యుడు.. పక్కగా ఎగురుతోన్న పిట్టలూ... మరో మూలన కష్టిస్తోన్న కూలీ... అడవిలో పుల్లలు మోస్తూన్న ఒక ముసలి వాడు... డ్రైనేజీలో పూడిక తీస్తోన్న ఒక బాలిక...

పుస్తకం తీసుకుని బయటకి అడుగులు వేశాడు అశోక్.

ఈసారి ఆ అడుగుల గమ్యం తన గది వైపు... ఆశావహమైన భవిష్యత్తు వైపు... అతని మనసునిండా విరించి మాటలే.. ఆ మాటలే ప్రోత్సాహకాలై ముందున్నదంతా మంచి కాలమేనని హుషారు చేస్తున్నాయి.

అయితే వాటి జీవిత కాలమెంతన్నది కాలమే తేల్చాలి.




"ఎక్కడికెళ్ళిపోయావ్ అశోక్? నీ గురించి మేమంతా ఎంత కంగారు పడ్డామో తెలుసా! నీకసలే కొత్త... ఆ అవ తారం ఏంటి? ఏంటలా అయిపోయావ్? ఎనీథింగ్ సీరియస్? ..." అడిగాడు రాజేష్.

"ఏమీ లేదు... ఊరికే బయటకి

వెళ్లాను. ఏదో ఆలోచిస్తూ కాస్త దూరం వెళ్లిపోయాను. అందుకే ఆలస్యమైంది" నీరసంగా చెప్పాడు అశోక్.

"నువ్వేం బెంగ పెట్టుకోకు. త్వరలోనే ఏదో ఒక ఉద్యోగం చూస్తాను. దాని గురించి ఎక్కువగా ఆలోచించి మనసు పాడుచేసుకోకు. నేనిక్కడికి వచ్చిన కొత్తల్లో నాకూ ఇలాగే ఉండేది. పిచ్చి పిచ్చిగా... అధైర్యంగా... ఇంతమంది జనం మధ్యన మనం ఎలా బతకగలం అని భయం భయంగా ఉండేది. కొన్నాళ్లకి ఈ పని దొరికింది. అక్కడా అంతే, కాస్త కొత్తగా అదోరకంగా ఉండేది. తర్వాత నెమ్మదిగా అలవాటైపోయింది. ఇప్పుడు మన ఊరు వస్తే నాకేం తోచదు. పిచ్చిపిచ్చిగా అనిపిస్తుంది. ఎప్పుడు ఇక్కడికి వచ్చేద్దామా అనిపిస్తుంది" అశోక్ భుజంమీద చెయ్యివేసి ఓదార్పుగా అన్నాడు రాజేష్.

అశోక్ ఏమీ మాట్లాడలేదు.

"అనుకున్నంత పట్టించుకోకుండా ఏమీ లేదు రాజేష్... నేనే అనవసరంగా ఏవేవో ఊహించుకున్నానేమో..." అనుకోసాగాడు అశోక్.

"సరే. ముందెళ్లి స్నానంచేసి ఫ్రెష్ అయ్యి రా. మరీ మట్టికొట్టుకు పోయినట్టున్నావు. వెళ్లు. వెళ్లు త్వరగా. వేడివేడిగా భోజనం చేద్దువు. ఇక్కడి వంటలు కూడా కొత్తగా అనిపిస్తాయి కానీ అది కూడా అలవాటైపోతుంది" అన్నాడు రాజేష్.

అశోక్ బాత్రూంకెళ్లి స్నానం చేసి వచ్చేసరికి అన్నం వడ్డించేశారు వాళ్లు.

నలుగురూ కూర్చుని ఒకేసారి భోజనం చేయసాగారు.

భోజనాల మధ్యలో వాళ్లు కూడా అశోక్‌కి ధైర్యవచనాలు చెప్పారు. అశోక్ మరీ సిగ్గుపడిపోయాడా క్షణం.

మరో అరగంటకి వాళ్లు నిద్రపోయారు. అశోక్ వెల్లకిలా పడుకుని తలకింద బట్టల బ్యాగ్ ఎత్తుగా పెట్టుకుని పుస్తకం తెరిచాడు.

## కొత్తగాలి...

**బుసకొట్టే విషనాగులు**
**సొంత మేడ కట్టవుగా!**
**శ్రమచేసే చిరుచీమలు**
**పరుల కొంప ముంచవుగా!!**

– రేగులపాటి కిషన్‌రావు, కరీంనగర్

★ ★ ★

### ఆత్మకథ

నాకు ఊహ తెలిసిన నాటినుంచి సినిమా పాటల రచయితగా నిలదొక్కుకునే వరకూ నాతో సాహచర్యం చేసిన ఆకలికీ... అర్థాకలికీ..

నా ఆత్మకథ అంకితం

–విరించి

భగవంతుడు మనకోసం జీవితం మొత్తంమీద ఎక్కడో ఏదో పెట్టే ఉంచుతాడు. లేకపోతే మనల్ని సృష్టించి ఉండేవాడు కాదు. కాస్త ఓపికపట్టి జీవనం సాగిస్తే మనకోసం కేటయించబడినది మనకి కచ్చితంగా దక్కుతుంది. ప్రపంచంలో దేన్నీ ఏ ఒక్కరికోసమో సృష్టించలేదు దేవుడు.

అయితే మనకోసం ఏదీ లేదనుకుని మన జీవితాన్ని మనమే ముగించాలనుకోవడం మూర్ఖత్వం. ఆత్మహత్య చేసుకోవడం దైవధిక్కారం.

విజేతలై నిలిచిన ప్రతివారి వెనుకా ఎన్నో వైఫల్యాలు ఉంటాయి. ఆ వైఫల్యాలకి జడిసి అక్కడే ఆగిపోయినా, జీవితాన్ని అంతటితో ముగించేసుకున్నా మనం ఇవాళ ఇంతమంది విజేతల్ని చూడగలిగేవాళ్ళమే కాదు.

సర్వస్వం కోల్పోయిన మనిషికి కూడా ఒకటి మాత్రం మిగిలే ఉంటుంది. అది అతడి భవిష్యత్తు. దాన్ని ఎలా మార్చుకో

వాలన్నది కూడా అతడి చేతిలోనే ఉంటుంది. కష్టపడి పనిచేసి దాన్ని పూల తోటలా మార్చుకుంటాడో, చేతులు ముడు చుక్కూర్చుని మోడువారేలా చేసుకుంటాడో అతడిష్టమే.

భగవంతుడు పనీ ఇస్తాడు. పనిముట్లనీ ఇస్తాడు. వాటినెలా ఉపయోగించుకుంటా మనే విషయం మీదే మనిషి జీవనగ మనం ఆధారపడి ఉంటుంది.

నా అనుభవం నాకు చెప్పిందీ, నేను చూసిన ఎందరో ప్రముఖుల జీవితాలు నేర్పిందీ, నేను అందరితో చెప్పాలకున్నదీ ఒక్కటే.

ఆత్మహత్య మహాపాతకం. అది చట్ట రీత్యా నేరం. అన్నింటికీ మించి అది దైవ ధిక్కారం.

తూర్పుగోదావరి జిల్లాలోని రాజులపూడి గ్రామం.

ఆ గ్రామంలో రాజులెవరూ లేరు. అందరూ సామాన్యులే. సామాన్యుల్లోకెల్లా సామాన్యులు.

గ్రామంలోని మనుషులంతా వ్యవసాయ కూలీలే. పక్కనే ఉన్న మరో గ్రామంవాళ్ల భూముల్లో నిత్యం దొరికే పని వాళ్లనక్కడ ఉంచగలిగింది.

కుటుంబం కుటుంబం అంతా కూలీకి వెళ్ళడం ఆ ఊరి అలవాటు. అయితే దాదాపు ఊరంతా పనిచేసినా ఊరి పరిస్థితిలో మాత్రం ఏనాడూ ఏ మార్పూ లేదు.

ఊరంతా తాటాకు పాకలు, ఎప్పుడూ మట్టికొట్టుకుపోయి ఉండే బట్టలు, ఆ బట్టల్లో ఆ ఊరి మనుషులు.

రోజూ ఉదయాన్నే లేచి గబగబా అన్ని కార్యక్రమాలు పూర్తిచేసుకుని వంటచేసుకుని ఆదరాబాదరా తినెయ్యడం, తర్వాత కేరేజీల్లో, గిన్నెల్లో సద్దిని నింపుకుని పనులకి వెళ్ళడం, పగలంతా పొలాల్లో పనులు



చేయడం, మధ్యాహ్నం తెచ్చుకున్న సద్దిని తినేసి సాయంత్రందాకా పనులు చేసి, సాయంకాలం పొద్దువాలుతుండగా ఇంటికి చేరుకోవడడం, పిల్లలంతా ఆటపాటల్లో పడటం, ఆడవాళ్లు స్నానాలు చేసి సాయంత్రం వంటపనిలో పడడం, మగాళ్లు స్నానాలు చేసి ఊరి మధ్యలో ఉన్న సారా కొట్టు దగ్గర చేరడం..

నిత్యం ఆ గ్రామం యొక్క దినచర్య అది.

తరం నుంచి తరానికి ఆ ఊరి చుట్టూ



ఉన్న భూములు ఆస్తి పంపకాల ద్వారా చేరతాయి. ఆ భూముల్లో పనులు కూడా ఆ ఊరి జనాల సంతతికి తరం నుంచి తరానికి చేరుతూ ఉంటాయి.

నిత్యం పనులు చేసుకోవడం, పనులు లేనినాడు మూకుమ్మడిగా కూర్చుని కాల క్షేపం చేయడం, ఉన్నదాంతో సరిపుచ్చుకో వడం, ఇంకా కావాలని ఆశించకపోవడం, ఎదగొచ్చునేమోనన్న ఆలోచనే లేకపో వడం, మూఢనమ్మకాలని వదులుకోకపో వడం, చదువుకోకపోవడం, తాము పని చేసే యజమాని నుండిగానీ, తాము ఓట్లు వేసి గెలిపించిన ప్రభుత్వం నుండి గానీ తమకి 'న్యాయంగా' రావలసినవి కొన్ని ఉంటాయనిగానీ, కాస్త సంఘటితంగా ఉండి డిమాండ్ చేయడం ద్వారా వాటిని పొందగలుగుతామనిగాని ఆ అమాయక కూలీజనాలకి తెలియదు.

అలాంటి అమాయక కూలీజనంలో ఒకడు లక్ష్మయ్య. అంతా లచ్చన్న

అంటారు. అతడే మా నాన్న.

రాజులపూడి నుంచి పది కిలోమీటర్ల దూరం ఉన్న గ్రామం జనుపల్లె.

ఆ గ్రామంలోని ప్రధాన వీధులన్నీ దాటిన తర్వాత ఊరికి కాస్త ఎడంగా కాల వగట్టున వరుసగా ఉండే పాకల సముదాయమే నారాయణపేట.

పొలాల్లో కూలీపనులు, ఇళ్లు కట్టేటప్పుడు ఇటుకలు అందించడం, ఇసుక మోయడం, పునాదుల గోతులు తవ్వడం, కొబ్బరికాయల ఒలుపు, వాటి ఎగుమతి, దిగుమతి, కొబ్బరికాయల దింపు, ఇళ్లలో ఉండే రకరకాల పనులు... ఇవీ నారాయణపేట జనానికి జీవనాధారం.

రెక్కాడితేగాని డొక్కాడని జనం గనుక వాళ్లెప్పుడూ రెక్కలు ఆడిస్తూనే ఉంటారు.

రాజులపూడి లాగానే జనుపల్లెలో కూడా కూలీపనులు చేసే మగాళ్ల సంపాదన అంతా సారాకొట్టుకే వెళ్లిపోతుంది. మిగతా కుటుంబసభ్యుల రాబడితోనే ఇల్లు నడుస్తూ ఉంటుంది.

ఏరోజు వెచ్చాలు ఆ రోజు, బియ్యంతో సహా కొనుక్కు తెచ్చుకుని వంట చేసుకోవడం వాళ్లకి అలవాటు.

పనులు లేని రోజుల్లో పచారికొట్టువాడు అరువు పెడితే సరేసరి. లేదంటే పస్తే.

మగాళ్లు మాత్రం ఏనాడూ పస్తులుండరు సారా విషయంలో. ఇంట్లో ఉండే చెంబులూ, తపేలాలు దగ్గర నుంచి పెళ్లాం మెడలో పుస్తెల వరకూ.. అప్పటి దాకా అవి ఇంకా మిగిలి ఉంటే.. వాటిని తాకట్టు పెట్టి తాగేస్తూ ఉంటారు.

ఇంతకీ ఆ తాకట్టు అన్నది మిథ్య. ఎందుకంటే ఆ వస్తువులు తిరిగిరావు. పోనీ ముందే అమ్మేయొచ్చు కదా అంటే అమ్ముకుంటే కొనలేం. తాకట్టులో ఉంటే ఎప్పుడోకప్పుడు డబ్బులు ఉన్నప్పుడు విడిపించకోవచ్చు కదా అంటుంటారు వాళ్లు.

ఆ ఎప్పుడోకప్పుడు ఎన్నటికీ రాదు. డబ్బులు ఉండటం అన్నది ఏనాడూ జరగదు.

అలాంటి సవాలక్ష కుటుంబాల్లోని ఒక కుటుంబంలో పుట్టి పెరిగింది వరాలు అనబడే వరలక్ష్మి.

మా అమ్మ.

★ ★ ★

రాజులపూడిలో మా ఇంటికి నాలుగిళ్లవతల ఉండే సూరమ్మ మామ్మకి జనుపల్లెలోని నారాయణపేటలో బంధువులెవరో ఉన్నారు.

సూరమ్మ మామ్మ ఆ బంధువుల ఇంటికి వెళ్లి వచ్చే క్రమంలో వరాలుని చూసింది. వాళ్లింట్లో కూర్చున్నప్పుడు వాళ్లు కూడా మా అమ్మాయికి మంచి సంబంధం ఉంటే చూడమని సూరమ్మ మామ్మతో అన్నారు.

అప్పటికి సరేనని వచ్చేసిన మామ్మకి రాజులపూడి వచ్చేశాక లచ్చన్నని చూడగానే ఆ విషయం మనసులో మెదిలింది.

"ఏం కొడుకా! ఇంకా పెళ్లి చేసుకోవా... ముడ్డి కిందికి పాతికేళ్లు వస్తా ఉన్నాయి..." అంది.

"ఏది పిన్నమ్మా... మంచి సంబంధం ఏదైనా ఉంటే చేసుకుందామనే చూస్తంట"

"ఇలారా... కూకో... నీతో ఓ ముచ్చట సెప్తాను" అంటూ కూర్చోబెట్టి ఆ సంబంధం గురించి చెప్పింది.

ఆ పిల్ల సక్కని సుక్క... మంచి పని మంతురాలు... గుణగణాలు ఎంచనే అక్కర్లేదు... ఆళ్ల కుటుంబం కూడా శానా మంచిది... పెట్టుపోతల దగ్గర ఏ లోటూ సెయ్యరు..."

"సరే, పిన్నమ్మా... మా నాన్నతో నువ్వే సెప్పు... అన్నీ కుదిరితే సంకురాత్రి ఎళ్లాకా మూర్తాలు ఉంటాయి గదా... సేసేసుకుంటాను"

"అట్టాగే... మీ నాన్నకి నేసెప్తాగా..."

ఒక పెళ్లి చేస్తే ఎంతో పుణ్యంకదా అన్న ఉత్సాహం మామ్మది. వయసొచ్చింది గదాని, అందరూ పోరుతున్నారు గదాని పెళ్లి చేసేసుకుందాం పోనీయ్, ఒక పని అయిపోతుందన్న నిర్లిప్తత మా నాన్నది.

కొడుక్కి పెళ్లి చేయవలసిన బాధ్యత మా మీద వున్నది కదా... ఏదో గంతకి తగ్గ బొంతని తెచ్చి తగిలిస్తే ఆ తర్వాత వాడి చావు వాడు చస్తాడు అనే తత్త్వం మా తాతయ్య, నాన్నమ్మలది.

గుండెలమీద కుంపటిలా ఉన్న కూతురి భారం, దాన్ని ఏ అయ్య చేతిలోనో పెట్టేస్తే తీరిపోతుంది కదా అన్న ఆత్రుత మా అమ్మమ్మ, తాతయ్యలది.

వాళ్లందరి కోరికలు తీరేలా వాళ్లిద్దరికీ పెళ్లి కుదిరింది.

పదివేల రూపాయల కట్నం, ఇంటికి కావాల్సిన సామాన్లు, బట్టలు, మిగతా పెట్టుపోతలు జరపడానికి అంగీకారం కుదిరింది.

పెళ్ళికుదిరిన నెల రోజులకి, సంక్రాంతి పండుగ దాటిన ఇరవైరోజులకి ఓ శుభముహూర్తాన వాళ్ళిద్దరికీ పెద్దల సమక్షంలో పెళ్ళి జరిగింది.

పెళ్ళి, దాని పుట్టుపూర్వోత్తరాలూ, ఎందుకు పెళ్ళి చేసుకోవాలి.. ఎందుకు చేసుకోకూడదూ.. దేనివలన ఏయే పరిణామాలు వస్తాయి అనే ఆలోచనగానీ, అవగాహనగానీ ఆ వధూవరులిద్దరిలోనూ, ఆ పెళ్ళికి హాజరయిన పెద్దలలోనూ, పెళ్ళి చేయించిన పురోహితుడిలోనూ.. ఎవరిలోనూ లేదు.

అందరూ చేసుకుంటున్నారు కదా, మనమూ చేసుకోవాలి కదా, లేకపోతే జనం ఏదోకటి అంటుంటారు కదా అని వాళ్ళు చేసుకున్న ఆ పెళ్ళి నలుగురు వ్యక్తులకి బాధాకరమైన పుట్టుకని యిచ్చింది. వేదనాభరితమైన జీవితాల్ని యిచ్చింది. ఇద్దరికి బలవంతపు మరణాల్ని ప్రసాదించింది. నన్ను చావు అంచులదాకా తీసుకెళ్ళి తీసుకొచ్చింది.

★ ★ ★

నవలల్లో రాసినట్టు, సినిమాల్లో చూపించినట్లో ఉండవు కింది తరగతి వాళ్ళ పెళ్ళిళ్ళు, సంసారాలూ. ఏదో తంతు జరగాలి కదా అని జరిపిస్తున్నట్టు ఉంటాయి.

పెళ్ళయి కాపురానికి రాగానే మా అమ్మ చాలా మామూలుగా కూలీ పనులకి వెళ్ళడం మొదలుపెట్టింది.

భార్యభర్తలిద్దరూ పనులకి వెళ్ళడం, సాయంకాలానికి యింటికి చేరి యింత ఉడకేసుకుని తాము తిని, ఆ ముసలాళ్ళు యిద్దరికీ యింత వండిపెట్టి తొందరగా సద్దుమణిగేవారు.

ఏడాది తిరక్కుండా మా అమ్మకడుపు పండి ఒక బిడ్డను కన్నది. ఆడపిల్ల.

మధ్యతరగతిలో ఉన్నట్టు కింది తరగతి వాళ్ళలో ఆడపిల్ల అంటే మరీ చులకన భావం ఏమీ ఉండదు.

ఎందుకంటే... వాళ్ళకి ఎవరైనా ఒకటే. ఆడ, మగా తేడా లేకుండా అంతా కష్టపడతారు. కలో గంజో అంతా కలిసే తాగుతారు.

పెళ్ళిళ్ళు కూడా తమకన్నా పైస్థాయిలో వాళ్ళతో చేయాలని ఆశలేమీ పడరు వాళ్ళు. లేనిపోని గొప్పలకీ, ఆడంబరాలకీ పోయి అప్పుల పాలు అవరు.

## కొత్తగాలి...

**గొడుగు లేని**
**కొమ్మను ఓదార్చకు**
**కురుస్తుంది**
**కన్నీటి జడివానను**

– కొలకలూరి ఇనాక్, హైదరాబాద్

దాంతో ఆడపిల్ల అంటే అంత ఒత్తిడిగా భావించరు.

అందుకే రెండో ఏడాదికల్లా రెండోసారి ఆడపిల్ల పుట్టినా మా అమ్మనాన్నలు 'పెద్దగా' కంగారు పడలేదు.

ముచ్చటగా మూడోసారి ఆడపిల్ల పుట్టినప్పుడూ అంతే. ఈసారైనా అబ్బాయి పుట్టాలన్న తమ కోరిక నెరవేరనందుకు కొద్దిగా బాధపడ్డారేగానీ 'మళ్ళీ ఆడపిల్లా' అని కంగారుపడలేదు.

నాలుగోసారి వాళ్ళ ప్రయత్నం ఫలించింది. దేవుడు వాళ్ళ మొర ఆలకించాడు. మా అమ్మ పూజలు ఫలించాయి. అందరి ఆశలు నెరవేరాయి.

అందరి మొహాల్లోనూ సంతోషం వెల్లివిరిసేలాగా... నేను పుట్టాను.

రోజూ కూలీ చేసుకుని బతికే తల్లిదండ్రులకి నాలుగో సంతానంగా మగపిల్లాడ్ని కనాలన్న వాళ్ళ పంతం నెరవేరేలాగా నేను పుట్టాను.

మరి, నలుగురు పిల్లల్ని పోషించడానికి ఏ ధైర్యంతో మా నాన్న మమ్మల్ని కన్నాడు? ఏ నమ్మకం మా అమ్మచేత, తను చిక్కి-శల్యం అయిపోతున్నా అబ్బాయి పుట్టేదాకా గర్భం ధరించేలా చేసింది?

వాళ్ళ నమ్మకం, ధైర్యం... అన్నీ ఒక్కటే.

నారు పోసినవాడే నీరు పోస్తాడు.

నారు పోసినవాడు నీరు పోయక మానాడా?

నారు పోసినవాడు నీరు పోయకమానడు.

ఆ ధైర్యంతో, ఆ నమ్మకంతో, నారు పోసినవాడి మీద విపరీతమైన విశ్వాసంతో, నలుగురు పిల్లల్తో కలిసి మా అమ్మానాన్నల జీవనయానం ప్రారంభమైంది.

మా తాతయ్య, నాయనమ్మల అదృష్టం... మనవలు ఎదిగే క్రమంలో వాళ్లు ఒకరి వెనుకగా ఒకరు రాలిపోయారు.

వాళ్ళకి మా నాన్న ఒక్కడే సంతానం. మన బతుకులకి ఒక్కడు చాలు... వాడ్ని పెంచి పోషించి, విద్యాబుద్ధులు నేర్పించి, వాడికి మంచి భవిష్యత్తును చూపిస్తే తల్లి దండ్రులుగా మనకేం కావాలని అనుకుని ఏక సంతానంతో సరి పెట్టుకోలేదు.

మా నాన్నకి ముందూ, ఆయనకి వెనకా పుట్టిన పిల్లలు ఎవరూ బతికి బట్టకట్టలేదు అంతే.

యింక పిల్లలు పుట్టరని తెలిసేదాకా వాళ్ళు ప్రయత్నించీ... ప్రయత్నించీ దేవుడు మనకింతే రాసిపెట్టాడని సంతృప్తి పడిపోయారు.

మా నాన్నకి ఆ బాధలేదు.

పుట్టిన బిడ్డల్లో ఏ బిడ్డా పోలేదు.

భగవంతుడు ఒకటికి నలుగురు పిల్లల్ని యిచ్చాడు.

మగపిల్లాడ్ని కూడా.

మగపిల్లాడు ఎందుకు? అంటే బహుశా మా నాన్న దగ్గర సమాధానం ఉండదేమో...

'అపుత్రస్య గతిర్నాస్తి' పుత్ర సంతానం లేకపోతే పుట్టగతులు ఉండవు. పున్నామ నరకం దాటలేవు అని ఆయనకి తెలిసే అవకాశం లేదు.

కొడుకు పుడితే వృద్ధాప్యంలో తమకో ఆసరా ఉంటాడనీ, తమ బరువు బాధ్యతలు పంచుకుంటాడనీ దూరాలోచన కూడా ఉండదు. మరి ఎందుకు కొడుకో, కొడుకో అని కలవరించినట్టు?

ఒకటికి నలుగురు బిడ్డలని ఎందుకు కన్నట్టు?

...కేవలం అందరూ కొడుకులు ఉండాలి కదా అన్నందుకు. కొడుకులు లేకపోతే ఎలా అంటున్నందుకు... ఆడపిల్లలో,

## జీవితం విలువ

రమణ మహర్షి బోధనలను విని, ఆయన జీవితాన్ని కళ్ళారా చూచి ఎంతో మంది దుఃఖాన్ని పోగొట్టుకున్నారు. మనశ్శాంతి పొందారు. రమణాశ్రమం దగ్గర ఒక బడిపంతులు ఉండేవారు. ఆయన ప్రతిరోజూ రమణ మహర్షి సాన్నిధ్యంలో మనశ్శాంతి పొందుతూ ఉండేవారు. ఆయనకు లెక్కలేనన్ని సమస్యలు. ఒకమారు



ఆ సమస్యలకు తట్టుకోలేక ఆత్మహత్య చేసుకుందామను కున్నారు. అయితే దానికి ముందు రమణ మహర్షిని కడసారి చూద్దామనుకుని వెళ్ళారు. అప్పుడు కౌపీనధారి, తేజోవంతులైన మహర్షి, ఆశ్రమవాసుల భోజనానికి విస్తరాకులు కుడుతున్నారు.

పంతులుగారు మహర్షి ముందు కాస్సేపు మౌనంగా కూర్చున్నారు. మహర్షి తన పని తాను చేసుకుపోతు న్నారు. పంతులుగారే మౌనభంగం చేశారు. 'స్వామీ! మీరు ఇంత కష్టపడి విస్తరాకులు కుడుతున్నారే! భోజనం చేసిన తరువాత ఆశ్రమవాసులు వీటిని పార వేస్తారు కదా? ఎందుకీ వ్యర్థశ్రమ?' అన్నారు. మహర్షి మందహాసం చేసి, 'నాయనా! ఇతరుల భోజనానికి ఉపయోగపడటమే ఈ ఆకుల ఉద్దేశం. అందులోనే వీటి జన్మసార్థకత ఉంది. ఒక వస్తువును సంపూర్ణంగా వినియోగించుకున్న తర్వాత పారవేస్తే, చింతించాల్సినదేమీ లేదు. ఇంకా ఉపయోగపడే స్థితిలోనే పారవేస్తే అది తప్పు. పైగా పాపం కూడా.'

పంతులుగారు మహర్షి బోధనలోని సత్యాన్ని అర్థం చేసుకున్నారు. సమస్యలను ఎదుర్కొనే ధైర్యం, స్ఫూర్తిని పొంది ఆయన తన సంసారయాత్రను సాగించడానికి కంకణబద్ధులయ్యారు.

మగ పిల్లలో ఉంటేనే యింటికి అందం అనుకున్నందుకు.

ఇన్ని రకాలుగా అనేవాళ్ళు, 'పిల్లలు గాలికి పుట్టి గాలికి పెరగరు కదా, ఎలా పోషిస్తావు?' అని అడగరెందుకు? వాళ్ళ భవిష్యత్తు ఎలా అని ఆలోచన చెయ్యరెం దుకు? రోజులెప్పుడూ ఇలాగే ఉండవు కదా? కుంచెడు నేల కూడా లేని మనిషికి నలుగురు పిల్లలెందుకు? ఒకరో యిద్దరో చాలదా? ! అని అనరెందుకు?

ఒకరూ లేక యిద్దరన్న ప్రభుత్వ నినాదం అంత మారుమూల పల్లెలకి చేర దెందుకు?

ఇలా యిన్ని ప్రశ్నలని రేపింది- నా జీవితం...

★ ★ ★

బాల్యం చాలా అందమైనది. అపురూప మైనది అని చాలామంది అంటూ ఉంటారు. మనిషి జీవితంలో సంతోషం తప్ప మరేమీ ఎరుగని, ఆ మాటకొస్తే సంతోషం, దుఃఖంలాంటి ఏ భావాలూ తెలియని పసితనం ఒక వరమని అంటారు. పుస్తకాల్లో రాస్తారు.

కానీ మా అమ్మ చెప్పినదాన్ని బట్టి నా బాల్యం ఏమీ అందంగా గడవలేదు.

మూడు కానుపులకి జీవచ్ఛవం అయి పోయి, నాలుగో కానుపులో శవమైపోతుం దని అందరూ భయపడిన మా అమ్మ నాతోసహా బతికి బయటపడింది.

అయితే అది జీవచ్ఛవం అని కూడా అనలేనంత హీనమైన స్థితిలో కదిలే అస్థి పంజరంలా బయటకొచ్చిన అమ్మ దగ్గర పసివాడికివ్వడానికి పాలు కూడా లేవు. మిగతా ముగ్గురు పిల్లల బాగోగులు చూడ

## కొత్తగాలి...

**రాళ్లతో చెక్కుతున్నాం**
**గాంధీలను లక్షలుగా**
**కానీ**
**తయారుచేయలేక పోతిమి**
**ఒక్క గాంధీని కూడా**

– వీధుల రాంబాబు, భద్రాచలం

డానికి ఓపిక లేదు.

ఇంట్లో పనిచేసే మనిషి ఒకతె తగ్గేసరికి డబ్బులు కూడా లేవు. ఆ రెండో మనిషి సంపాదన సారాకొట్టుకి తప్ప గుక్కెడు పాలకి అందే అవకాశం లేదు.

పసితనంలో పాలే మనిషికి ఆహారం.

రోజుల తరబడి ఆహారం లేకపోతే, లెక్కప్రకారం మనిషి చచ్చిపోవాలి. అలా చచ్చిపోయినవాడు ఎంతో అదృష్టవంతుడు. ఎందుకంటే చావంటే శాశ్వతమైన శాంతి... విశ్రాంతి.

విచిత్రంగా లోకంలో చాలామంది రోజుల తరబడి ఆహారం లేకపోయినా చావరు. జీవచ్ఛవల్లా బతికే ఉంటారు. రోజుల తరబడి... నెలల తరబడి... సంవత్సరాల తరబడి...

మనిషి చేసిన తప్పుకో, దేవుడు చేసిన తప్పుకో సజీవ సాక్ష్యాల్లా... బతికే ఉంటారు. నిత్యం మనకెక్కడో కనిపిస్తూనే ఉంటారు.

అలాగే నేను కూడా చావకుండా బతికే ఉన్నాను బండగా, మొండిగా. మా అమ్మ కూడా అంతే.

పచ్చి బాలింతరాలు అయి ఉండి కూడా... ఒంట్లో ఓపిక లేకున్నా కూడా... కూలీ పనులకి వెళ్ళడం మొదలుపెట్టింది.

మళ్ళీ మామూలు రోజులలాగానే యిద్దరూ పనికి వెళ్ళడం, తన కూలీ డబ్బుల్తో మా నాన్న రోజూ సారా తాగి తందనాలాడడం... తన సంపాదనలో మా అమ్మ యింటిని నడపటం...

ఏ కోశానా ఆ డబ్బులు ఇంటికి సరిపోవు.

అలాగని మనిషి బాధ్యతలని, అవసరాల్ని బట్టి కూలీ పెరగదు. కానీ రోజురోజుకీ ఖర్చులు పెరుగుతాయి. పిల్లలు పెరిగి పెద్దవారవుతూ ఉంటారు.

మరి పెరిగే ఖర్చులకీ, పెరగని సంపాదనకీ మధ్యన నిత్యం పెరిగిపోయే ఆ అంతరం ఎలా పూడుతుంది?

ఎలా?

ఎలా?

ఎలా?

★ ★ ★

విసురుగా మా నాన్న గెంటిన గెంటుడుకి నేలమీద జారుతూ వెళ్ళి తడిక మూలన పడింది మా పెద్దక్క సూర్యకాంతం.

మితిమీరిన భయంవలన కాబోలు దాని నోటినుంచి ఏడుపు కూడా రావడం లేదు.

పులినో, దయ్యాన్నో చూసి వణికిపోతున్న మనిషిలాగా రెండు చేతులూ గడ్డం కిందకి ముణగదీసుకుని వణికిపోతూ వెక్కిళ్ళు పెడుతోంది.

దాన్ని చూడగానే జాలితో కరిగిపోని వాడు మనిషే కాదు. అలా ఉంది దాని పరిస్థితి.

కానీ మా నాన్న జాలి చూపించలేదు. పైపెచ్చు బూతులు తిట్టాడు. "నన్ను సంపుకు తినడానికి పుట్టారుగదే లంజ ముండల్లారా... ఏనాడు ఈ దెయ్యాన్ని తగిలించుకున్నానో ఆనాడే నాకు మనశ్శాంతి లేకుండా పోయింది. యిప్పుడు సుఖంగా తినడానికి కూడా లేదు... నోర్మూయ్.... ఎందుకే ఏడుత్తావు? ఏడుపు బయటకొచ్చిందా... పీక నొక్కి సంపేత్తాను" అనరిచాడు.

ఇంతకీ మా పెద్ద బుజ్జక్క అనబడే మా అక్క సూర్యకాంతం చేసిన తప్పల్లా ఏమిటంటే మా నాన్న తెచ్చుకుతింటున్న పకోడి పొట్లంలో ఓ చిన్న ముక్క అడగడం.

బిక్కచచ్చిపోయిన మా అక్కని మా అమ్మ ఓదార్చింది. అయినా అది మా అమ్మ గుండెల మీద తలవాల్చి బెక్కుతూనే ఉంది.

అయితే హడలిపోయింది అదొక్కతే కాదు, మిగతా యిద్దరు చెల్లెళ్ళూ, నేనూ కూడా బాగా హడలిపోయాం.

అప్పట్నుంచీ మా నాన్నని ఏదైనా అడగాలంటే ఎంతో భయం మాకు. ముఖ్యంగా నాకు...

మామూలుగా మా అమ్మ దగ్గర గారంగా అదీయిదీ అడిగే మేము మా నాన్న ఇంట్లో ఉంటే మాత్రం కుక్కిన పేనుల్లా పడుండేవాళ్ళం.

కానీ మేము ఎంత నిశ్శబ్దంగా ఉన్నా ఏదో ఒక రూపాన మా నాన్నచేత దెబ్బలు మాత్రం తప్పేవి కావు.

తాగి ఇంటికొచ్చేసరికి గుమ్మం దగ్గర కూర్చుని ఆడుకుంటున్నా పాపమే. కాలితో ఒక్క తన్ను తన్నేవాడు. మాలో మేము ఆడుకుంటూ గోల చేసినా, కొట్టుకుంటూ ఏడ్చినా విసురుగా వచ్చి దబదబా బాదేవాడు.

మళ్ళీ దెబ్బలు తిని ఏడ్చినా నేరమే.

"నోరు మూస్తావా... ముయ్యవా?" అంటూ చేతుల్తో నోరు మూసుకునేదాకా కొట్టేవాడు.

ఒక్కోసారి మా అమ్మ మమ్మల్ని వెనకేసుకొచ్చి ఏమైనా అంటే ఆమెని కూడా కొట్టేవాడు.

మా నాన్న చెయ్యెత్తితే చాలు హడలిపోయే నాకు ఆయన చేతి దెబ్బ మాత్రం గింగిరాలు తిరిగేలా చేసేది.

నేను పుట్టుకతోనే అర్భకుడ్ని. సన్నగా, పీలగా ఉండేవాడిని. మా నాన్న కాయకష్టంచేసి బండబారిన చేతుల్తో గొడ్డును బాదినట్టు బాదేవాడు. అసలా దెబ్బలు భరించి యింతకాలం ఎలా బతికున్నానా అని యిప్పటికీ ఆశ్చర్యమే నాకు.

దెబ్బలు తినడానికే పిల్లలూ పెళ్ళామూ అన్న ధోరణిలో ఉండేది మా నాన్న ప్రవర్తన.

మా నాన్నంత కాకపోయినా అల్లరి చేసినప్పుడో, ఆమెని విసిగించినప్పుడో మా అమ్మ కూడా మమ్మల్ని విచక్షణారహితంగా కొడుతూ ఉండేది.

ఆ మాటకొస్తే మా అమ్మానాన్నా అనే కాదు, నా బాల్యంలో నాకు తెలిసిన పిల్లలందరూ తల్లిదండ్రుల చేతుల్లో చావుదెబ్బలు తిన్నవాళ్ళే.

నాతోసహా చాలామంది పిల్లలు తల్లిదండ్రుల నోటినుంచే 'నువ్వు సచ్చిపోతేగానీ ఈ కొంపకి పట్టిన దరిద్రం వదలదు' అని శాపనార్థాలు పెట్టించుకున్నవాళ్ళే.

ఎలా తెలుస్తాయి పిల్లలకి? పెద్దలకి ఎలా నడుచుకుంటే నచ్చుతుందో? ఎలా మసలితే నచ్చదో? వాళ్ళు ఏయే చికాకుల్లో ఉన్నారో... లేక సంతోషంగా ఉన్నారో? ఏది అడగాలో ఏది అడగకూడదో?... పెద్దలకి వచ్చిపడిన ఇబ్బందులేమిటో? అడియాసలైన వారి ఆశలేమిటో? ఎలా తెలుస్తాయి?

నేర్పవలసిన పెద్దలే అవి తెలుసుకోలేదని దెబ్బలు కొడుతుంటే పిల్లలకి ఎలా తెలుస్తాయి? ఎప్పటికి తెలుస్తాయి?

★ ★ ★

మా నాన్న బాల్యంలో ఎలాంటి చాపల్యాలూ ఉన్నాయో లేవో నాకు తెలియదు. కానీ ఎప్పుడూ అలాంటివేమీ ఎరగనట్టే ప్రవర్తించేవాడు ఆయన.

పిప్పరమెంటు దగ్గర్నుంచి గోలీసోడా దాకా బజారులో కనిపించే ప్రతిదీ కావాల

నిపిస్తూ ఉండేది నాకు.

నాన్నని అడిగే ధైర్యం ఎలాగూ లేదు... మా అమ్మ దగ్గర ఒక్కోసారి గారాలు పో తూ అడిగేవాడిని.

'నా దగ్గర డబ్బులెక్కడియ్యి నాయనా... మీ అయ్య ఏమన్నా మూటలు తెచ్చి నా చేతిలో పోత్తన్నాడా?' అనో... 'అందరూ నన్నే తినెయ్యండి... యిప్పటిదాకా ఆ ఆడదెయ్యాలు పీక్కుతి న్నాయి... యిప్పుడు నువ్వా?' అనో... అనేది చాలాసార్లు. మరీ మాట వినక పోతే నాలుగంటించేది. ఏడుస్తూ కూర్చుంటే అదిగో మీ అయ్య వత్తున్నాడు ఆడినే అడుగు అనేది. అక్కడితో నా ఏడుపూ ఆ కోరికా ఆగేవి.

ఒక్కోసారి మా నాన్నతో చెప్పేది, 'నీ కొడుక్కి క్రీముబిస్కట్లు గావాలంట' అంటూ.

"ఏం బాబూ... క్రీము బిస్కట్లు కావాలా?... కోడిగుడ్డు అట్లేం వద్దూ... మీ తాత ముల్లె దాచిపెట్టాడిక్కడ... అది తవ్వితీసి కొనిపెడతాను క్రీము బిస్కట్లు... క్రీము బిస్కట్లు కావాలంట .. క్రీము బిస్కట్లు... నోరు మూసుకుని తొంగో... లేకపోతే తోలు వలిచేత్తాను ఎదవా..." అనేవాడు మా నాన్న.

అక్కడితో ఆ కోరికని అణచుకుని పడు కుంటే రాత్రంతా అవే కలలు. ఆ కలల్లో నేను కొట్టుదగ్గరకెళ్ళేవాడిని... జీళ్ళు, జంతి కలు, బిస్కట్లు, గొట్టాలు, కరకజ్జం ఉండలు, మరమరాల ఉండలూ కొను క్కుని తినేవాడిని.

ఈ కలలు కలల్లా ఉండేవి కావు. నిజ్జంగా నిజంలాగానే ఉండేవి. ఉన్న ట్టుండి మెలకువొచ్చి చూస్తే ఖాళీ చేతులు నన్ను వెక్కిరించేవి. అలాంటి కలలు నేనొ క్కడ్నే కంటాననుకొనేవాడిని. కానీ నా అక్కలు కూడా అలాంటి కలలే కంటు న్నట్టు తరచూ దీనంగా చెప్తుండేవారు. అలాంటి సమయంలో కరిగిపోయిన కల లనే కన్నీటి రూపంలో తాగేసి కడుపునీ, మనసునీ నింపేసుకునేవాళ్ళం మేం.

ఒంటిమీద సరిగ్గా బట్టలు కూడా లేకుండా ఆ మట్టిలోనే పొర్లాడుతూ పొర్లా డుతూ, చాలీచాలని తిండి తింటూ, దెబ్బలు మాత్రం పూర్తిగా తింటూ నలు గురు పిల్లలం నెమ్మదిగా ఎదగ సాగాం.

ఒకరి తర్వాత ఒకరుగా అందరినీ బడిలో వేశాడు మా నాన్న. బడిలో చేరే సరికి యింటికన్నా బడే పదిలం అనిపించ సాగింది నాకు. అందుకే ఎంతో శ్రద్ధగా, యిష్టంగా వెళ్తుండేవాడిని బడికి.

మా పెద్దక్క సారథ్యంలో రోజూ మా యింటి దగ్గర నుంచి బడి వరకూ నడక. పెద్దగా దూరమేమీ కాదు బడి... పక్క ఊరిలోనే. మళ్ళీ మధ్యాహ్నం భోజనాలకి యింటికి, భోజనాల తర్వాత బడికి వెళ్ళి, సాయంత్రం బడి అయ్యాక యింటికి వచ్చే వాళ్లం.

మధ్యాహ్నం భోజనాలప్పుడు మా అమ్మ యింటి దగ్గర ఉండేది కాదు. అన్నం, కూరలు గిన్నెల్లో ఉండేవి. మేం తినేసి, ఎక్కడివక్కడ వదిలేసి గుడిసె తడిక దగ్గ రకి వేసేసి వెళ్ళిపోవడమే.

రోజూ భోజనాల దగ్గర దెబ్బలాటే మాకు. ఎవరికీ పూర్తిగా సరిపోయేది కాదా భోజనం. అందుకే కొట్టుకుంటూ తినే వాళ్ళం. మా పెద్దక్క మాతో దెబ్బలాడ లేకా, సర్ది చెప్పలేకా చచ్చేచావు చచ్చేది.

ఈ గొడవంతా సాయంత్రం మా అమ్మకి చెబితే "ఎదవల్లారా! కడుపునిం డినా కళ్ళు నిండవు మీకు. నలుగురు మనుసులు తినే అన్నం ఉంచినా నలు గురు పిల్లలకి సరిపోవడం లేదంటే... ఎంత ఇద్దూరం? కడుపులా చెరువులా అయ్యి?" అనేది.

## కొత్తగాలి...

**చుక్కలకి**
**బోర్ కొట్టట్లే**
**ఎందుకంటే**
**తోడుగా**
**ధరలున్నాయిగా మరి!**

*– వాడపర్తి వెంకటరమణ, వైజాగ్*

సగమే నిండిన కడుపుతో, యింకా వేస్తోన్న ఆకలితో మేము బడికి బయలుదే రేవాళ్ళం.

సాయంత్రం యింటికొచ్చేసరికి నీర సంతో కాళ్ళుపైకి తేలిపోయేవి. పాపం, మా పెద్దక్క... యింటికి రాగానే మంచి నూనె సీసా చేతికిచ్చి, కిరణా షాపునించి తేవాల్సిన సరుకుల లిస్టు చెప్పి, దాన్ని కొట్టుదగ్గరికి పంపేది మా అమ్మ.

వెళ్ళనని ఒకటే ఏడుపు ఏడ్చేది అది.

"రాత్రికి కుంబాలకి కుంబాలు రాశిపోసి పెడితే తింటావేం... కొట్టు దగ్గరకి ఎళ్ళడా నికి మాత్రం నిక్కు... ఎల్తే ఎల్లు... మీ అయ్య ఒచ్చాడంటే తోలు తీసేత్తాడు' అని బెరిరించీ, తిట్టీ, ఒక్కోసారి కొట్టీ దాన్ని కొట్టుకు పంపేది మా అమ్మ.

ఏడుస్తూనే కొట్టు దగ్గరకి వెళ్లి ఏడు స్తూనే తిరిగివచ్చేది మా అక్క. నాకు బాగా గుర్తు... ఒకసారి అలాగే వెళ్ళనని చాలాసేపు ఏడ్చింది అక్క. మా అమ్మ బతిమాలినా, తిట్టినా, బెదిరించినా విన లేదు. ఆఖరికి కొట్టినా కదల్లేదు.

అలాంటిది మా అమ్మ పక్కనే పెట్టిన డబ్బులు తీసుకుని ఒక్కసారిగా కదిలేసరికి అందరూ ఆశ్చర్యపోయాం. అది అలా అడుగు బయట పెట్టేసరికి యిలా గుమ్మం లోకి అడుగుపెట్టాడు మా నాన్న.

"అదీ సంగతి... ఆళ్ళ బాబుని చూడక పోతే అది ఎందుకు కదులుతాదీ" సాగ దీస్తూ అంది మా అమ్మ.

వెళ్ళిన పావుగంటకి ఏడుస్తూ తిరిగొ చ్చింది మా అక్క. దాని చేతిలో నూనె సీసాలేదు. సరుకుల పొట్లాలే ఉన్నాయి.

"నూన్సీసా ఏదే? " అడిగింది మా అమ్మ.

"అదీ... అదీ..." వెక్కుతూనే చెప్పింది అక్క.

"ఏంటే అదీ... అదీ... సీసా ఏది? "

"వత్తుంటే? "

"వత్తుంటే అదీ... అదీ..."

"ఎహె... సరిగ్గా సెప్తావా... ఒక్కటి య్యమంటావా? " అరిచింది మా అమ్మ.

దీంతో అక్క బాగా బెదిరిపోయి ఏడుస్తూ "నూనె పోయించుకుని వత్తుంటే సీసాకాయ రోడ్డుమీద పడి పగిలిపోయిం దమ్మా" అంది.

అంతే.

మరుక్షణం దాని చెంప పేలిపోయేలా ఒక్కటేసింది అమ్మ.

"నా పాలిట శనిదేవతలా తయార య్యేరే మీరంతా. చేసింది చాలక ఇంకా ఏడుత్తున్నావా? ఎద్దులాగ ఎదిగావ్... కొట్టు దగ్గర్నుంచి నూన్సీసా తేలేవా? " అం టూ అరుస్తూ వీపుమీద నాలుగు గుద్దులు గుద్దింది.

వచ్చినవాడు వచ్చినట్టు సరాసరి దొడ్లోకి వెళ్లిన మా నాన్న అప్పుడే లోపలికి వచ్చాడు తూలుకుంటూ.

"ఏంటే మీటింగు? కూరేం వండావు? " గద్దించాడు, మత్తుతో సోలిపోతున్న కళ్ళని బలవంతంగా పెకెత్తుతూ.

"ఆఁ! రమ్మన్నారు తిమ్మన్న బంతికి. యింతోటి మొగోడివి నువ్వొత్తన్నావని అర కోడి పులుసొండి దాసిపెట్టాను. కూరంట కూర... నూనె తెమ్మని నీ పెద్ద కూతుర్ని పంపితే... కాయతో సహా బద్దలుగొట్టుకొ చ్చింది" కసిరింది మా అమ్మ.

"ఛ. దీనెమ్మ కొంపా... పగలంతా పని సేసొత్తే కూతంత మనశ్శాంతి కూడా ఉండనివ్వరు గదా... మీరూ మీరూ ఎలా సత్తారో సావండి. నేను బజారుకి పోయి పలావు తినేసొత్తా..." అని తూలుకుంటూ పోయాడు.

మా నాన్న వైఖరితో అరికాలి మంట నెత్తికెక్కింది మా అమ్మకి. లోపల్నుంచి తన్నుకొస్తోన్న దుఃఖాన్ని కోపంగా మార్చి "నా ఖర్మ... నా ఖర్మ" అంటూ నెత్తికొట్టుకుంది.

తర్వాత "ఇదంతా నీ వల్లేకదే దరిద్రపుగొట్టు ముండా" అంటూ యింకా ఏడుస్తూనే ఉన్న మా అక్కని దబదబా నాలుగు బాదేసింది.

బిక్కచచ్చిపోయి చూస్తూ ఉండిపోయాం మిగతా పిల్లలం.

ఒకసారి మా రెండో అక్క కొట్టుకి వెళ్లి చిల్లర తేవడం మరచిపోయింది. మళ్ళీ వెళ్తే షాపువాడు 'యిచ్చేశాను. అదే ఎక్కడో పడేసి ఉంటుంది' అన్నాడు. ఫలితంగా దాని వీపు వాచిపోయింది.

నేనొకసారి కోడిగుడ్లు తెస్తూ తెస్తూ చెయ్యి జారిపోయి పగలగొట్టేశాను. పైగా అవి తెమ్మని పంపించింది మా నాన్న.

ఇంక చూసుకో, యింటికి తిరిగి వెళ్ళేసరికి నా వీపు విమానం మోతే. నా వీపు మీద తేలిన తట్లకి వారం రోజులపాటు వెల్లకిలా తిరిగి పడుకోలేకపోయాను.

కిరాణా కొట్టు దగ్గరకెళ్ళి రావడం అంటే పెద్ద పరీక్ష నాకు. ఏది ఎక్కడ పడేస్తానో అని గుండెల్లో భయం. కాళ్ళలో, చేతుల్లో వణుకు. ఎంతో జాగ్రత్తగా అమ్మ చెప్పిన లిస్టు గుర్తుపెట్టుకుని, అంతే జాగ్రత్తగానూ పొట్లాలు కట్టించుకుని, యింకా జాగ్రత్తగా యింటికి చేరేవాడ్ని.

అయినా ఎప్పుడో ఒక్కోసారి పొరపాట్లు జరిగేవి. దెబ్బల్తో ఒళ్ళు హూనం అయిపోయేది.




బడిలో మిగతా పాఠాలు ఎలా ఉన్నా ఒక పాఠం మాత్రం చాలా విచిత్రంగా అనిపించేది నాకు.

తండ్రి ఉద్యోగం చేస్తూ, డబ్బులు సంపాదిస్తూ కుటుంబాన్ని పోషిస్తాడనీ, తల్లి యింటిలో ఉంటూ వంటావార్పూ చేస్తూ పిల్లల బాగోగులు చూసుకుంటుందనీ చెప్పే పాఠం అది.

మాస్టారు రోజూ వల్లెవేయించే ఆ పాఠంలో ఉన్నట్టు ఏనాడూ జరగలేదు మా యింట్లో.

అలాగే స్కూల్లో 'పొద్దున మనమూ లేవాలీ... చక్కగా ముఖమును కడగాలి...' అనే మరో పాట పాడించేవారు.

పొద్దున్నే లేవడమూ, మొహం కడుక్కోవడమూ సరే, బ్రష్‌తో పళ్ళు తోముకోవడం నాకు తెలీదు. పొయ్యిలోని బూడిదతో పళ్లు తోముకునేవాళ్ళం మేము. పాలు తాగడం తెలీదు నాకు. రోజూ ఉతికిన బట్టలే కట్టుకోవడం తెలియదు. దేవుడికి ప్రార్థనలు చెయ్యడం తెలియదు. అమ్మానాన్నలకి మొక్కడం తెలియదు. పెద్దలకీ, ఉపాధ్యాయులకీ వందనం చెయ్యడం తెలియదు.

అలాగే మా మాస్టారు చెప్పినట్టు పౌష్టికాహారం తినడం మాకు అలవాటు లేదు. ఆకుకూర పేరు చెప్పి మా అమ్మ తను

పనిచేసే వాళ్ల పొలం నుంచి పీక్కువచ్చిన గోంగూరతో పచ్చడి చేయడం తప్పించి మరొకటి తెలియదు. చేపలు ఎప్పుడో తప్ప తినం మేము.

మితంగానే తినాలనేవాడు మా మాస్టారు. అంటే ఏమిటో అర్థం అయ్యేది కాదు. తర్వాతెప్పుడో కడుపు నిండుతూ ఉండగానే మెదడు యింక చాలు అని హెచ్చరికలు చేస్తుందనీ, అప్పుడే తినడం ఆపెయ్యాలనీ చెప్పారాయన. కానీ... 'ఇంక చాలు' అని నా మెదడు నాకెన్నడూ చెప్పనే లేదు. ఆ విషయం మా మాస్టారి కెందుకు తెలీదా అని ఒకటే ఆశ్చర్యం నాకు.

తల వెంట్రుక దగ్గరినుంచి కాలిగోరు దాకా పరిశుభ్రంగా ఉండాలని ఎన్నోసార్లు చెప్పేవాడాయన. రోజూ కిలోమీటరు దూరం మట్టిరోడ్డు మీద నడిచివస్తూ పరి శుభ్రంగా ఎలా ఉండాలో అర్థం అయ్యేది కాదు.

రోడ్లమీదా, దుకాణాల్లో మూతలు పెట్ట కుండా అమ్మే పదార్థాలు తినకూడదనీ, అది అనారోగ్యమనీ, యింట్లో అమ్మ వండి పెట్టినవే తినాలనీ, అదే ఆరోగ్యమనీ అనే వాడు.

మేము అలాంటివి బయట ఏనాడూ తినము. మా అమ్మ ఎలాగూ వండిపె ట్టదు. ఆ విషయం కూడా తెలియదాయ నకి.

బయట వస్తువులంటే నాకా సంఘటన వెంటనే గుర్తుకు వస్తుంది. అంతలా.. మరచిపోలేనంతగా నా మనసు మీద ముద్రించుకుపోయిందా సంఘటన.

మా ఊళ్ళో అమ్మవారి తీర్థం జరుగు తోందప్పుడు.

ఏ కళనున్నాడో మా నాన్న, మా అమ్మ తో అక్కల్ని తీసుకుని తీర్థం వెళ్ళమ న్నాడు. నన్ను తను తీసుకుని తను బయ లుదేరాడు.

గుడికి చాలా యివతల నుంచే బోల్డన్ని దుకాణాలు... ఎక్కువగా అరటిపళ్లు, కొబ్బ రికాయలు అమ్మే దుకాణాలు. యింకా బుడగలు, కళ్ళజోళ్లు, కార్లూ, బూరలూ, సైకిళ్ళు, బంతులూ, గిలగిజ్జకాయలూ అమ్మే దుకాణాలు... అయిసు బండి... కూల్‌డ్రింకులు తయారుచేసి అమ్మే బండి... అయిసుక్రీము బండి... కర్జూర పళ్ళ దుకాణం... జీళ్ళు అమ్మే దుకాణం... యింకా మిఠాయి దుకాణం...

కళ్ళు చెదిరిపోయాయి నాకు వాటిని చూడగానే. ఒకటే నోరూరిపోతోంది. కానీ నాన్నని అడిగితే తిడతాడేమోనని భయం.

మా ఊరిలోవాళ్ళు చాలామంది పిల్లలు తల్లిదండ్రుల్తో తీర్థానికొచ్చారు. వాళ్ళందరి చేతుల్లో ఏవేవో వస్తువులు. కొంతమంది దుకాణాల దగ్గర తమ తల్లిదండ్రుల్తో నిల బడి కొనుక్కుంటున్నారు.

అందరిలోనూ ఎంతో ఉత్సాహం. అక్క డంతా ఏదో కోలాహలం.

గుడిమీద స్పీకరులోంచి పాటలు... గుడిముందు ఆసాదివాళ్ళ గరగల నృత్యాలు... డప్పుల మోతలు...

మా నాన్న అరడజను అరటిపళ్ళు కొన్నాడు. నన్ను చెయ్యిపట్టుకుని నడిపిం చుకుంటూ గుళ్ళోకి తీసుకెళ్ళాడు.

అమ్మవారి విగ్రహం చూడగానే భయం వేసింది నాకు. చాలా పెద్ద విగ్రహం. అంతెత్తున ఉంది. ముఖ్యంగా కళ్లు. పెద్ద పెద్ద కళ్ళు...

లోపలున్న పూజారి మా నాన్న చేతి లోని అరటిపళ్ళు తీసుకుని ఆమెకి నైవేద్యం పెట్టి మూడు పళ్ళు వెనక్కిచ్చాడు. పక్కనే పళ్ళెంలో పావలా కాసువేసి దణ్ణం పెట్టు కుని, పళ్ళెంలోని కుంకుమని తను పెట్టు కుని నాకు పెట్టాడు మా నాన్న.

కుంకుమ కళ్ళలో పడి కొద్దిగా

మండింది నాకు.

తర్వాత కొంచెం తగ్గాక మా నాన్న ముఖంలోకి చూస్తే చాలా భయం వేసింది నాకు.

అమ్మవారి విగ్రహం కంటే భయంక రంగా ఉన్నాడు.

తలంటుకోవడంతో ఇష్టం వచ్చినట్టు ఎగురుతోన్న చీకేసిన తాటిటెంకలాంటి జుట్టు... ఎర్రగా పెద్ద పెద్దగా, అమ్మవారి కళ్లల్లాంటి కళ్లు... ఆ కళ్లమధ్య ఇంత లావున పెట్టుకున్న కుంకుమ... బండ పెదాలు... వికృతమైన మొహం...

మా నాన్నంటే ఎప్పుడూ భయమే నాకు. ఇప్పుడు మరీను.

మళ్ళీ తిరిగి వచ్చేస్తుంటే ఆ దుకాణాలన్నీ మరీ మరీ ఆకర్షించాయి నన్ను. ఒకపక్క అవన్నీ కొనుక్కో వాలన్న కోరిక. మరోపక్క నాన్నంటే భయం. ముఖ్యంగా ఖర్జూరపు కాయలమీదా, జీళ్లమీద ఉండిపోయింది నా మన సంతా.

ఈలోగా తనకి తెలు సున్న అరటిపళ్ల దుకాణం దగ్గర నన్ను అప్పజెప్పి దగ్గర్లో ఉన్న సారా దుకాణం దగ్గరికి వెళ్ళొచ్చాడు మా నాన్న. రాగానే బిక్కమొహం వేసుకుని నించున్న నన్ను ఒకటే ముద్దులాడటం... ఇది పూర్తిగా కొత్త నాకు.

దాంతో కొంత ధైర్యం వచ్చింది. అందు లోనూ ఖర్జూరపు పళ్లు కావాలన్న కోరిక అసలు నిలవనీయడంలేదు. ఎర్రెర్రగా ఊరిస్తున్నాయి అవి. అప్పటికే కొనుక్కున్న చాలామంది తింటూ, వేళ్లని నాక్కుంటూ పోతున్నారు.

"నానా... ఖర్జూరమే..." అన్నాన్నేను.

"కర్జూరమా... డబ్బుల్లేవురా... తర్వాత కొనిపెడతాలే" అన్నాడు మా నాన్న.

"నువ్వెప్పుడూ ఇలాగే అంటావ్. ఏదీ కొనియ్యవు. ఇప్పుడైనా కొనియ్ నానా..."

"నేనేమీ కొనిపెట్టకుండానే ఇంతోడివి అయినావేంట్రా..."

"అది కాదు నానా... ఖర్జూరం కొని పెట్టు నానా... ప్లీస్ నానా..."

"నిజంగా డబ్బుల్లేవురా. తర్వాత కొంటా నన్నాగా..."

## ముగ్గురు ప్రభువులు చిక్కారు

ఒకసారి దాసుగారు విజయనగరం మహారాజావారితో కాల క్షేపానికి చతుర్ముఖ పారాయణం చేస్తున్నారట. అప్పుడు మహా రాజావారికి మూడాసులు చేతిలో ఉండటంతో 'దాసుగారూ! మూడాసులున్న నన్ను జయించటం అసాధ్యం!' అన్నారట ఇంచుక గర్వంగా.



అప్పుడు దాసుగారు అమాయకత నటిస్తూ 'మహాప్రభూ! ఈ ఆటకు తమవంటి ప్రభువులు లభించటమే దుర్లభం! మరి ముగ్గురు ప్రభువులు నా చేతికి చిక్కారు! కాబట్టి గెలిచిం ది నేనే గదా?' అన్నారట తన చేతిలో మూడు రాజులున్నట్లు ప్రక టిస్తూ.

"పోనీ జీళ్ళైనా కొనిపెట్టు నానా..."

"ఏంట్రా నీ ఎదవగోల... జీళ్ళూ లేవు, గీళ్ళూ లేవు. డబ్బులు లేవని జెప్తే నీక్కాదూ. నిన్నసలు బయటికి తీసుకురా వడమే తప్పు... తీసుకొస్తే ఇదే ఎదవగొ డవ... నోర్మూసుకుని యింటికి నడు... లేపోతే తోలు వలిచేత్తాను.. ఏంటనుకు న్నావో..."

"నానా... నానా... ప్లీస్ నానా... జీళ్ళే

> **కొత్తగాలి...**
>
> **కాసు**
> **ఉదరాన్ని నింపుతుంది**
> **కళ**
> **హృదయాన్ని నింపుతుంది**
>
> – డి.వి.రమణమూర్తి, కాకినాడ

కొనియ్యి నానా... అక్కలూ నేనూ తింటాం నానా... ఇంకెప్పుడూ ఏమీ అడగను నానా...”

“నోర్ముయ్యమన్నానా? ... మూత్తావా లేదా? ...”

అక్కడితో నాకు పంతం హెచ్చింది. విసురుగా నాన్న చెయ్యి వదిలి నేలని కాళ్లతో తంతూ ఏడుపు మొదలుపెట్టాను.

అంతే వంగదీసి వీపుమీద ఒక్కటిచ్చాడు మా నాన్న.

అక్కడితో నాకు తిక్కరేగి ఆ ఇసకలో కిందపడి దొర్లుతూ ఏడవసాగాను.

మా నాన్నక్కూడా తిక్కరేగింది.

విసురుగా ఒక్క తన్ను తన్నింతర్వాత, కొడుతూ ముందుకు గెంటసాగాడు.

ఒక్కో దెబ్బకీ ఏడుస్తూ, గెంటుతుంటే, ముందుకు కదులుతూ తీర్థానికొచ్చిన వాళ్లంతా వింతగా చూస్తుండగా.. ఏ దుకాణాలని చూసి వచ్చేటప్పుడు ఎంతో ఆశపడ్డానో, ఆ దుకాణాల మధ్యనుంచే కళ్ళనిండా నీరు నింపుకుంటూ నడవసాగాను.

అలాగే కొట్టుకుంటూ ఇంటికి తీసుకొచ్చి పడేసి, మళ్ళీ సారా దుకాణం దగ్గరకి పోయాడు మా నాన్న.. కొడుకుగా నేను పోగొట్టిన మనశ్శాంతిని తిరిగి వెతుక్కుంటూ.

ఇంట్లోకి బెక్కుతూ వెళ్లేసరికి మా అక్కలు జీళ్ళు తింటున్నారు. ఏంటి... ఎందుకు ఏడుస్తున్నావని కూడా అడగలేదు మా అమ్మ. అంత ఇదిగా అలవాటైపోయింది.

నాకో జీడి మాత్రం పెట్టమంది.

మా చిన్నక్క ప్రేమగా జీడి తీసుకొచ్చి నా నోట్లో పెట్టింది. అప్పటిదాకా నన్ను ఊరించిన జీడి... ఎంతో తియ్యగా, నోట్లో ఉన్నంతసేపూ పాకం కారుతూ ఉండే జీడి... చాలా చేదుగా అనిపించిందా క్షణం...

★ ★ ★

నా బాల్య చాపల్యాలు ఏవీ మా ఇంట్లో తీరకపోయినా మా అమ్మమ్మ ఇంటి దగ్గర మాత్రం అడిగిన వెంటనే తీరిపోయేవి.

అక్కడికి ఎప్పుడు వెళ్ళినా మా తాతయ్యో, మా మావయ్యో నన్ను చంకన ఎక్కించుకుని బజారుకి తీసుకువెళ్లేవారు.

ఎత్తుగా ఉన్న సీసాల్లోని సరుకుల్ని భుజాలమీద కెక్కించుకుని చూపిస్తూ ఏది కావాలో కోరుకోమనేవారు. నేను అడిగిన పప్పులు అడిగినట్టు నాలుగు పొట్లాలు కట్టించేవారు. అవి సంచిలో తీసుకుని విడిగా ఏ చెగోడీలో, జంతికలో, గొట్టాలో కొని నా చేతిలో పెడితే తింటూ యింటికి చేరేవాళ్ళం.

అదొక్కటే కారణం కాదు, మా అమ్మమ్మ ఊరంటే నాకెంతో యిష్టం కావడానికి.

అక్కడున్ననాళ్లు ఒంటిమీద ఒక్క దెబ్బ కూడా పడకపోగా, పదేపదే ముద్దుల్లో మునిగితేలడం, కొట్టు దగ్గరికి ఏమన్నా కొనుక్కోవడానికి తప్పితే సరుకులకి వెళ్ళాల్సిరాకపోవటం... ముఖ్యంగా మా నాన్న అక్కడ లేకపోవటం! ఎప్పుడూ మా అమ్మే అక్కడికి తీసుకెళ్ళేది మమ్మల్ని. మరీ ఎక్కువకాలం అక్కడ ఉండిపోతే అప్పుడొచ్చి మమ్మల్నందరినీ తీసుకుపోయేవాడు మా నాన్న.

ప్రేమగా పిండివంటలు చేసిపెట్టే మా అమ్మమ్మ అన్నా, ఒళ్ళో కూర్చోబెట్టుకుని

ముద్దుచేస్తూ కథలు చెప్పే మా తాతయ్యన్నా, అడిగి మరీ అవీ యివీ కొనిపెట్టే మామయ్యన్నా, వాళ్ళింటి ముందుగా సాగే కాలువన్నా, ఆ ఊరన్నా ఎంతో యిష్టం నాకు. అక్కలకి కూడా యిష్టమే.

విచిత్రంగా మా అమ్మ కూడా ఎంతో సౌమ్యంగా ఉండేది అక్కడ ఉన్నంత కాలం.

ఊర్లో గుడిమీద నుంచి రోజూ పొద్దున్నా, సాయంత్రం వినవచ్చే పాటలు వింటూ, మా తాతయ్య చెప్పే కథలు వింటూ, మా మామయ్యకి బడిలో నేర్చుకున్న పాఠాలు ఒప్పచెబుతూ, కాలవలో ఈతలు కొడుతూ మా అమ్మమ్మ ఊరిలో గడపటం ఎంతో సంతోషంగా ఉండేది గానీ ఆ సంతోషం యొక్క వ్యవధి చాలా తక్కువ కావడమే నన్ను బాధించేది.

అందుకే అక్కడికి వెళ్ళేటప్పుడెంత ఉత్సాహంగా వెళ్ళేవాడినో, అక్కడి నుంచి యింటికి రావడానికి అంతగా ఏడ్చేవాడిని.

మా అమ్మ అమ్మమ్మ యింటికి వెళదామన్నా, మా మామయ్య మా యింటికి వచ్చినా ఎంతో సంతోషం నాకు. బడికి సెలవులు వస్తాయని తెలియగానే ముందు రోజే మా యింటికి వచ్చి నన్ను అక్కడికి తీసుకెళ్ళేవాడు మా మామయ్య. మళ్ళీ బడి తెరిచే సమయానికి తీసుకొచ్చి దింపేసేవాడు.

వాళ్ళింట్లో నిత్యం ఏవో తిండానికి ఉంటూ ఉండేవి. అటుకులో, తేగలో, మరమరాలో, పేలాలో... ఏదో ఒకటి.

అవి కాకుండా మా అమ్మమ్మ ఏదో ఒకటి చేసి పెడుతూ ఉండేది. తాతయ్య, మామయ్య చిరుతిండ్ల పొట్లాలు తెచ్చిపెడుతూ ఉండేవారు.

నాకెప్పుడూ తిండికి ఆబగానే ఉండేది. అందుకే కొంచెం కూడా మొహమాటం లేకుండా పీకలదాకా తినేసి చుట్టుపక్కల పిల్లలతో అది అరిగేదాకా ఆడుకుంటూ ఉండేవాడిని.

నా జీవితంలో మొట్టమొదటి ఆట వస్తువు మా మామయ్యే కొనిపెట్టాడు. అది ఒక బాల్. ఎంతో సంబరంగా దాంతో చాలా రోజులు ఆడుకున్నాను నేను. పెంకుల్ని ఏడింటిని ఒకదాని మీద ఒకటి పేర్చి, వాటిని ఆ బంతితో కొడుతూ ఒకటే ఆటలు.

వాళ్ళ ఊరి అమ్మవారు జనిపెల్లమ్మ తీర్థంలో మా మామయ్య కొనిపెట్టిన ఖర్జూరపు కాయల్ని ఊరించి ఊరించి తినడం ఈనాటికీ గుర్తే నాకు.

మా తాతయ్య కొనిపెట్టిన బుడగ కొన్న రోజు సాయంత్రానికే పేలిపోయినా, కళ్ళజోడు మాత్రం మా యింటికొచ్చేదాకా భద్రంగా ఉంది.

చీమ చిటుక్కుమంటే చితకబాదేసే మా అమ్మానాన్నలనే చూసిన నాకు సున్నుండల కోసం ఎక్కి అలమార తలుపు పీకేసి, ఆవకాయ జాడీని బద్దలుకొట్టినా ఏమీ అనని అమ్మమ్మ కుటుంబ సభ్యులంటే ఎంతో వింత...

ఒకసారి అక్కడ్నుంచి రానని ఒకటే ఏడుపు నేను. మా అమ్మ తిట్టినా, కొట్టినా కదల్లేదు, మెదల్లేదు.

మా మావయ్య 'తర్వాత నేను తీసుకొస్తాన్లే' అని మా అమ్మని, అక్కలనీ యింటికి పంపేశాడు.

రెండ్రోజుల తర్వాత మా నాన్న

## కొత్తగాలి...

**ఆమె ప్రాణం**
**రక్షించాడు**
**కానీ**
**మానం భక్షించాడు**

**– కొలకలూరి ఇనాక్, హైదరాబాద్**

వచ్చాడు.

అల్లుడి మర్యాదలు అందుకుని భోజనం కాగానే, నన్ను సైకిల్ ఎక్కమన్నాడు. అమ్మమ్మ ఒడిలో దూరిపోయి రానంటే రానన్నాను నేను. బలవంతంగా ఈడ్చు కొని, నాలుగు తగిలించి సైకిలెక్కించాడు నాన్న. నేను ఏడుస్తూనే ఉన్నాను. ఆ సైకిలు పది కిలోమీటర్లు దాటి మా యింటికి చేరేదాకా.

కానీ మా నాన్నని నా ఏడుపు ఏ మాత్రం కదిలించలేకపోయింది. దారంతా నా ఏడుపునాపడానికి మా నాన్న ఎంచు కున్న మార్గం ఒక్కటే. అది మాటి మాటికి కసురుకోవడం... మధ్య మధ్యలో మొట్టికాయలు వేయడం.

వెక్కివెక్కి ఏడుస్తున్న నన్ను యింట్లో పడేసి, ఎరువు తెచ్చుకున్న సైకిలు యిచ్చేసి సారా తాగి యింటికొచ్చాడు నాన్న.

★ ★ ★

నాకు జీవితంలో అత్యంత జుగుప్సాకర మైన మరో అంశం ఏమిటంటే, ఆరుబ యట మల విసర్జన.

మా గ్రామంలో అందరికీ అది అలవా టైపోయిన మామూలు వ్యవహారమేమో గానీ, నాకు మాత్రం అలా చెంబు చేత పట్టుకుని అలా జనం మధ్యలో నుంచి వెళ్ళడం చాలా ఇబ్బందిగా ఉండేది.

అందరూ నా వంకే చూస్తున్నట్టు, నన్ను చూసి గుసగుసలాడుకుంటున్నట్టూ, వాళ్ళలో వాళ్ళే ఏవేవో జోకులేసుకుంటూ నన్ను వెక్కిరిస్తున్నట్టు భావించేవాడిని. యిక మేమంతా వెళ్ళే తోటలో అయితే చూస్తేనే ఒళ్ళు జలదరించేలా ఉండేది పరి స్థితి.

మనిషికి రోజూ తప్పనిసరి అయిన ఒక కార్యక్రమం, అదీ పొద్దున్న లేచిలేవగానే జరిగే ఆ కార్యక్రమం అంత జుగుప్సాక రంగా, హేయంగా మనసుని బాధిస్తూ జరిగేది.

అలా ఒకరోజు కాదు, రెండు రోజులు కాదు. దాదాపు ఇ...ర...వై... మూ...డు... సం...వ...త్స...రా...లు అలాగే గడిచింది నాకు.

విచిత్రంగా ఈ విషయం మా ఊళ్ళో యింకెవరినీ బాధించేది కాదు. మా కుటుంబంతో సహా ఎవరూ ఆ విష యాన్ని అసహ్యకరమని అనుకోలేదు. అదంతా చాలా మామూలు వ్యవహారంలా ఉండేది అందరికీ.

... నేను యిదే భ్రమలో ఉండేవాడిని. మా పెద్దక్క రోజూ విపరీతమైన కడుపు నొప్పితో నెల నెలంతా బాధపడి తర్వాత ఆసుపత్రికి వెళ్ళేవరకు.

దాన్ని ఆసుపత్రికి తీసుకెళ్ళి, యింటికి తీసుకొచ్చాక మా అమ్మ అన్న మాటలు యివి...

"ఆరుబయటికి వెళ్ళడానికి సిగ్గొచ్చిం దంట రాణీగారికి... పొద్దున్నే లెగడం బద్ధకం.. లెగిశాక బయటకెళ్ళడానికి సిగ్గు... రోజూ బలవంతంగా ఆపుకుం టుంటే కడుపునొప్పి రాకపోతే ఏమొ త్తాది... పైగా ఆ డాక్టరు నన్ను తిట్టాడు... పిల్లల్ని సరిగ్గా గమనించా లమ్మా అంటూ... ఎద్దులాగెదిగింది యిది పిల్లంట... పిల్ల...!"

నాకు ఊహ తెలిసేటప్పట్నుంచీ మా ఊరికి ఎందరో ప్రెసిడెంట్లు వచ్చారు. ఎందరో చదువుకున్నవాళ్ళు ఉన్నారు. బోల్డంతమంది అధికార్లు వచ్చి వెళ్ళేవారు. ఎన్నో ప్రభుత్వాలు మారాయి.

కానీ ఆ సమస్య ఎవరి దృష్టికీ రాలేదు. నాగరికత మొదలై యిన్నివేల ఏళ్ళయినా యింకా అలాంటి దుస్థితిలోనే జనం ఉండటం ఎంత దురదృష్టం...

అది ఈనాటికీ అలాగే ఉండటం నన్ను మరీ దిగ్భ్రాంతికి గురిచేస్తోంది. చిన్న

పిల్లగా ఉన్నప్పుడే మా పెద్దక్క అంత ఆత్మగౌరవం గురించి ఆలోచించిందే.. మరి పెద్దయ్యాక ఏం చేస్తుంది? ..

జీవితంలో ఏది ఆగినా కాలం ఆగదు. అది అలా సాగిపోతూనే ఉంటుంది. మనిషి జీవితంలో రావాల్సిన మార్పుల న్నింటినీ తెచ్చిపడేస్తూ ఉంటుంది.

ఆ రోజు నాకు బాగా గుర్తు.

చెట్టు మీదనుంచి రాలిపడిన కొబ్బరా కుని బండిలా చేసుకుని ఆడుకుంటూ ఉన్నాం మేము. ఆకు మొదలును మట్ట అంటారు. ఆ మట్టమీద ఒకరు కూర్చుంటే మిగతావాళ్ళు దాని మరో చివర పట్టుకుని లాక్కుని వెళుతూ ఉంటారు. బండిలా ముందుకు సాగుతుందది.

మేము నలుగురం ఒకరి వెనకగా ఒకరు ఆ మట్టమీద కూర్చుంటుంటే మిగ తావాళ్ళు లాగుతున్నారు.

మా పెద్దక్క మట్టమీద కూర్చుని ఉంటే మిగతావాళ్ళం లాగుతున్నాం అప్పుడు. స్కూలుకి సెలవు కావడంతో పేటలోని మిగతా పిల్లలు కూడా అక్కడక్కడా ఆడు కుంటున్నారు. ఒకటే కేరింతలు... నవ్వులు... కేకలు...

ఆ కేకల మధ్య 'అమ్మ బాబోయ్' అన్న కేక...

ఆ గొంతు మా పెద్దక్కది.

తను వేసుకున్న పరికినీ వెనుక భాగాన్ని అదే పనిగా చూసుకుంటూ 'అమ్మోయ్ రక్తం... అమ్మోయ్ రక్తం...' అంటోంది.

అందరికీ ఒకటే కంగారు.

ఆడుకుంటున్నప్పుడు ఏదైనా గీసుకుని దెబ్బ తగిలిందేమో... రక్తం వస్తోందేమో నని.

అందరం ఏడుస్తూ యింట్లో దూరాం. మా అమ్మ లేదు. పనికి వెళ్లింది. నాన్న కూడా. అలాంటప్పుడు పక్కింట్లో ఉండే రత్తమ్మమామ్మ దగ్గరికి వెళ్ళడం మాకల వాటు.

మా పెద్దక్క ఏడుస్తూ ఆవిడ దగ్గరకెళ్ళి 'రక్తం వస్తోంది మామ్మా, చూడు' అంది.

ఒక్క క్షణం పరిశీలనగా చూసి, మరు క్షణం హడావిడి చేయసాగింది రత్త మ్మమ్మ. చుట్టుపక్కల ఉన్న నలుగురినీ పిలిచింది. మా అమ్మని తొందరగా పిలు చుకు రమ్మని నన్ను తరిమింది.

ఆ హడావిడంతటికి కారణం మా అమ్మ యింటికి చేరాక తెలిసింది మాకు.

మా పెద్దక్క పెద్ద మనిషి అయింది.

చాకలి రంగమ్మ వచ్చి దాన్ని చాపమీద కూర్చోబెట్టింది.

మా పాకలోనే దాన్ని కూర్చోబెట్టినచోట చుట్టూ తడికెలు కట్టారు. ఆ రోజు నుంచీ పన్నెండు రోజులపాటు దాని స్థానం అక్కడే. బయటకి కదలడానికి లేదు. స్నానం గీనం ఏమీ ఉండవు.

రోజూ ఉదయాన్నే నూనె తాగాలి. తర్వాత బియ్యం, బెల్లం కలిపి చేసే పిట్టు పెడతారు. భోజనంలో తీపి తప్ప కారం పెట్టరు ఆ పన్నెండు రోజులూ. రోజూ వంటికి పసుపూ, నూనె రాస్తారు.

ఒక్క ఆరుబయటకి పోవలసి వచ్చిన ప్పుడు తప్ప, యింక దేనికీ అక్కడ్నించి కదలడానికి లేదు. బయటకి వెళ్ళేటప్పుడు ఆ చాపమీద, అంతకుముందే చేసిపెట్టిన బొమ్మని ఉంచాలి.

ఆరుబయటకి వెళ్ళేటప్పుడు కూడా కత్తిని తీసుకెళ్ళాలి.

ఈ ఆచారం ఎందుకో నాకు తెలియదు గాని, ప్రతి ఆడపిల్లా, ప్రతిరోజూ బయటకి వెళ్ళేటప్పుడు కత్తిని తీసుకెళ్ళాలనే ఆచారం ఉండుంటే యివాళ ఆడపిల్లల మీద యిన్నేసి అత్యాచారాలు, హత్యలూ జరగక పోను.

కనీసం ఆరుబయటకి వెళ్ళేటప్పుడైనా తప్పనిసరి అని అంటే మా పెద్దక్క ప్రాణ

మైనా దక్కి ఉండేది...

మా పెద్దక్కకి ఉదయాన్నే లేవడమంటే తగని బద్ధకం. ఆ బద్ధకం వల్లనే ఆ మధ్య కడుపునొప్పి తెచ్చుకుంది.

కానీ యిప్పుడు పెద్దమనిషి అయింది కదా, వెలుతురు వచ్చాక ఆరుబయటకి వెళ్ళడం బాగోదు కదా... అందుకే మా అమ్మ దాన్ని బాగా తెల్లవారుజామున నిద్ర లేపేసేది.

నాకూ అప్పుడే మెలకువ వచ్చేసేది.

అక్కని బలవంతంగా నిద్రలేపేసి, బయటకి దగ్గరుండి తీసుకెళ్ళి తీసుకొచ్చేది అమ్మ. ఆ తర్వాత తన యింటి పనుల్లో తాను పడేది.

పన్నెండు రోజులపాటు రోజూ తెల్లవారుజామున లేవడానికి ఏడుస్తూ ఉండేది మా అక్క. విసుక్కుంటూ, కసురుకుంటూ ఎలాగో దాన్ని లేపి బయటకి పంపించేది అమ్మ.

అమ్మాయి రజస్వల అయితే యివన్నీ చేయడం మన ఆచారం కనుక అమ్మాయికి ఎంత యిబ్బందయినా తప్పనిసరిగా చేశారు.

కానీ పన్నెండోరోజు రాత్రి మా అక్కకి స్నానం చేయించిన తర్వాత పదమూడో రోజు పదిమందిని పిలిచి భోజనాలు మాత్రం పెట్టలేదు మావాళ్ళు, అది ఆచారమైనా సరే.

మా అమ్మమ్మ కుటుంబం, మా కుటుంబం మాత్రం కలిసి భోజనాలు చేశాం ఆ రోజు.

డబ్బుల్లేవు కాబట్టి ఆ ఆచారం మానగలిగారు.

దేనికీ ఎదురాడక, భరించే పిల్ల కాబట్టి చీకట్లో పన్నెండు రోజులు కనీసం స్నానం కూడా లేకుండా కూర్చోబెట్టగలిగారు.

ఆచారం ప్రకారమే, పెద్దమనిషి అయిన మేనకోడలికి మా మావయ్య బట్టలూ, మా అమ్మమ్మేమో బంగారం పెట్టారు.

## కొత్తగాలి...

**నువ్వు సౌదీలో**
**నేను ఇండియాలో**
**డబ్బు వంతెన**
**మన మధ్యన**
**అనురాగం ఫోనులోనే!**

– యలమర్తి అనూరాధ, పెనుగొండ

★ ★ ★

ఊళ్ళో బడిలో అయిదో తరగతిదాకానే ఉండటంతో ఆరో తరగతికి దగ్గర్లో ఉన్న పట్నం వెళ్ళవలసి వచ్చింది నాకు.

దగ్గర్లో అంటే మరీ దగ్గర్లో ఏమీ కాదు. రెండున్నర కిలోమీటర్ల దూరం ఆ హైస్కూలు.

ఆడపిల్లలు గనుక ఊళ్ళోని బడిలో అయిదో తరగతి వరకూ చదివి తర్వాత మానేశారు మా అక్కలంతా.

అందులోనూ ఆడపిల్లలు పెద్దమనిషి అయ్యాక బయటకి పంపడానికి వ్యతిరేకంగా ఉంటారు పల్లెటూళ్ళలో.

బాగా చదివే కుర్రవాడు కదా, ఆ పదో తరగతిదాకా ఎలాగోలా లాగించండి... తర్వాత వాడి రాత ఎలావుంటే అలా సాగుతుంది... అని మా చిన్నస్కూలు మాస్టారు చెప్పిన మాటలవల్ల నేను హైస్కూలుకి పోగలిగాను. అందులోనూ ఎలాగో ఉచిత విద్యేగదా అది.

లేదంటే, మా నాన్నా... నన్ను చదివించేది? ...

హైస్కూల్లో చేరాక నా ప్రపంచం కాస్త విశాలమైంది. కొత్త ప్రదేశం, కొత్త మనుషులు, కొత్త స్నేహితులు...

కానీ అవే తర్వాత్తర్వాత యిబ్బందులవుతాయని అప్పట్లో నాకు తెలియదు.

ఎప్పటికీ ఏ యిబ్బందీ కలిగించని స్నేహితుడు నవీన్ నాకు హైస్కూల్లోనే

పరిచయమయ్యాడు.

ఆ హైస్కూల్లోని పిల్లలు ఎక్కువశాతం ఆ పట్టణంలోని వారే. వారికీ నాకూ ప్రధానమైన తేడా.. వాళ్ళు ఎత్తుగా, బలంగా, ఏపుగా ఎదిగిన వరికంకుల్లా ఉండేవారు. నేను వాళ్ళ మధ్య కలుపుమొక్కలా పీలగా, పీక్కుపోయినట్లుగా ఉండేవాడిని.

మా ఊళ్ళో పదో తరగతి చదివేవాళ్ళు వాళ్ళలా ఉంటారు. ఈ ఊళ్ళో మూడో తరగతి చదివేవాళ్ళు నాలాగ ఉంటారు.

ఆ తేడా పదేపదే గుర్తుకొచ్చి కుంచించుకుపోతూ ఉండేవాడిని నేను.

మా ఊరిబడికీ, యిక్కడికీ ప్రధానమైన తేడా... రోజూ సాయంత్రం ఒక పిరియడ్‌లో తప్పనిసరిగా ఆటలాడాలి యిక్కడ. మా బడిలో అలాంటివి ఏమీ ఉండేవి కావు. బడిలో ఉన్నంతసేపూ చదువుకోవడం, బడయ్యాక యింటి దగ్గర ఆటలాడుకోవడం...

ఇక్కడ ఆటలు కూడా పూర్తిగా వేరు.

వాలీబాల్, ఫుట్‌బాల్, క్రికెట్, కబడ్డీ... లాంటి ఆటలు డ్రిల్ మాస్టారి సారథ్యంలో ఆఖరి పిరియడ్‌లో అందర్నీ గ్రౌండ్‌కి తోలేసి ఆడించేవారు. ఆ ఆఖరి పీరియడ్ అంటే పిల్లలందరికీ ఎంతో ఉత్సాహం. దాని ముందు పీరియడ్ అయి మాస్టారు బయటకి వెళ్ళగానే అందరూ పొలోమని గ్రౌండ్‌కి పరిగెత్తేవారు.

నాకు మాత్రం ఆ అరగంటా గడవడం అంటే కత్తిమీద సాములా ఉండేది.

ఎందుకంటే ఆ ఆటలు ఆడడానికి కావాల్సినంత 'ఓపిక' నా దగ్గర ఉండేది కాదు. మా డ్రిల్ మాస్టారి బాధ పడలేక ఏదో ఒకటి ఆడడానికి ప్రయత్నించినా రెండు నిమిషాలు తిరక్కుండా గస వచ్చేసేది నాకు. ఒకటే ఆయాసం...

పైగా ఆ పిరియడ్ తర్వాత రెండు కిలోమీటర్లు నడిచి మా యింటికి వెళ్ళాలి. ఆ నడిచి వెళ్ళేసరికి నాకు విపరీతంగా ఆకలేసేది. కానీ యింట్లో తినడానికి ఏమీ ఉండేది కాదు.

ఇక ఆటలన్నీ ఆడి వెళ్తే దార్లోనే శోషొచ్చి పడిపోవడం ఖాయం.

ఆటలొక్కటే కాదు ఆ బడిలో నా దుంప తెంచేది... రోజూ పొద్దున్నే బడి ప్రారంభమవడానికి ముందే అరగంటపాటు జరిగే ప్రేయర్ కూడా. ఉదయపు ఎండ శరీరానికి తగిలితే మంచిదనీ, ఆ ఎండలో 'డి' విటమిన్ ఉంటుందనీ, దాని వలన ఎముకలు గట్టిపడతాయనీ, అలాగే ఆ ఎండ వలన రోగకారక క్రిములు చనిపోతాయనీ... ఆ కారణంవల్ల రోజూ పిల్లలంతా ఎండలో ప్రేయర్ పేరిట్టైనా అరగంటపాటు నిలబడాలనీ మా ప్రిన్సిపాల్ గారి ఆదేశం...

కానీ ఆ ఎండవల్ల కళ్ళు కూడా తిరుగుతాయనీ, వికారంతో ఒళ్ళు సోయి తెలియకుండా పడిపోతారనీ... శుభ్రంగా బ్రెడ్డూ జామూ తినొచ్చిన ఆయనకి తెలియదు.

ఒకరోజు ఏమీ తినకుండా స్కూలుకొచ్చి ప్రేయర్‌లో కళ్ళు తిరిగి పడిపోయిన నాకు తెలిసింది.

కానీ మా ప్రిన్సిపాల్ చెప్పే స్థానంలో ఉన్నారు అప్పటికి. నేను వినే స్థానంలో ఉన్నాను.

బడిలో కష్టాలు అలా ఉంటే, యింటి దగ్గరి కష్టాలు మరోరకంగా ఉండేవి నాకు.

బడినుంచి వస్తూ వస్తూ మా అమ్మానాన్నా పనిచేసే పొలాల దగ్గర ఆగడం కొత్త అలవాటు అయింది.

తోటల్లో ఏరుకొచ్చిన కమ్మలూ, చితుకులూ, పనిచేసే యజమానుల్ని అడిగి తెచ్చిన డాలకలు, డొక్కలూ లాంటివి మూటకట్టి నా నెత్తిన పెట్టేవారు. వెనక తామో మూట నెత్తికెత్తుకుని వచ్చేవారు వాళ్ళు. నా బక్కచిక్కిన శరీరం ఎంత

## పదిమెట్లు ఎక్కినట్లయింది...

'చతుర' ఈ నవలను ప్రచురణకు స్వీకరించడంతో రచయితగా బుడిబుడి అడుగులు వేస్తున్న నేను ఒకేసారి పదిమెట్లు ఎక్కినట్లయింది. ఇక ఇతివృత్తానికి సంబంధించి గత అనుభవాలు నన్ను తీవ్ర అంతర్మథనానికి గురిచేశాయి. నా చిన్నతనంలో మా మావయ్య, చిన్న అమ్మమ్మ కొడుకులైన ఇద్దరు మావయ్యలు ఆత్మహత్య చేసుకున్నారు. ప్రతిజీవీ బతికేందుకే పోరాటం చేస్తుంది. అది దాని నైజం. అయితే కొందరు మనుషులు మాత్రం చావుని వెతుక్కుంటూ పోతారు. అణుయుద్ధాలు, సునామీలు, తుపానులు, భూకంపాలు చెలరేగినప్పుడు సైతం నిరాశ్రయులైనవారు ఆత్మహత్యలు చేసుకోరు. చిన్నచిన్న సమస్యలను పెద్దవిగా భ్రమించేవారు మాత్రమే ఆ పనిచేస్తుంటారు. తనువు చాలించాలనుకుని కూడా ఒక్కక్షణం ఆగి ఆలోచించడం వల్ల బతికి బట్టకట్టినవారు అనేకులు. అలాంటివారే తర్వాత జీవితంలో ఎన్నో విజయాలు సాధించి సమాజంలో సగర్వంగా నిలిచారు. పరాజయం ఎదురైనా పారిపోకుండా నిలిచి గెలిచిన విజేతల అనుభవాల, సందేశాల సమాహారంగా ఈ నవలను రాశాను.



వెంకటేష్


**చిరునామా :**

పైడికొండల వెంకటేశ్వర రావు,
ఇం. నెం. 2-114
రామాలయం ఎదురుగా,
జనుపల్లె-533577
తూర్పుగోదావరి జిల్లా


బరువు మోస్తుందని వాళ్ళ అంచనాయో నాకు తెలీదుగానీ, వాళ్ళు నెత్తిన పెట్టిన మూటతో మాత్రం నేను ఎక్కువ దూరం నడవలేకపోయేవాడిని... కొంచెం దూరం నడవడం, మోయలేక ఆ మూట కింద పడెయ్యడం... మళ్ళీ మా అమ్మో, నాన్నో, దారినపోయేవాళ్ళో తలకెత్తడం... కొంచెం దూరం నడిచి పడెయ్యడం...

ఆ పొలాల నుంచి మా యింటి వరకూ ఉండే కాస్తంత దూరం చాలా భారంగా తరిగేది నాకు.

ఒక్కోసారి ఏడుస్తూ నేను యింక పొలానికి రానే అమ్మా... ఆ మూటలు మోయలేకపోతున్నాను అంటే 'అంత అబ్బనాకారం ఎదవలా తయారయ్యేవేరా నా ప్రాణానికి...' అనేది.

"మనకి తోటలూ పొలాలూ లేవుగదా... రోజు పొయిలోకి కమ్ములు కావాలి గదా... ఆళ్ళు యిచ్చినప్పుడే మనం తెచ్చుకోవాల... లేకపోతే మనం వంటెలా వండుకోవడం? ... ఆ రాజయ్యగారి పిల్లోడు సూడు పెద్దోల్తో సమానంగా పెద్ద పెద్ద మూటలు, కమ్ములు యింటికి మోత్తాడు" అనేది.

ఆ రాజమ్మగారి పిల్లోడు రామక్రిష్ణ బలంగా, దృఢంగా, దుండుముక్కలా ఉంటాడు. మరి నేనో... బక్కగా ఉంటాను.

వాడికీ నాకూ తేడా లేదూ? మరి వాడు మోసే మూటలకీ, నేను మోసే మూటలకీ తేడా ఉందంటే ఉండదూ...

వాడెక్కడా? నేనెక్కడా? ...

ఓ పక్కన చదువుకుంటున్నా మరోపక్కన- రేపెలాగూ ఈ పనులు చేయక తప్పదు కదా అన్నట్టు- వ్యవసాయం పనులు ఒక్కొక్కటిగా నేర్పేవారు నాకు. ఒక మూట నిండా పచ్చగడ్డి కోస్తే రెండు రూపాయలు యిచ్చేవారు అప్పట్లో. మా నాన్న ఆ పని చేయించేవాడు నా చేత. సాయంత్రం వేళల్లో, ఖాళీ సమయాల్లో

ఎన్నోసార్లు ఆ పచ్చని పొలాల మధ్య, కాలువగట్ల మీద ఒంటరిగా పచ్చగడ్డి కోస్తుంటే వేళ్ళు తెగేవి, అలవాటు లేక.

రోజుల తరబడి ఆ గాయాలు మానక ఎంతో బాధపడేవాడ్ని నేను. ఆ బాధతో ఓదార్పు కోరుకుంటే చిత్రంగా నన్ను తిట్టే వారు మా అమ్మా నాన్నా. ఏ పనీ చేత కాని వెదవనంటూ...

ఇదివరకట్లా సెలవులు వచ్చినప్పుడు మా అమ్మమ్మ యింటికి వెళ్ళడానికి లేకుండా పోయింది నాకు.

సరిగ్గా అప్పుడే వరికోతలు మొదలవు తాయి మరి.

తనతోపాటు నన్ను కూడా కూలీకి తీసు కెళ్ళి, నాకు ఒక పక్క ఆ పనులు అల వాటు చేస్తూనే మరోపక్క నాకు రావల సిన కూలీ డబ్బులు కూడా తీసుకెళ్ళి తాగె య్యడం మొదలుపెట్టాడు మా నాన్న.

ఆ విషయం మీద తారస్థాయిలో గొడవ జరిగింది వాళ్ళిద్దరికీ. మా అమ్మ ఆక్రోశం ఆపుకోలేక నానా మాటలూ అంది. చేతికి దొరికినవి దొరికినట్టు మా నాన్నమీద విసి రికొట్టింది.

మా నాన్న కూడా ఎక్కడా తగ్గకుండా చేయాల్సిన రాద్ధాంతం అంతా చేసి 'ఛీ, పాడు కొంప' అని తిట్టుకుంటూ మళ్ళీ సారా కోసం బయటికి పోయాడు.

మా యింటికన్నా బడే పదిలం అనిపిం చేంది నాకు.

అందుకే ఏనాడూ సెలవు పెట్టకుండా బడికి వెళ్ళేవాడిని నేను. ప్రేయర్ టైము లోని యిబ్బందిని ఆలశ్యంగా బడికి వెళ్ళడం వలన అధిగమించాను. ఆటల వల్ల వచ్చే నీరసాన్ని, ఆ సమయానికి గ్రౌండుకి వెళ్ళకుండా స్కూలు లైబ్రరీలో గడపడం ద్వారా జయించాను.

పాఠం చెప్తే సినిమా చూస్తున్నట్టుగా అనిపించేలా చెప్పే మా తెలుగు మాస్టారు ఒక పక్కనా, నేనొక్కడ్నే ఒక పక్కనా ఆ లైబ్రరీలో రోజులకి రోజులు గడిపేశాం.

అక్కడే ఆయనకీ, నాకూ స్నేహం కుది రింది.

ఎంతో వాత్సల్యంగా ఏమీ పుస్తకాలు చదవాలో, ఎలాంటి పుస్తకాలు చదవాలో చెప్పేవారాయన.

ఇది చాలా చిన్న లైబ్రరీ అనీ, యింకా పెద్ద లైబ్రరీ ఫలానాచోట ఉందనీ, అక్క డ్నుంచి రోజుకో పుస్తకం తీసుకెళ్ళి చద వడం ద్వారా జ్ఞానాన్ని పెంచుకోవచ్చనీ అన్నారు.

అసలైన చదువంటే అదేననీ, యిప్పుడు చదువుతున్న చదువు ఉద్యోగం తెచ్చుకోవ డానికి తప్ప దేనికీ పనికి రాదనీ అన్నారు...

మా స్కూలు లైబ్రరీ నిండా ఎక్కువగా పిల్లల కథల పుస్తకాలుండేవి. ఎన్నో కథలు... ఆ కథల నిండా పక్షులూ, జంతువులూ, దేవుళ్ళూ, దేవతలూ, రాక్ష సులూ, మాయలూ, మంత్రాలూ, రాజకు మారులూ, రాజకుమార్తెలూ, మహిమలు చూపే చెట్లు, మణులు కలిగి ఉండే పాములు...

ఒక్కో కథ ఒక్కో రీతి... ప్రతి కథ లోనూ ఒక నీతి... అదో అద్భుతలోకం.

ఆ లోకంలోకి అడుగుపెడితే సర్వస్వం మరచిపోయేవాడిని నేను. ఆ గది గోడకా నుకుని ఉన్న స్కూలు గ్రౌండ్‌లోని పిల్లల ఆటపాటల తాలూకు కేకలుగానీ చకచకా గడిచిపోయే సమయంగానీ గుర్తుకొచ్చేవి కావు నాకు.

స్కూలు సమయం ముగిసి లాంగ్‌బెల్ కొట్టే సమయానికి, యింటికి వెళ్ళడానికి మాత్రం ఎంతో బాధ అనిపించేది నాకు.

మా అమ్మమ్మ యిల్లు తర్వాత ఉండటా నికి సుఖంగా అనిపించిన మరో ప్రదేశం ఆ లైబ్రరీయే.

మా అమ్మమ్మ యిల్లూ, స్కూలు లైబ్రరీ కాక మనసుకు హాయినిచ్చిన మరో ప్రదేశం- నవీన్ వాళ్ళ యిల్లు.

అక్కడున్న ప్రతిక్షణం వాళ్ళింటికీ, మా యింటికీ మధ్య ఉండే వ్యత్యాసం గుర్తు కొచ్చి బాధనిపించినా, నవీన్ వాళ్ళమ్మానా న్నల మంచితనం.. ముఖ్యంగా నవీన్ వాళ్ళమ్మగారి మంచితనం నాకు బాగా అనిపించేది.

మా స్కూలుకి బాగా దగ్గరే వాళ్ళ యిల్లు.

పెద్ద ప్రహరీ, మధ్యలో బోలెడన్ని పూల మొక్కలు.. వాటి మధ్య పెద్ద పెంకు టిల్లూ.. చూడముచ్చటగా ఉండే యిల్లు...

మొట్టమొదటిసారి నవీన్ నన్ను యింటికి తీసుకెళ్ళినప్పుడే సాదరంగా ఆహ్వానించారు వాళ్ళమ్మ లక్ష్మిగారు.

నన్ను సోఫాలో కూర్చోబెట్టి నా వివ రాలు అడుగుతూ, నవీన్‌ని బట్టలు మార్చుకుని రమ్మని చెప్పిందావిడ.

వాడొచ్చేలోగా లోనికి వెళ్ళి ప్లేటులో రెండు మైసూర్‌పాక్ ముక్కలూ, కొంత కారపు బూందీ తెచ్చి పెట్టింది.

నేనేం మొహమాటం లేకుండా తీసుకు న్నాను. నవీన్ మాత్రం ససేమిరా తిన నంటే తిననన్నాడు. తర్వాత తింటాను, ముందు బయటకెళ్ళి ఆడుకుంటానని మారాం చేశాడు.

"ముందు యివి తినాలి. తర్వాత ఆడు కోవాలి" అని మృదువుగా చెప్పి,

"మా నవీన్ తిండిదగ్గర చాలా ఏడిపిం చేస్తాడమ్మా. అస్సలు తిండి తినడు. ఎప్పుడూ ఆటలో ఆటలు అంటూ ఉంటాడు. నువ్వెప్పుడయినా మీ అమ్మగా రిని తిండి దగ్గర ఏడిపిస్తావా?" అనడి గింది.

నాకు పొలమారింది.

"తిండి వద్దంటూ ఏడిపిచడం నాకే నాడూ తెలియదు. ఇంకా కావాలని ఏడ

కొత్తగాలి...

**పైసా లేక**
**మెతుకు కోసం సెర్చి!**
**కోట్లతో**
**చందమామతో రీసెర్చి**

– మరో భారతీయుడు

వడం తప్ప... ఎక్కడ తేనురా అంటూ మా అమ్మ నాలుగు దెబ్బలేస్తే ఏడవడం తప్ప..

కానీ అవేం ఆవిడతో అనలేక 'ఏడిపించ నండీ' అన్నాను.

"అదీ మంచబ్బాయిల లక్షణం. చక్కగా తినాలి. బాగా చదువుకోవాలి. అప్పుడ ప్పుడే ఆడుకోవాలి. అంతేకానీ ఎప్పుడూ ఆటలే అంటే ఎలా" ఎంతో మృదువుగా అందావిడ.

అసలు ఆవిడ చూడ్డానికే చాలా బావుం టుంది.

పాతాల పుస్తకాల్లో, కథల్లో చదివిన అమ్మ పాత్రలా ఉంటుంది. చాలా శుభ్రంగా, చక్కగా, హుందాగా ఉంటుంది. మనిషి నిండుగా, పుష్టిగా, కళకళలాడుతూ ఉంటుంది.

వాళ్ల యిల్లు కూడా అంతే. ఎప్పుడూ శుభ్రంగా ఉంటుంది. బయట మొక్కలు ఎప్పుడూ ఆహ్లాదకరంగా కనిపిస్తుంటాయి.

నవీన్ కూడా ఎప్పుడూ కడిగిన ముత్యంలా ఉంటాడు. మంచి మంచి డ్రెస్‌లు వేసుకుని ఉంటాడు. క్రాపు కూడా ఎన్నడూ చెరగదు. నడుముకి బెల్టూ, కాళ్ళకి మంచి చెప్పులూ... మనిషి ఎత్తుగా, పుష్టిగా ఉంటాడు.

నవీన్ వాళ్ళ నాన్నగారు వడ్డీలకి అప్పు లిస్తూ ఉంటారు. అదే ఆయన ఉద్యోగం,

వ్యాపారం అన్నీ... పల్లెలో ఉన్న వ్యవసాయ భూమంతా అమ్మేసి పట్నం వచ్చి యిల్లు కొనుక్కుని ఆ వ్యాపారం మొదలు పెట్టాడట ఆయన.

చిన్న చిన్న వ్యాపారస్తులకీ, చిన్నచిన్న ఉద్యోగస్తులకీ, ప్రైవేటు సంస్థల్లో పనిచేసే ఉద్యోగులకీ ముందే వడ్డీ మినహాయించుకుని డబ్బు యివ్వడం.. రోజువారీ, నెలవారీ వసూళ్ళు చేసుకోవడం.. దాంతో పాటు పాట చీటీలు కట్టించుకోవడం చేస్తారట ఆయన.

వ్యాపారం ఉధృతంగా నడుస్తూ ఉండటంతో ఆ కుటుంబానికి ఏ లోటూ లేకుండా సాగిపోతోంది.

ఒక్కగానొక్క కొడుకు నవీన్ ఆ సంపదలో, తల్లిదండ్రుల ప్రేమలో మునిగితేలుతున్నాడు...

హైస్కూల్లో చదువుకునేటప్పుడు యింటర్వెల్ లో అవీ యివీ కొనుక్కోవడానికి వాడి దగ్గర బోల్డన్ని డబ్బులు.. తనతో పాటు నాకు కూడా కొనిపెట్టేవాడు వాడు.

అప్పటివరకూ నేను అనుభవించాలనుకుని అనుభవించలేకపోయిన అన్ని సరదాలూ వాడి ద్వారానే తీర్చుకున్నాన్నేను.

ఇక వాళ్ళింటికి వెళ్తే సరేసరి.

ఒకరకంగా చెప్పాలంటే సుబ్బరంగా తిండి దొరుకుతుందనే ఎంతో ఉత్సాహంగా వాళ్ళింటికి వెళ్ళేవాడిని నేను.

అదికాక వాళ్ళింట్లో నన్ను మరీ ఆకర్షించిన మరో వస్తువు- రేడియో.

ముఖ్యంగా అందులో వచ్చే పాటలు... ఆ పాటల్లోని సాహిత్యం, అక్కడ, హైస్కూలు నుంచి మా యింటికి వెళ్ళేదారిలోనూ రేడియో పాటలు వినడం, పదేపదే వాటిని హమ్ చేసుకుంటూ నడవడం...

పుస్తకాలు చదవడం తర్వాత పాటలు వినడం కూడా నన్ను ఏవో లోకాల్లోకి తీసుకుపోయి, ఊహల పల్లకిలో ఊరేగించేది.

అలా పాటల పట్ల ఏర్పడిన నా ఆసక్తి కొన్ని వందల పాటల సినిమాల పేర్లు, సంగీత దర్శకుడు, పాటల రచయిత, గాయనీగాయకులు, నిర్మాత దర్శకులు, హీరో హీరోయిన్లు... యివన్నీ కంఠతా వచ్చేలా చేశాయి.

ఎన్నెన్ని మధురమైన పాటలు... ఎంత చక్కని సంగీతం... ఎందరు గేయరచయితలు... సముద్రాల, శ్రీశ్రీ, పింగళి, ఆత్రేయ, ఆరుద్ర, సి.నారాయణరెడ్డి, జాలాది, వేటూరి సుందరరామూర్తి, సిరివెన్నెల సీతారామశాస్త్రి...

వాళ్ళంతా కలాలు అమృతంలో ముంచి అక్షరాలు రాస్తుంటే, ఆ అమృతాన్ని తాగి పాడినట్టు ఘంటసాల నుంచి బాలసుబ్రహ్మణ్యం దాకా పాడుతుంటే.. మహదేవన్, ఇళయరాజా లాంటి సంగీత దర్శకులు వాటికి శాశ్వతత్వం కల్పిస్తుంటే...

ఆ పాటలు విన్నవాళ్ళ జన్మ ధన్యమవదూ... చెవుల్లోంచి శరీరమంతా పాకిన అమృతం ఆయుష్షును పెంచదూ...

నా మట్టుకు మాత్రం బాధల నుండీ, వేదననుండీ, బాధించే నా పరిసరాల నుండీ ఆ పాటలే, ఆ పాటల తాలూకు ఆలోచనలే, ఆ పాటల్ని నెమరు వేసుకోవడమే నన్ను దూరంగా తీసుకెళ్ళి హాయిగా లాలించేవి.

'ప్రతీరాత్రి వసంత రాత్రి
ప్రతిగాలి పైరగాలి
బ్రతుకంతా ప్రతి నిముషం
పాటలాగ సాగాలి'

అన్న కృష్ణశాస్త్రి పాటలా జీవితం పాటలాగా సాగిపోవాలనీ, అలాగే సాగిపోతుందనీ కలలు కనేవాడ్ని.

'ఆకాశవీధిలో హాయిగా తేలేవు' అంటూ మేఘాల్ని పలకరించే వాడిని.

'చల్లని రాజా ఓ చందమామా
నీ కథలన్ని తెలిసాయి ఓ చంద మామా...'
అంటూ చందమామని ఉడికించేవాడిని.
'ఎచట నుండి వీచెనో ఈ చల్లనిగాలి
తీగెలపై ఊగుతూ పూవులపై తుగూతూ
ప్రకృతినెల్ల హాయిగా తీయగా-మాయగా
పరవశింపచేయుచూ...!
అని పాడుకుంటూ చల్లగాలి స్పర్శకి పులకరించిపోయేవాడిని.
ఏ నిద్రపట్టని రాత్రి 'పాడుతా తీయగా చల్లగా... పసిపాపలా నిదురపో తల్లిగా...' అంటూ నన్ను నేనే ఓదార్చుకునే వాడిని.

ఊహ తెలిసిన క్షణం నుంచీ నన్ను వెంటాడే వేదన నుంచీ, నాలో ఉద్భవించే ప్రశ్నల నుంచీ, ఎన్నెన్నో ఆలోచనల నుంచీ నేను పాటల సాయంతో పారిపోయే వాడ్ని.

వేరేలోకంలో హాయిగా సేదతీరేవాడిని.

హైస్కూల్లో క్లాసు నుంచి క్లాసుకి మారే సమయంలోనే నేను చదివే పుస్తకాల స్థాయి పెరిగింది.

వినే పాటల తాలూకు లోలోతులు తెలియసాగాయి.

నవీన్‌తో స్నేహం బాగా బలపడింది.

ఎంత చదివినా, ఎన్ని విన్నా, ఏమి నేర్చుకున్నా... మిగతా ప్రపంచానికీ, నాకూ మధ్యనున్న అంతరం నన్ను బాధిస్తూనే ఉండేది.

నిజానికి తెలుసుకుంటున్న జ్ఞానం నన్ను నిరంతరం బాధిస్తూనే ఉండేది.

నేనింక కనీస సౌకర్యాలు కూడా లేకుండా ఎలా బ్రతుకుతున్నానో, ప్రపంచం ఎలా ముందుకు దూసుకుపోతోందో తెలిసేకొద్దీ నా వేదన ఎక్కువైంది.

ప్రపంచంతో పోలిస్తే నేను ఎందుకూ పనికిరానన్న ఆత్మన్యూనత కూడా నాతో పాటే పెరిగి పెద్దదయింది.

నవీన్‌తో తప్ప నేనెవరితోనూ కలిసేవాడిని కాను. యింట్లో కూడా మిగతా వాళ్ళకి నాకు మధ్య అంతరం బాగా పెరిగిపోయింది. ఎవరితోనూ ఎక్కువ మాట్లాడేవాడిని కాను.

ఎప్పుడూ నాలో నేను ఆలోచించుకుంటూ, పాటలు పాడుకుంటూ నా లోకంలో నేను ఉండేవాడిని.

నేనేంటో, నా ఆలోచనలేంటో నవీన్‌తో సహా ఎవరికీ తెలిసేవి కాదు.

మరోపక్క అక్కలంతా పెద్దవాళ్ళయ్యారు. ఒకరి వెనుకగా ఒకరు రజస్వల కావడం... ఆచారం పేరిట వాళ్ళని చీకటి

## ఏ కథకైనా సిద్ధమే!

దాసుగారు ఓసారి కథ చెప్పటానికి ఉపక్రమించబోతూ శ్రోతలను చిలిపిగా 'మీకు హరికథ చెప్పనా? గిరికథ చెప్పనా?' అని అడిగారట. ఓ కొంటెకోణంగి 'మాకు గిరికథ చెప్పండి' అన్నాడట. వెంటనే దాసుగారు గిరికథ- పార్వతీ కల్యాణం ప్రారంభించేసరికి అతడు తెల్లబోయేడట.



ఇంకో ఊరులో కూడా దాసుగారు అలాగే అడిగేసరికి 'మాకు హరికథా వద్దు, గిరికథా వద్దు, సరికథ చెప్పండి' అన్నాడట మరో కోణంగి. వెంటనే చిరునవ్వుతో గంగావతరణం ప్రారంభించేసరికి అందరూ ముగ్ధులైపోయారట. సరిత్తు అంటే నది కదా!

గదుల్లో బంధించడం, ఏ లోకంనుంచో వచ్చినవాళ్ళు వాళ్ళని శపించినట్టు వాళ్ళని ప్రత్యేకంగా, దూరం దూరం చూడటం యింట్లో వాళ్ళతో సహా నాకూ అలవాటై పోయింది.

అమ్మానాన్నల్తో సహా పెద్దక్క పనుల్లోకి వెళ్తోంది.

అమ్మాయిలు రజస్వల అయిన తర్వాత పౌష్టికాహారం ఎంతో అవసరం అనీ, ఆ ఎదిగే వయసులో చక్కటి ఆహారం తీసుకుంటే, ఆరోగ్యవంతంగా ఉంటారనీ తద్వారా ఆరోగ్యకరమైన సమాజం తయారవుతుందనీ, అలాగే ఆడపిల్లలు చదువుకుంటే కుటుంబానికీ, సమాజానికీ అది ఎంతో మంచిదనీ స్కూల్లో మా టీచరమ్మ చెప్తుండేది.

చదువులాగే తిండి కూడా చాలీచాలనిదే మా అక్కకి. అయినా దాని ఒంట్లో యవ్వనం అడుగుపెట్టడం మానలేదు.

వయసుకి బీదలూ, గొప్పవాళ్లు అనే భేదమేమీ లేదు. అది తన దారిన తను వస్తూ ఉంటుంది. దాన్ని కాపాడుకుంటే కాస్త ఎక్కువకాలం స్థిరంగా ఉంటుంది. లేదంటే చిన్న వయసులోనే వృద్ధాప్యాన్ని లాక్కొచ్చి పడేసి బోసినోటితో నవ్వుతుంది. అస్థిపంజరానికి నడక వచ్చినట్టుగా ఉండే మా అమ్మే దానికి ఉదాహరణ.

పొంగుకొస్తున్న యవ్వనాన్ని దాచడానికి తగిన దుస్తులు మా అక్కకి లేవు. అలాంటి బట్టలు కొనాలన్న స్పృహ మా అమ్మనాన్నలకి లేదు. అది చాలా ప్రమాదమనీ అదొచ్చిపడేదాకా మాకెవరికీ తెలీదు.

తనను ఆబగా చూసే కళ్ళు ఉంటాయన్న సంగతి అసలు... ఆ అమాయకురాలికి తెలీదు.

తెల్లనివన్నీ పాలు, నల్లనివన్నీ నీళ్ళు అనుకునే రకం.

ఆ రోజు చెంబుతో నీళ్లు తీసుకుని బహిర్భూమికి వెళ్లింది. అందరికన్నా కాస్త ఆలస్యంగా నిద్రలేచి ఆరుబయలుకి వెళ్లడం దానికి అలవాటు.

ఎవరి హడావిడిలో వాళ్లున్నాం.

ఎవరి పనులమీద వాళ్లం వెళ్లిపోయాం.

నేనేమో స్కూలుకి, నాన్నమో పనికి, అమ్మ మరో పనికి, యిద్దరక్కలూ మిరపకాయల కోతకి...

... నేను స్కూలు నించి తిరిగి వచ్చేసరికి ఇంటి చుట్టూ జనం. పెద్దపెద్దగా ఏడుపులు... లోపలికొచ్చి చూస్తే చుట్టచుట్టిన దుప్పటి మధ్య మా అక్క సూర్యకాంతం...

బహిర్భూమికని వెళ్లిన మా అక్కని ఎవరో నోరుమూసి, పక్కన తుప్పల్లోకి లాక్కెళ్లి బలాత్కారం చేశారు.

ఏడుస్తూ ఇంటికొచ్చిన అక్క నిట్రాడుకి తాడు కట్టుకుని ఉరి వేసుకుంది. ఆ క్షణం నాకు ప్రపంచం మొత్తం మాయమైపోయింది. చుట్టూ ఉన్న అంతమంది జనమూ... ఏడుస్తోన్న అమ్మతోసహా మాయమైపోయారు.

నేను... ఎదురుగా అక్క శవం...

ఎందుకో పుట్టి... నిత్యం ఏడుస్తూ బతికి... ఏ కోరికలూ లేకుండానే, ఉన్న చిన్నచిన్న కోరికలు సైతం తీరకుండానే.... ఎవడో చేసిన అన్యాయానికి బలయిపోయింది. అన్యాయం చేసిన వాడెవడో కూడా బయటపెట్టకుండా ఎక్కడికో కానరాని తీరాలకు వెళ్లిపోయింది.

బహుశా యిప్పుడు దాని ప్రపంచమంతా శాంతి... ప్రశాంతి. తిట్టే అమ్మ లేదు. ఎదిగిన కూతుర్ని సైతం నిత్యం కొట్టే తండ్రి లేడు. తను తినేదాన్లో కూడా లాక్కుని తినేసే చెల్లెళ్లు, తమ్ముడు లేరు. అర్థాకలి లేదు. అసలు ఆకలే ఉండదు. కొట్టు దగ్గరికెళ్లి జడుస్తూ... జడుస్తూ సరు

కులు తేనక్కరలేదు. విసుక్కుంటూ కాలకృత్యాల కోసం పొద్దున్నే లేవనక్కరలేదు. కడుపునొప్పి తెచ్చుకోనక్కరలేదు. పనికి వెళ్లనక్కరలేదు. చిరిగిన బట్టల్లోంచి శరీరాన్ని ఆబగా చూసే చూపుల్ని తప్పించుకోవాల్సిన పని లేదు. ఎవరితోనూ పంచుకోవాల్సిన వ్యథలేదు.

మాకే... అంతూదరీ లేని దుఃఖం.

ముఖ్యంగా నాకు.

నా ఏడుపుకు అంతు లేదు.

'ఏతమేసి తోడినా ఏరు ఎండదు

పొగిలి పొగిలి ఏడ్చినా పొంత నిండదు.'

★ ★ ★

మా అక్క పోయిన బాధ నుంచి నేను చాలాకాలం తేరుకోలేకపోయాను. అక్కలూ, మా అమ్మ కూడా అంతే.

మా నాన్నయితే ఆ బాధతో మరింత ఎక్కువ తాగడం మొదలుపెట్టాడు. అది పోయిన బాధ నుంచి బయటపడడానికి, దాని ఒంటిమీది బంగారం ఉపయోగపడటమే అసలు విషాదం.

దాని కోసం మొదలైన గొడవ ఎక్కడెక్కడికో తిరిగి ఎక్కడో ముగిసేది. కానీ గొడవ మాత్రం రోజూ జరిగేది.

బాధ మరచిపోవడానికి రోజూ తాగి రావడం, ఇంట్లో గొడవ జరగ్గానే మళ్లీ బాధతో తాగడానికి వెళ్లడం- ఇది మా నాన్నగారి వృత్తం.

కూతురు పోయిన బాధతో ఏడుస్తూ కూర్చోవడం, ఏమి పట్టనట్టు తాగి తూలుతోన్న భర్తని తిట్టడం, ఆ గొడవతో మళ్లీ ఏడుస్తూ కూర్చోవడం - ఇది మా అమ్మ వృత్తం.

ఆ వృత్తాల్లో తిరుగుతూ తిరుగుతూ యింకా ముగ్గురు పిల్లల బాగోగులు తామే చూడాలనీ, వాళ్లు కూడా దుఃఖంలోనే ఉన్నారనీ, వాళ్లని ఓదార్చాల్సింది తామేననీ మరచిపోయారు.

## కొత్తగాలి...

**ప్రమోదాల లోగిలి**
**మనస్సు!**
**ప్రమాదాల కూడలి**
**వయస్సు!!**

– అంబటి వెంకటశివారెడ్డి,
యర్రగుంట్ల

'ఆగక పొంగే కన్నీళ్లతోనే ఆకలి దప్పులు తీర్చుకుంటూ' ఆ దుఃఖంనించి బయటపడ్డాం మేము.

కానీ దాని జ్ఞాపకాలూ, ఏ అన్యాయానికి అది బలయిపోయిందో ఆ అన్యాయం చేసిన వాడెవడో తెలియకపోవడం... ఇవన్నీ ఎప్పుడు గుర్తొచ్చినా గుండెల్లో కలుక్కుమనేది.

కాలం మరపు మందు పూసిందో, బతకడానికి పని చేయడం తప్పనిసరి అని పనిలో పడిందో తెలియదుగానీ మా అమ్మ కూడా త్వరగానే మనుషుల్లో పడింది.

మా నాన్న సరేసరి. మందుతో మరచిపోదామని నిత్యం ప్రయత్నించేవాడు. మరి మరచిపోయాడో లేదో... అసలు తాగడం కోసమే, మరచిపోవాలన్న నిర్ణయం తీసుకున్నాడో ఆయనకే తెలియాలి.

ఏ విషయమూ అమ్మానాన్నలతో చర్చించే 'ధైర్యం' లేదు గనక వాళ్ల మనసుల్లో ఏముందో మా అక్కలెప్పుడూ బయటపెట్టలేదు.

నా సంగతి చెప్పనే అక్కరలేదు.

మానసికంగా మొత్తం నా కుటుంబానికీ, నాకూ చాలా దూరం.

★ ★ ★

స్కూలుకి వెళ్ళడం, లైబ్రరీకి వెళ్ళడం,

మధ్యమధ్య పుస్తకాలు యింటికి తెచ్చుకుని చదువుకోవడం, కనిపించిన ప్రతి కాగితం ముక్క చదివెయ్యడం, నవీన్ యింటికి వెళ్ళిరావడం, పాటలు వినడం, వాటిని మననం చేసుకోవడం... జీవితం యిలా సాగుతుండగా...

కీడు జరిగిన యింటిలో ఏదైనా శుభ కార్యం జరిగితే మంచిదని నలుగురూ పోరడం వల్లా, మా రెండో అక్క లక్ష్మీదుర్గ పెళ్ళీడుకి రావడం వల్లా దానికి సంబంధాలు చూడసాగారు.

సంబంధాలు చూడ్డం మొదలెట్టింది మా నాన్న కాదు. మా మావయ్య. యింకా మా యింటి చుట్టుపక్కల వాళ్ళు కొందరు.

చూడగా చూడగా కొత్తపేట దగ్గర ఒక సంబంధం కుదిరింది. అబ్బాయి వాళ్ళది మాలాంటి కుటుంబమే.

కాకపోతే మాకన్నా కాస్త 'కలిగిన' కుటుంబం.

ముప్పైవేల రూపాయల కట్నంతో, యితర లాంఛనాలతో ఆ పెళ్ళి కుదిరింది.

ఒక శుభ ముహూర్తాన నిశ్చితార్థం కూడా జరిగింది.

త్వరలోనే పెళ్ళికి ముహూర్తం పెట్టి శుభలేఖతో కట్నం డబ్బులు పంపిస్తామన్న మా పెద్దల మాటల్తో ఆ కార్యక్రమం ముగిసింది.

ఆ తతంగమంతా జరుగుతున్నప్పుడు నాలో ఎన్నో ఆలోచనలు. మా పెద్దక్క చనిపోయినప్పుడు, ప్రపంచం బద్దలయిపోవాలనీ, ప్రళయం వచ్చిపడాలనీ, ఆమె జ్ఞాపకాలతో యింటిల్లిపాదీ జీవచ్ఛవాల్లా బతకాలనీ... యిలాంటి ఆలోచనలు ఉండేవి నాలో.

మా యింట్లో ఎవరూ కనీసం నవ్వుతూ మాట్లాడకూడదని అనుకునే వాడిని. అలాంటిది ఒక శుభకార్యమే జరగడం నాకు షాక్. కానీ ఆ శుభకార్యంలో మా లక్ష్మీదుర్గ అక్కని చూస్తుంటే నాకు కలిగిన సంతోషం నా ఆలోచనల్ని మరోవైపు పరుగెత్తించింది.

రెండు వ్యతిరేక సంఘటనల మధ్య సంఘర్షణ వాటి మధ్యనుంచి ఉద్భవించే జీవనసారం కలగా మారతాయని అర్థమైంది. ఎక్కడో ఏదో ఫ్లాష్‌లాంటి ఆలోచన...

ఆ ఆలోచన వెంటాడగా వెంటాడగా ఆ రెండు సంఘటనలనీ వర్ణిస్తూ నేనో కథ రాసాను.

నా నోట్ బుక్‌లో నేను రాసిన కథంతా నా మనసులో పదేపదే సుడులు తిరిగిన కొన్ని వాక్యాలు చెప్పే ప్రయత్నం మాత్రమేనని రాస్తున్నప్పుడే నాకు తెలుసు.

ఆ వాక్యాలు యివి...

"కాలం కన్నా మంచి వైద్యుడు లేడు. కాలంకన్నా మంచి మిత్రుడు లేడు. కాలం కన్నా ఓదార్చేవాళ్ళు ఎవరూ లేరు. కాలం ఒక్కొక్క రోజునీ ఒక్కొక్క లేపనం పూసిన పొరలా గాయపడిన మనసు మీద పేరుస్తోంది. అందుకే ఎంత గొప్ప దుఃఖాన్నయినా మనిషి కాలం గడిచేకొద్దీ మరచిపోగలుగుతాడు...?

ఆ కథని, 'కలకానిదీ... విలువైనదీ... బ్రతుకు... కన్నీటి ధారలలోనే బలిచేయకు...' అన్న పాటతో ముగించాను.

'కల కానిదీ, విలువైనదీ' అని పేరు పెట్టాను.

అప్పటికే పత్రికల్లో కథలపోటీల నిబంధనలు అవీ చదివి చదివి కథలు ఎలా పంపాలో అని ఒక అవగాహన ఉంది నాకు.

రెండు రోజులు కష్టపడి ఆ కథని తెల్ల కాగితాల మీద వ్రాసి రిప్లై కవరుతో సహా కవర్లో పెట్టి పోస్టు చేశాను, ఆంధ్ర సచిత్ర వార పత్రికకి.

ఏడు రోజుల తర్వాత ఆ కథ తిరిగొచ్చింది.

ఎన్నెన్నో ఊహించుకున్న నేను ఆ కథ తిరిగి వచ్చేసరికి ఎంతో నిరాశపడిపోయాను, ఆ రోజంతా. ఆ తర్వాత మూడు రోజుల పాటు అదే దిగులు...

అదృష్టవశాత్తూ పత్రికకి కథ పంపిన విషయం ఎవరికీ చెప్పలేదు కనుక సరిపోయింది... లేకపోతే ఎన్ని వెక్కిరింపులు... వేళాకోళాలు...

ఇదంతా నేను తొమ్మిదో తరగతి చదువుతున్న రోజుల్లో జరిగింది. ఆ దెబ్బతో నేను చదవడానికే తప్ప రాయడానికి పనికిరానని నిశ్చయం చేసుకుని చాలా రోజులు రాసే జోలికి వెళ్ళలేదు నేను. కానీ చదవడం మాత్రం మానలేదు. రకరకాల ఆలోచనలతో సతమతమవడం మానలేదు.

నా జీవితంలో దేనికి లోటు ఉన్నా ఈ ఆలోచనలకి మాత్రం లోటు లేదు. ఎన్నెన్నో ఆలోచనలు... బుర్రనిండా... బుర్రని వేడెక్కిస్తూ... ఆలోచనలతో కడుపు నింపుకునే వీలుంటే నేనేనాడో స్థూలకాయుడ్ని అయిపోయేవాడిని.

కానీ దీనికి తల బరువు తప్ప కడుపు నిండే ఏర్పాటు చేయలేదు దేవుడు. ఆకలి మాత్రం బ్రహ్మాండమంత పెట్టి ఆహారం మాత్రం అణువంత పెట్టాడు.

అందుకే నాకు, నాలాంటి ఎందరికో అర్ధాకలి. పూర్తి ఆకలి. అలవాటైపోయిన ఆ ఆకల్తో సహవాసం చేస్తూనే హైస్కూలు చదువు ముగించాను నేను.

ఆ సంవత్సరమే మా అక్క పెళ్లి కూడా అయిపోయింది.

ఇప్పుడు మా ఇంటికొచ్చే బావ మాకు ముఖ్య అతిథి.

మేం తిన్నా తినకపోయినా ఆయనకి మాత్రం ఏ లోటూ రాకుండా సకల సౌకర్యాలు ఏర్పాటుచేయాలి.

ఏమంటే... అది ఆచారం కాబట్టి.

మా పాకలోనే ఒక మూలకి అలికిన తడికెలు అడ్డుగా పెట్టి గదిలాగా ఏర్పాటు చేశారు వాళ్ళకి.

కొత్త పెళ్ళికూతురి హోదాలో బావ సేవలో నిత్యం బిజీగా ఉండేది మా అక్క.

చిన్నక్క, నేనూ పనులు చేసేవాళ్ళం.

బావ లేనప్పుడు మా అక్క కూడా మామూలుగా మాతోపాటే ఆ పనీ ఈ పనీ చేసేది.

మొహంలో పెళ్లయిన కాస్త సంతోషం తప్ప... ఏ రకంగానూ కొత్త పెళ్ళికూతురిలా ఉండేది కాదు మా అక్క. పీలగా ఉండే దాని ఆకారానికి ఆ చీరలూ రవికెలూ ఏదో మనిషి ఆకారపు గెడలమీద ఆరవేసినట్టుగా ఉండేవి.

అయితే దానికా దుఃఖం లేదు. ఎందుకంటే పెళ్లికూతురంటే ఎంత నిండుగా, అందంగా ఉంటుందో, ఉండొచ్చో దానికి తెలియదు. అంత చిన్న ప్రపంచంలో పుట్టి పెరిగిందది.

అక్క ఇంకా మా ఇంట్లో ఉండగానే నా టెన్త్‌క్లాస్ రిజల్ట్సు వచ్చాయి. ఫస్ట్ క్లాసులో పాసయ్యాను నేను. నవీన్ కూడా ఫస్ట్‌క్లాస్ లోనే పాసయ్యాడు. ఆ సంతోషం కాస్తా 'ఇక చదివింది చాలు. రేపట్నించి పనిలోకి పో' అని మా నాన్న అన్నప్పుడు ఆవిరైపోయింది.

ఇంక నా చదువుకోసం ఒక్కరూపాయి కూడా ఖర్చుపెట్టే ప్రసక్తి లేదన్నాడు మా నాన్న.

'నేను వెళ్ళను బాబోయ్' అంటున్నా ట్యూషన్లు పెట్టించి మరీ నవీన్‌ని చదివిస్తోన్న వాడి తల్లిదండ్రులు గుర్తొచ్చారు.

జీవితంలో మొట్టమొదటిసారి మా నాన్నని కాళ్ళావేళ్ళాపడి బతిమాలాను. 'ఇంకా చదువుకుంటాను నాన్నా. మంచి

మార్కులు తెచ్చుకుని, పెద్ద ఉద్యోగం చేస్తాన్నాన్నా... నిన్ను, అమ్మనీ, అందర్నీ బాగా చూసుకొంటాను నాన్నా' అంటూ.

అవేవీ మా నాన్న తలకి ఎక్కలేదు.

'నువ్వుద్యోగం సంపాదించి నన్నుద్ధరించడం తర్వాత... ముందు నీయక్క పెళ్లి కోసం చేసిన అప్పు తీర్చకపోతే ఆ రైతు నా పీక పుచ్చుకుంటాడు' అని కొత్త పాట ప్రారంభించాడు.

ఆ మరుసటిరోజు నుంచే ఆ రైతు ఇంట్లో పాలేరుగా నా జీవితం మొదలయింది.

పొద్దున్నే లేచి అక్కడికి వెళ్ళడం, టిఫినూ, టీ అక్కడే తాగి గేదెల్ని, గేదెల పాకల్ని శుభ్రం చేయడం, పాలు పితకడం... మధ్యాహ్నందాకా గేదెల్ని పొలం గట్ల వెంట తిప్పి మేత మేశాక కడిగి, ఇంట్లోని పాకలో కట్టేయడం... తర్వాత భోజనం చేశాక సాయంత్రందాకా తీరిక... సాయంత్రం కాస్త పచ్చగడ్డి కోసి ఆ పాకలో పడేసి పాలు పితికి వాళ్లింట్లో అప్పగించి, ఇంటావిడ చెప్పినచోట పాలిచ్చేసి వచ్చాక భోజనం చేసి ఇంటికి చేరుకోవడం... ఇదీ పని.

మూడు పూట్లా తిండి పెడతారు. పని చేయించుకుంటారు. మిగతా పాలేర్లకి ఇచ్చే నెలజీతాలు బాకీలో జమ చేసుకుంటారు. పండగలూ, పబ్బాలకి బట్టలూ, గిట్టలూ లాంటివి మామూలే.

అసలాయింటికి వెళ్ళడమే సగం చచ్చిపోయి వెళ్ళాన్నేను. నా కలలు వేరు... నా లోకం వేరు... నా ప్రపంచమంతా వేరే... అక్కడ ఇలాంటి మనుషులుండరు... అప్పులుండవు... పనులుండవు... అలాంటి కలల్లో తేలుతూ బతికే నన్ను వాస్తవం మొట్టికాయలేసి మరీ నా జీవితం అసలు రంగు ఏమిటో చూపించింది.

దాన్ని జీర్ణించుకోలేకపోయాన్నేను.

పైగా నాకు వేరే ఆప్షన్ లేదు. మా

**కొత్తగాలి...**

**దేవుడి కంటే**
**అమ్మే గొప్పది**
**కృష్ణుడు కూడా**
**యశోద కొడుకేగా!**

- పాయసం సుబ్రహ్మణ్య మహర్షి,
నెల్లూరు

నాన్న చెప్పిన పని చెప్పినట్టు చేయడమే. అందులోనూ అక్క పెళ్లికోసం చేసిన అప్పు...

చాలామంది అనుకుంటారు... వాళ్ళు కాబట్టి అలాంటి పనులు చేశారు. అదే నేనయితే చావనయినా చస్తానుగానీ అలాంటి పని మాత్రం నేను ఎన్నటికీ చెయ్యలేను అంటూ...

కానీ వాస్తవ జీవితం ఎంత కఠోరంగా ఉన్నా త్వరలోనే అలవాటైపోతుంది. చచ్చిపోవడంకన్నా హీనాతిహీనంగా అయినా సరే బతకడానికే ఎక్కువ ప్రయత్నం చేస్తాడు మనిషి.

ఎంత హీనంగా అయినా సరే.

ఆలోచించేకొద్దీ నా ఆలోచనల్లోనే లోపం ఉందేమో అనిపించింది నాకు. లోకంలో ఎంతమంది హాయిగా జీవిస్తున్నారు. కానీ ఇంతకన్నా మంచి జీవితం ఉంటుందన్న 'జ్ఞానం' నాకు ఉండటం వల్లనే జీవితం నాకింత రోతగా అనిపిస్తోందనీ, అది గనుక లేకపోతే చాలామందిలాగానే నేనూ హాయిగా పని చేసుకుంటూ బతికేసే వాడినికదా అనిపించింది.

తన ఆలోచనలను బట్టేకదా మనిషి...

అందుకే పరిస్థితులతో రాజీపడి ఆ పనిని చేయసాగాను.

గేదెల్ని తోలుకుని పొలాల వెంట పడగానే నా లోకం మొత్తం మారిపోయేది.

ఎటు చూసినా పచ్చగా, విశాలంగా కని పించే పొలాలు... కనుచూపు మేరంతా పచ్చదనమే... పక్కన కాలువ... కాలవ ఒడ్డున, తోటల్లోనూ పసిరిక...

గేదెలు చేలోకి దిగకుండా కావలికాస్తూ ఊహాలోకాల్లో విహరిస్తూ ఉండేవాడిని నేను. చదివిన కథల్ని, పుస్తకాల్నీ పదేపదే గుర్తుకు తెచ్చుకునే వాడిని.

ఎప్పుడూ నాలోపల్లోపల సుడులు తిరిగే పాటల్ని పదేపదే గుర్తు తెచ్చుకుని పాడు కుంటూ ఉండేవాడిని. ఆ ట్యూన్స్‌లోనే వేరే పదాలు కూర్చుతూ పాడే ప్రయత్నం చేసేవాడిని.

రోజులలా గడిచిపోతుండగా కాలేజీలు తెరుస్తారనగా నన్ను వెతుక్కుంటూ నవీన్ వచ్చాడు.

ఇంటర్‌లో చేరడానికి అప్లికేషన్ తెచ్చాడు.

మళ్ళీ దుఃఖం చుట్టుముట్టింది నన్ను.

ఏడుస్తూ నా పరిస్థితి వివరించాను వాడికి.

అంతా విని సానుభూతి కురిపించి మళ్ళీ కలుస్తానని వెళ్ళిపోయాడు వాడు.

అన్నట్టుగానే అప్పుడప్పుడు వచ్చి కని పించి పోతుండేవాడు వాడు. వాడి నోటి వెంట కాలేజి కబుర్లు విని పరవశించిపో యేవాడిని నేను.

'ఎందుకురా బాబూ వెధవ కాలేజీ... హాయిగా నీపనే నయం. బోల్డంత ఫ్రీడం. నీకు నచ్చినట్టు నువ్వుండవచ్చు..' అనే వాడు.

వాడి మాటలు విని విరక్తిగా నవ్వుకునే వాడిని నేను.

ఒకరిని చూస్తే ఒకరికి అలా అనిపిస్తూ ఉంటుందేమో...

నేను స్వేచ్ఛగా ఉన్నానని అనుకుంటు న్నాడు వాడు. ఆ స్వేచ్ఛని ఒకటే చూస్తు న్నాడు. దాని వెనుక ఉన్న యాతనని గమనించలేకపోతున్నాడు.

హాయిగా ప్యాంటూ షర్టూ వేసుకుని జాలీగా కాలేజీకి వెళ్ళి వస్తూ ఉన్నా, వాడికి కష్టంగా ఉంది.

నిజమైన కష్టం ఏమిటో తెలిస్తే అప్పుడు గానీ జీవితంలో ఉన్న సుఖం ఏమిటో వాడికి తెలియదు...

ఇలాంటి ఆలోచనల నుంచి, నేను కాలే జీకి వెళ్తే ఎలా ఉండేదా అనే ఆలోచనల ద్వారా బయటపడేవాడిని నేను.

కాళ్ళింత పొడవుగా ఎదిగి, నూనూగు మీసాలు వస్తోన్నా, మా క్లాసులో లంగా వోణీలు వేసుకుని వచ్చే అమ్మాయిలు ఉన్నా నేను మాత్రం స్కూలుకి నిక్కర్లే వేసుకుని వెళ్ళేవాడిని.

మా క్లాసు మొత్తం మీద హాస్టల్లో ఉంటూ చదువుకునే మరో ముగ్గురు విద్యా ర్థులూ, నేనూ తప్ప మిగతా అంతా నవీన్‌తోసహా పదో తరగతిలో ప్యాంటులే వేసుకొచ్చేవారు.

ఎద్దులా ఎదిగి కూడా నిక్కర్లు వేసుకు వచ్చే మమ్మల్ని అందరూ పేర్లు పెట్టి వెక్కిరించేవారు.

అవన్నీ భరించడం, మరీ రోషమొస్తే ఎదురు తిట్టడం తప్ప మరో దారి ఉండేది కాదు నాకు. ఎందుకంటే ఏడ్చి గీపెట్టినా మా ఇంట్లో పేంట్లు మాత్రం కొనరు గాక కొనరు.

నవీన్ వాళ్లమ్మగారు సైతం వాళ్ళింటికి వెళ్ళినప్పుడు "ఏంటమ్మా! ఇంకా నిక్కర్లు వేసుకుని తిరుగుతున్నావు... పోనీ, మీ నాన్నగారి ప్యాంట్లు ఏమైనా ఉంటే సైజు చేయించుకుని కుట్టించుకోకపోయావా... నవీన్‌వి పాతవి ఏమైనా ఉంటే నేనే ఇద్దును. కానీ వాడు ఈమధ్యనే కదా వేసు కుంటున్నాడు" అనేసేది.

ఏమనాలో తెలీక లోపల్లోపల్లికి కుంచిం చుకుపోయేవాడ్ని నేను.

అలాంటి నేను కాలేజీకంటూ వెళ్తే మా నాన్న ప్యాంట్లు కుట్టించేవాడా? ఊహూ! కుట్టించడు. మరి ఎలా వెళ్ళుండేవాడిని? కాలేజీకి... నిక్కరుతోనేనా...

అలా నేను నిక్కరు మీద కాలేజికి వెళ్తున్నట్టు, కాలేజీ ప్రిన్సిపాల్ 'పనుంది నాకూడా రా' అని తీసుకెళ్ళి కాలేజీ బిల్డింగు ఎక్కించి అక్కణ్నించి కిందికి తోసేసినట్టు ఆలోచిస్తూ నాలో నేను నవ్వుకునేవాడిని.

ఏ గేదో చేలో పడితే ఆలోచనల నుంచి బయటపడి, దాన్ని గట్టుమీదకి తోలి, ఈ లోకంలో పడుతుండేవాడిని.

★ ★ ★

నాకు టెన్త్ పూర్తయి అప్పుడే సంవత్సరం కావస్తోంది.

పనీ పాటలతో రోజూ హాయిగానే గడచిపోతోంది.

లేనిదాని కోసం బాధపడుతూ వర్తమానాన్ని బాధామయం చేసుకోవడంకన్నా అందిన దానితోనే తృప్తిని వెతుక్కుని సంతోషపడడం మంచిదని అర్థమైంది నాకు. భవిష్యత్తు ఎలా ఉంటుందా అని భయపడకుండా అందమైన కలలుకంటూ ఉన్నతంగా ఊహించుకుంటూ ఉంటే మధురంగా ఉంటుందని కూడా అర్థమైంది.

అందుకే నేనున్న స్థితి ఎలా ఉన్నా, హాయిగా కలల్లో తేలిపోతూ, పాటలు పాడుకుంటూ గడిపేయడం అలవాటు చేసుకున్నాను.

ముఖ్యంగా తిండికి ఏ లోటూ లేకపోవడం నాకు చాలా సంతోషాన్ని కలుగచేసింది. తిరిగి తిరిగి ఆకలితో వస్తే కడుపు చూసి అన్నం పెడుతుంది మా యజమాని భార్య అన్నపూర్ణమ్మ... మహా తల్లి...

పైగా రాత్రి నిద్రపోవడానికి తప్పితే యింటి దగ్గరుండవలసిన పనిలేకపోవడం

## కొత్తగాలి...

**నరికే కొద్దీ**
**చిగురించే వృక్షం**
**ఆత్మస్థైర్యానికి**
**ఓ టానిక్**

**– సూర్య షంషుద్దీన్,**
నెల్లూరు

కూడా నా ఆనందానికి ముఖ్యకారణం.

ఎప్పుడైతే పాత జీవితానికీ, కొత్త జీవితానికీ తేడా తెలిసిందో అప్పుడే రోతపుట్టడం మానేసింది.

ఎవ్వరూ లేని ఏకాంతంలో పొలాల మధ్య గేదెల్ని కాపలా కాస్తూ, చేతికందిన పళ్లు, కాయలూ తింటూ, పాటలు పాడుకుంటూ, గేదెల్ని కడిగేటప్పుడు కాలువలో ఈతలు కొడుతూ ప్రకృతిలో ప్రకృతినై మసలేవాడిని. ఆకాశంలో హాయిగా ఎగిరే పిట్టకీ, చులాగ్గా తిరిగే మేఘానికీ, నాకూ తేడా కనిపించేది కాదు.

"నీలి మేఘాలలో... గాలికెరటాలలో...
నీవు పాడే పాట వినిపింతునీవేళ..."
అనో,

"ఆకులో ఆకునై పూవులో పూవునై
కొమ్మలో కొమ్మనై, నునులేత రెమ్మనై"
అనో పాడుకుంటూ ఉండేవాడిని.

అయితే నా జీవితంలో 'హాయి' ఎక్కువ కాలం నిలవదు. ఏదోరూపంగా వేదన ప్రవేశించి తిష్టవేసుకుని కూర్చుంటుంది.

ఒకరోజు సాయంత్రానికి నేను ఇంటికి వెళ్ళేసరికి యింట్లో మా అక్క ఉంది. మామూలుగా బావతో సహా వచ్చిందేమో అనుకున్నాను.

తర్వాత తెలిసింది.

ఆమె రాలేదు... బావ పంపేశాడు.

మొదటి కాన్పులో ఆడపిల్ల పుట్టింది

## కొత్తగాలి...

**కలలు కను**
**తప్పులేదు**
**కానీ, నిజం చేసుకోవడానికి**
**మేలుకోవడం మరువకు**

— ఎన్.కె.నాగేశ్వరరావు,
పెనుగొండ

గనుక అదనపు కట్నం తెమ్మని, లేదంటే యింక రానక్కరలేదనీ, ఆమె అత్తగారూ, బావ చెప్పి పంపేశారు.

ఎంత దారుణం ఆడపిల్ల జీవితం!

ఊహ తెలిసేదాకా కన్నవాళ్ళు పెంచుతారు.

ఊహ తెలిసీతెలియని సమయంలో 'మా గుండెలమీద భారం తల్లీ' అంటూ పెళ్ళిచేసి పంపేస్తారు.

అంతా సవ్యంగా ఉంటే అత్తింటివాళ్ళు నెత్తిన పెట్టుకుని చూసుకుంటారు.

ఆడపిల్లలు పుట్టినా, అసలు పిల్లలు పుట్టకపోయినా, వాళ్ళకి ఏ కారణం చేతనో ఆగ్రహమొచ్చినా యింటికి తోలేస్తారు.

లేదంటే పుట్టింటివాళ్ళు తీర్చలేని కోరికలు కోరి పంపేస్తారు. వాళ్ళు చచ్చో చెడో ఆ గొంతెమ్మ కోరికలు తీరిస్తే సరేసరి. లేదంటే ఆ అమ్మాయి శాశ్వతంగా పుట్టింట్లోనే ఉండిపోతుంది.

ఎటుచూసినా లాభమే.

కేవలం ఒకే ఒక్క మగపిల్లాడ్ని కలిగి ఉండటం అనే అర్హతవలన వాళ్ళ కత్తికి రెండువైపులా పదునే.

ఎటుతిరిగి ఎటు వచ్చినా తెగేది ఆడపిల్ల కలవారి మెడే. అన్నింటికన్నా విచిత్రం ఏమిటంటే- బానిసలకన్నా హీనంగా, ఘోరంగా, ఆడపిల్లల్ని కన్నవాళ్ళు అన్ని అవమానాలకీ, దోపిడీలకి తలొగ్గేయడం. కాస్త కూడా ఎదురుతిరగకపోవడం.

ఇంకా దారుణం ఏమిటంటే, పుట్టింటి నుంచి తిరిగొచ్చిన ఆడపిల్లకి కాస్త సానుభూతి అందించకపోగా ఎదురుతిట్టడం, సూటిపోటి మాటలతో పదేపదే దెప్పిపొడవడం...

ఆడపిల్లంటే కట్నాలూ కానుకలూ ఉంటాయనీ, మొదటికానుపు జరిగి బిడ్డతో సహా అత్తవారింటికి వెళ్ళేవరకూ అడుగడుగునా ఖర్చేనని, ఖర్మకాలి అత్తింటివారు మంచివారు కాకపోతే వాళ్ళ గొంతెమ్మ కోరికలకి అంతు ఉండదనీ తెలిసినా... నారు పోసినవాడే నీరు పోస్తాడనే మెట్ట వేదాంతంతో ఆడపిల్లల్ని కనెయ్యడం, తాము బాధపడడం, ఆ ఆడపిల్లల్ని బాధపెట్టడం... ఎంత అజ్ఞానం. అలాంటి తల్లిదండ్రులది... ఎంత అవివేకం... ఎంత మూర్ఖత్వం...

ఏదయితేనేం తొలిచూరు ఆడపిల్లతో, పుట్టెడు శోకంతో, బెంగతో పుట్టింటికి వచ్చి చేరింది మా అక్క.

తాగి తందనాలాడే తండ్రి తిరిగి తనని పుట్టింటినుంచి అత్తింటికి పంపిస్తాడా, పంపించడా అని దాని బెంగ. పుట్టింటి స్థితి తెలిసినది కావడంవలన ఆ డబ్బు ఎక్కడినుంచి తెస్తారా అన్న దిగులు దానిది.

మరింత కట్నంకోసం మా బావ దాన్ని పుట్టింటికి తరిమేశాడని తెలిసిన క్షణం నిజంగా వణికిపోయాను నేను.

దాని పెళ్ళికి చేసిన అప్పే ఇంకా తీరలేదు.

మళ్ళీ ఇప్పుడు దాన్ని అత్తవారింటికి పంపించడానికి డబ్బు కావాలంటే మళ్ళీ అప్పు చేయాలి.

అది తీరాలంటే నేను జీవితాంతం ఈ పాలేరు పనే చేయాలి.

అలా అని దాని చావు అది చస్తుందిలే

అని వదిలేసేటంతటి దుర్మార్గుణ్ణికాదు నేను.

ఎవరైనా మధ్యవర్తిత్వం వహించి, మా బావ వాళ్ళకి నచ్చచెబితే వింటారేమోనని నాకో ఆశ... కానీ వాళ్ళకి చెప్పి ఒప్పించే వాళ్ళు నా ఎరుకలో ఎవరూ లేరు.

నాకు అలాంటి విషయాలు మాట్లాడ్డం ఎలానో తెలియదు. నాదంతా ఊహా లోకం. వాస్తవంలోకి వచ్చేసరికి ఎన్నో విషయాల్లో ఎలా ప్రవర్తించాలో, ఏమి మాట్లాడాలో నాకు తెలియదన్న సంగతి చాలాసార్లు అనుభవంలోకి వచ్చింది.

చిన్నచిన్న విషయాల్లో సైతం కంగారు కంగారైపోయి, బొత్తిగా లోకజ్ఞానం లేని వాడ్ని అని ఎన్నోసార్లు అనిపించుకున్నవాడిని నేను.

అసలు మా అక్క ఇక్కడికి రాలేదన్నంతగా నటించేస్తూ ఎవరిపనుల మీద వాళ్ళం తిరుగుతున్నాం మేం.

ఒకరోజు పొలంనుంచి మా యజమాని ఇంటికి చేరేసరికి మా యజమానురాలు ఒక దుర్వార్త చెప్పింది.

వాళ్ల దగ్గర పొలంమీద పనిచేసే మల్లయ్య కూతురుని కట్నంకోసం అల్లుడు ఇంటికి పంపేశాడట. తిరిగి ఆమెని పంపించే ఓపికలేని మల్లయ్య మామూలుగా ఉండిపోయాడట.

ఇటు తండ్రి పరిస్థితినీ, అటు అత్తవారి కరకుతనాన్నీ చూసి... ఇక తండ్రి తనని అత్తారింటికి పంపించలేడనీ, డబ్బు తేక పోతే భర్త తనని కాపురానికి తీసుకెళ్ళడనీ... తనకీ తనే ఒక నిర్ణయానికొచ్చేసి బావిలో దూకి ఆత్మహత్య చేసుకుందట.

చనిపోయిన మల్లయ్య కూతురి మీద బోల్డంత జాలి చూపిస్తూ చెప్పిందావిడ ఆ విషయాలన్నీ.

నా మనసు కూడా బాధతో నిండిపోయిందా విషయం వినగానే. ఆ ఆలోచనలతోనే ఇంటికి చేరాను.

## కొత్తగాలి...

**సర్కారు కార్లలో**
**ప్రైవేటు షికార్లు**
**సొంత కార్లు**
**వాడరు సార్లు**

– పినిశెట్టి లక్ష్మీశారద,
రాజమండ్రి

చంటిపిల్లకి పాలుపడుతూ కనిపించింది మా అక్క.

పొయ్యిదగ్గర కూర్చున్న మా అమ్మ ఓ చేయి చెంపకి ఆన్చుకుని ఏదో ఆలోచిస్తోంది.

నన్ను చూసి ఆలోచనల్లోంచి బయటకొచ్చింది.

"సుబ్బలచ్చిమి ఏం జేసిందో విన్నావా? " అంది.

"ఊఁ!" అన్నాను, అమ్మ ఏం చెప్పబోతుందో అర్థమై.

"నాకు గుండెలు దడదడలాడిపోయాయనుకో... ఇంటికొచ్చి దుర్గని సూసేదాకా గుండెదడ తగ్గలేదు. ఎదోలాగ డబ్బుసూసి దాన్ని తొందరగా పంపెయ్యాలి" అంది అమ్మ.

అక్క వినకూడదని రహస్యంగా, గుసగుసగా చెబుతోంది.

"ఎలాగే మరి? " అన్నాను. ఎలాగో అర్థంకాని నా అయోమయం ఆ ప్రశ్న రూపంలో బయటకి వచ్చింది.

"మీ అయ్యకి ఎలాగా ఏమీ పట్టదు. నువ్వు మీ కామందుతో మాట్టాడు. మా అమ్మ అడగమందని చెప్పు... ఆ డబ్బేదో తెచ్చి వాళ్ల ఎదాన తగలేత్తే ఆనక మనం మనం సూసుకోవచ్చు"

"అలాగేనమ్మా" అన్నాను మా యజమానిని డబ్బులు ఎలా అడగాలా అని మన

సులో ఆలోచిస్తూ...

"రేపు అడుగుతాను..." అన్నాను మళ్లీ.

"రేపు కాదు బాబూ... ఇప్పుడే వెళ్లు... ఏదో ఒకటి తేలిందాకా నా మనసు మన సులో ఉండదు... నా పెద్దకూతురి బతుకు అర్థాంతరంగా అలా అయిపో యింది... సూత్తాసూత్తా దీన్ని కూడా బలి వ్వలేను బాబో బలివ్వలేను" అంది అమ్మ కన్నీళ్ళు పెట్టుకొంటూ.

ఏడవడానికి కూడా ఒంట్లో ఓపికలేని మనిషిలా ఉంది అమ్మ. మూర్తీభవించిన శోకదేవతలా ఉంది.

వెంటనే వెళ్ళి మాట్లాడి వస్తే ఆమెకి కాస్త భారమైనా తగ్గుతుందని యజమాని ఇంటికి వెళ్ళాను.

అప్పుడే భోజనం ముగించాడు కాబోలు బయటకొచ్చి చెయ్యి కడుక్కుంటున్నాడు ఆయన.

నన్ను చూడగానే "ఏంటీ టైములో వచ్చావ్? " ఆశ్చర్యంగా అడిగాడాయన.

"రా. ఇలా అరుగుమీద కూర్చో" అన్నాడు.

కూర్చున్నాను.

ఎలా చెప్పాలో అర్థం కావడంలేదు నాకు. ఏవేవో మాటలు లోపల్లోపలే సుడులు తిరుగుతున్నాయి. బయటకి మాత్రం రావడంలేదు.

"ఏంటయ్యా... ఏమీ మాట్లాడవు... ఏంటి సంగతి? ..." అన్నాడాయన మళ్ళీ.

"అదీ... అదీ... మా అక్కని మా బావ కట్నం డబ్బులు తెమ్మని యింటికి పంపే శాడు. మీకు తెలిసే ఉంటుంది. ఇవాళ మల్లమ్మ కూతురు ఆత్మహత్య చేసుకుంది కదా... అది విని మా అమ్మ బాగా బెంగ పెట్టేసుకుంది. మా అక్కని పంపడానికి అర్జంటుగా డబ్బు కావాలి. ఎలాగా మీకు బాకీ ఉన్నాంగదా... యింకొంచెం డబ్బు



సర్దితే నెమ్మదిమీద తీర్చేస్తామని చెప్ప మంది మా అమ్మ..." చెప్పాను నేను.

ఒక్క క్షణం నా వంక నిశితంగా చూసి "చూడు బాబూ... నీకు తెలియదేమో... మీ నాన్న నా దగ్గర పట్టుకెళ్ళిన డబ్బుకి నువ్వు జీవితాంతం నా దగ్గర పనిచేసినా చెల్లుబాకీ కాదు. నువ్వు మళ్ళీ డబ్బంటు న్నావు..." అన్నాడు.

ఆ మాటలు వినగానే హతాశుడ్న



య్యాను నేను. ఏం అనాలో తోచక 'మా అమ్మతో చెప్తానులెండి' అంటూ లేచాను.

"నిజానికి నీకు ముప్పూటలా తిండి పెడుతూ చేయించుకునే పనికి ఎంత జీతం జమేసినా నా డబ్బు నాకు ముట్టదు. ఏదో... ఏనాటినుంచో మీ వాళ్ళు నా దగ్గర పన్చేస్తున్నారుకదాని బల వంతం పెట్టడం లేదు. ఇంకెవరైనా అయ్యుంటే పీకలమీద కూర్చుని వసూలు చేసేవాడ్ని బాకీ. చెప్పు మీ అమ్మకి" అన్నా డాయన.

తలూపి బయటకి వచ్చేశాను.

ఇంటికెళ్ళి విషయం చెప్పగానే కుదేలయి పోయింది మా అమ్మ. ఏడుస్తూ కూర్చుంది.

పొయ్యి మీద ఏమీ లేకపోవడం వలన

ఉత్తిమంట నాల్కలు చాస్తూ పైపైకి ఎగుస్తోంది.

'రానీ ఎదవని... రోజూ తాగి తందనా లాడటం తప్ప ఏదీ పనేంలేదు. ఆడికెంతి త్తన్నారో ఏటో కూడా తెల్దు. పన్లోంచి యింటిక్కూడా రాడు. డైరట్టుగా సారా అంగడికాడికే పోతాడు. ఒక్క బాధ్యత ప ట్టదు ఎదవకి' ఏడుస్తూ నాన్నని తిడు తోంది అమ్మ.

మరో గంట తర్వాత యింటికి వచ్చాడు నాన్న.

వాతావరణంలో తేడాని పసిగట్టేసినట్టు న్నాడు... పిల్లిలా అయిపోయి లోపలికొ చ్చాడు.

"సుబ్బారాయుడి గారి దగ్గర ఎంత డబ్బు తెచ్చావ్? " కళ్ళల్లో నిప్పులు కురి పిస్తూ అడిగింది మా అమ్మ.

అక్కడితో విషయం అర్థమైపోయిన ట్టుంది మా నాన్నకి. ముందే ఎదురుదా డికి దిగాడు.

"ఏంటీ... నేనేదో దొంగతనం సేసినట్టు అడుగుతున్నావ్? ... అవును తెచ్చాను... నేనేం నా సొంత కర్చులకి తెచ్చుకు న్నానా? ... ఆడపిల్లల కార్యాలకీ, పెద్దదాని కర్మకాండలకీ, చిన్నదాని పెళ్ళికీ... ఆటికే కదా తెచ్చాను..."

"ఎంత తెచ్చావ్ ఆటికి... ఆ వంకా ఈ వంకా పెట్టి ఎక్కువ డబ్బు తెచ్చావ్.. సుబ్బరంగా తాగి తందనాలాడావ్.. అయ్యి యియ్యా కలిపేసి నా కొడుకుని జీవితాంతం పాలేరుని సేసావ్" అరిచింది అమ్మ.

"ఆc... నీకేం ఎన్నయినా అనేత్తావ్. సర్దుకొనొచ్చేవాడికి తెలుత్తాది నెప్పి... ఆట న్నిటికీ సొమ్ము ఎవరిచ్చారు. మీ బాబి చ్చాడా? "

"ఆ... మా బాబుకేం పని? ... కన్నం దుకు సుబ్బరంగా పెంచాడు, పెద్దసే సాడు... లచ్చనంగా పెళ్ళిసేసాడు... సీరా సారే పెట్టాడు... నీకు లాగా బాధ్యత పట్టక ఏనాడూ తిరగలేదు... నన్ను పోసించింది చాలక యిప్పుడు నా బిడ్డల్ని కూడా పోసించాలా... నువ్వెంత శాతకాని ఎదవ్వని తెల్వదు మా నాన్నకి.. లేదంటే పోసించేవాడే... నువ్వు ఆయిగా తాగి రోడ్లమ్మట దొర్లుదువు"

"ఏంటే వాగుతున్నావ్... లం... అక్క డికి నీ బాబేదో మైసూరు మారాజన్నట్టు సెప్తావ్... నీ బాబు తాగడా... నీ అన్న తాగడా... పపంచం మొత్తం మీద నేనే తాగుతున్నట్టు సెప్తావ్? ... నేను పోసించకపోతే నీ రంకు మొగుడు పోసించాడా ఇంటిని..."

"ఛీ... ఛీ... ఎదవ బతుకు... నీకన్నా కుక్కలు నయంగాదూ... ఏనాడైనా ఇంట్లోకి ఒక్కుల్లిపాయ తెచ్చెరుగుదువా... యింకా సెప్తున్నాడు కవుర్లు... సంపాద నంతా ఆ సారాకొట్టుకి తగలేసింది చాలక ఇంకా అప్పుచేసి మరీ తాగేశావు... పిల్ల లకి ఒకందం లేదు... సందం లేదు... ఉన్న నలుగుర్లో ఒకదాన్ని ఆ దేవుడే తీసు కుపోయాడు. ఈళ్ళకి సేయడానికి బలుపు నీకు..." అంటూ శోకాలు పెట్టింది అమ్మ.

అదంతా వింటూ తను కూడా వెక్కి వెక్కి ఏడవసాగింది మా అక్క. నాకూ కళ్ళవెంట నీళ్ళొచ్చేసాయి.

మా నాన్న మాత్రం షరా మామూలే. బయటికెళ్ళిపోయాడు. ఏ అర్ధరాత్రో తిరిగి వస్తాడు. లేదంటే ఎక్కడో స్పృహతప్పి పడిపోయి రోడ్లమీద దొర్లుతాడు. అన్నన్ని మాటలంది మా అమ్మ..

నాన్న వెళ్ళిపోయాక కూడా ఏడుస్తూ కూర్చుంది.

ఆ రాత్రికి ఎవ్వరం ఎంగిలి పడలేదు.

జీవితాంతం తీర్చవలసిన బాకీ నా నెత్తిన పడేశాడన్న కోపం... బెంగ... నిస్స

# కన్యల్ని కోరుకునే కీటకాలు

గాలిలో ఎగిరే పురుగులు, నీళ్ళలో నివసించే చేపలు, నేలమీద తిరుగాడే జంతువులు జతకట్టడం ప్రకృతి సిద్ధంగా అనాదిగా వస్తోంది. అవి జతకట్టే విధానాలని పరిశీలించిన పాశ్చాత్య శాస్త్రజ్ఞులు ఆశ్చర్యకరమైన విషయాలు కనుగొన్నారు.

ఆఫ్రికాలోని ఓ రకం కీటకం అంతదాకా మరో మగ కీటకంతో జతకట్టని ఆడ కీటకాన్నే వెదుకుతుంది. మైలు దూరంలో ఉన్నా సరే, కళ్లు కనబడని చీకటిలో కూడా దాని దగ్గరకి ఎగిరి వెళ్తుందట. ఆ ఆడ కీటకం నుంచి వెదజల్లబడే ఓ రకం వాసనని బట్టి అది కన్య అని గ్రహించి, ఆ వాసన వెంట వెళ్ళి, దాంతో జతకడుతుంది.

మిణుగురు పురుగులు కొన్ని వందలు కలసి ఒకేచోట జీవిస్తుంటాయి. మగపురుగు ఓ ప్రత్యేకమైన రీతిలో రెక్కలార్పి కాంతి వెదజల్లుతుంది. అది గమనించిన ఆడపురుగు సరిగ్గా రెండు క్షణాల వ్యవధి తర్వాత అదేవిధంగా రెక్కలు కదిపి కాంతిని ప్రసారం చేస్తుంది. దాన్ని గమనించి మగపురుగు తిరిగి అదేవిధంగా కాంతి సందేశం పంపుతుంది-సరిగ్గా రెండు క్షణాల తర్వాత. ఈ విధంగా రెండు క్షణాల వ్యవధిలో మగ, ఆడ ఒకో రకం కాంతి సందేశం పంపుతూ దగ్గరకి చేరుకుంటాయి. ఆ రెంటిలో ఏదైనా కాంతి సందేశం రెండు క్షణాలలో పంపక ఆలస్యం చేస్తే రెండోది ఇక మొదటిదాన్ని పట్టించుకోదు.



పాముల్లోనూ సహజంగా ప్రకృతి పరంగా ఒక గమ్మత్తైన ప్రవర్తన ఏర్పడింది. మగపాము మరో పాము కనబడితే రాసుకుంటూ పోతుంది. అది ఇంకో మగ పామైనా లేక మరో జాతికి చెందిన సర్పమైనా క్షణాలలో అక్కడ్నించి పారిపోతుంది. తమ జాతికే చెందిన ఆడ పామయితేనే జత కడుతుంది.

సముద్రపు గుర్రాలలో మగ గుర్రం ఒంటిమీద ఓ సంచీ లాంటిది వుంటుంది. ఆడ గుర్రం అందులో గుడ్లు పెడితే, మగ గుర్రం వాటిని పొదిగి పిల్లలు పెడుతుంది. మగ గుర్రం ఒంటికుండే సంచీలో అనేక ఆడ గుర్రాలు గుడ్లు పెడతాయి. కాబట్టి వేటికి ఎవరు తల్లో తెలుసుకోవడం అసాధ్యం.

అమెరికాలోని గోధుమరంగు గబ్బిలాలు చలికాలంలో జతకడితే, తన ఒంట్లోకి వచ్చిన వీర్యాన్ని ఆడ గబ్బిలం ఎండాకాలం వచ్చేదాకా భద్రపరచి ఆ తర్వాతే తనకి గర్భం వచ్చేలా చేస్తుంది. ఇది తప్ప ప్రపంచంలోని మరే ప్రాణి వీర్యాన్ని 36 గంటల కంటే ఎక్కువ కాలం ఉపయోగకరంగా ఉండేలా నిల్వ చేయలేదు.

నత్తలో మగ, ఆడ జననేంద్రియాలు రెండూ ఉన్నాయి. మరో నత్తతో జతకట్టేప్పుడు మగ జననేంద్రియం జతకట్టే దాని ఆడ జననేంద్రియంతో, ఆడ జననేంద్రియం ఎదుటి దాని మగ జననేంద్రియంతోనూ జతకడతాయి. తర్వాత రెండు నత్తలూ పిల్లల్ని పెడతాయి. అంటే ప్రతి నత్తలో తండ్రి, తల్లి రెండూ ఉంటాయన్నమాట. సృష్టి చిత్రాలు ఎన్నో మరీ!

హాయత... అక్క పరిస్థితి ఏమిటి అన్న ఆలోచన... బొత్తిగా బాధ్యత లేని మనిషి... ఆయన్తో ఏమీ లాభం లేదన్న నిర్లిప్తత ... ఇవన్నీ కలిసి నాకూ మా అమ్మకీ, అక్కకీ నిద్రలేకుండా చేశాయి.

ఎంతమంది తప్పించుకు పోయేవా ళ్ళున్నా, బాధ్యతలు మాత్రం ఎక్కడికీ పోవు. ఎవరో ఒకరు వాటిని నెత్తికెత్తుకోక తప్పదు... అప్పటికే ఎన్ని బరువులు ఆ నెత్తిమీద ఉన్నా...

ఆలోచించి ఆలోచించి చివరికి మా అమ్మ పుట్టింటికి వెళ్ళింది. ఏం చెప్పిందో, ఏం చేసిందో తెలియదు.

మావయ్యతో సహా తిరిగి వచ్చింది.

మర్నాడే మావయ్యని తోడిచ్చి అక్కని అత్తవారింటికి పంపింది. ఆ రోజు నుంచీ ఇంట్లో వాతావరణం అదో మాదిరిగా తయారైంది. అమ్మ మామూలుగా పనికి వెళ్తూ, సంసారభారం మోస్తూ ఉంది. నేను కూడా మామూలుగానే పనికి వెళ్తు న్నాను. చిన్నక్క కూడా మామూలుగానే ఉంటోంది. మా నాన్నే సరిగ్గా ఇంటికి రావడంలేదు. ఎవరితోనూ సరిగ్గా మాట్లా డ్డంలేదు. ఇంట్లో సరిగ్గా తినడంలేదు.

అందరం ఏదో బరువుని మోస్తున్నవా ళ్లలా ఏవేవో ఆలోచనలని మోసుకుంటూ తిరుగుతున్నాం.

అందరి ఆలోచనల మూలకేంద్రం ఒక్కటే.

ఇంక మిగిలిన ఒక్క కూతురి భారం ఎలా తీరుతుందన్న ఆలోచన మా అమ్మది.

ఇక ఏ పక్కనుంచీ డబ్బు వచ్చే మార్గం లేదు. ఎదిగిన ఆడపిల్ల ఇంట్లో ఉంది. ఏమిటి దాని భవిష్యత్తు అని నాకు... మరోపక్క నాన్న బాధ్యతారాహిత్యం మీద కోపం...

నిజానికి మా నాన్న ఇప్పుడు బాధ్యతని గ్రహించినా ఉపయోగం ఏమీ లేదు. ఏదో ఆయనలా ఉండటం వల్లనే ఇలా అయి పోయాం అని తిట్టుకోవడం తప్ప...

తాగి తందనాలాడే తండ్రి.. ఆ తండ్రి చేసిన అప్పులకి కట్టుబానిసైన కొడుకు... నిస్సహాయురాలైన తల్లి... వీళ్ళిద్దరి మధ్య తన భవిష్యత్తు ఏంటని మా చిన్నక్క రాధారాణి కూడా ఆలోచిస్తూ ఉందని ఆ క్షణం నాకు తెలియదు. ఆఖరికి మా అమ్మక్కూడా తెలియదు.




**చు**ట్టూ ప్రపంచం శరవేగంగా మారి పోతోంది. చూస్తోంటే మేం మాత్రమే ఎక్కడ వేసిన గొంగళి అక్కడే అన్నట్లుగా ఉన్నాం అనిపిస్తోంది. మా ఊరు సైతం వేగంగా మారిపోతోంది.

మేము, మాలాంటి కొద్దిమందే ఏ మార్పులకూ గురికాకుండా ఉండిపోయాం.

అయితే అలా మార్పు లేకుండా ఉండి పోయినామన్న బాధ ఎవరికీ ఉన్నట్టు లేదు. నేనొక్కడ్ని మారే ప్రపంచాన్ని, మారని నా బతుకునీ చూసి నిరంతరం బాధపడుతూ ఉన్నట్టున్నాను.

నిత్యం ముసిరే ఆలోచనల వల్లనే కదా నాకింత బాధ... అవే గనుక లేకపోతే నేను కూడా అందరిలా జీవితం ఎలా నడి పిస్తే అలా బతికి చాలా మామూలుగా ఇక్కడే ఈ మట్టిలోనే కలిసిపోయేవాడ్ని కదా అనిపించేది.

## ఆహా.. ఏమి లాజిక్!

తన రచనల ద్వారా ఎంతోమందిని నవ్వించిన మునిమాణిక్యం నరసింహారావు వ్యక్తుల అజ్ఞానం వల్ల ఎలా నవ్వులు పూస్తాయో తెలిపారు. అప్పట్లో జిల్లా బోర్డులకు ప్రెసిడెంట్లు ఉండేవారు. చదువుసంధ్యలులేని వాళ్ళు కూడా ధనవంతులైన కారణాన, పలుకుబడితో ఓట్లు సంపాదించి ప్రెసిడెంట్లు అయ్యేవారు. అలాంటి ఒక ప్రెసిడెంటు వద్దకు ఆ జిల్లాలో కలరా వ్యాధితో చనిపోయినవారి రిపోర్టు వచ్చింది. అందులో కలరావల్ల చావులు 12.5% అని ఉంది. ఆ చావులేదో నూటికి 12 అంటే తెలిసేది. పన్నెండు తర్వాత ఓ చుక్క పెటారు. ఆ చుక్క తర్వాత 5 అంకె ఉంది. చుక్క పొరపాటున పెట్టారనుకుని, దాన్ని తీసేసి చదివితే నూటికి నూట ఇరవై అయిదుమంది చనిపోయినారనే అర్థం వస్తుంది. 'ఈ చుక్కకేదో పెద్ద అర్థం ఉండాలే.. ఏమిటబ్బా' అని ఆ ప్రెసిడెంటు తీవ్రంగా ఆలోచించాడు. ఏమీ పాలుపోలేదు. చివరకు వైస్ ప్రెసిడెంటును పిలిచి 'ఈ చుక్కకు అర్థం ఏమిటయ్యా?' అని అడిగాడు.




ఆ వైస్ ప్రెసిడెంటు సీరియస్‌గా ఆలోచించి ఇలా అన్నాడు, 'మరేమీ లేదండీ.. కలరా వల్ల నూటికి పన్నెండు మంది చనిపోయారని తెలుస్తోంది గదా! ఇంకో ఐదుగురు చావటానికి సిద్ధంగా ఉన్నారు. అందుకని కాస్త చుక్క అడ్డం పెట్టారు' అని విపులంగా చెప్పాడు.

అంటే ప్రపంచంలో ఎంతోమందికి లేని ఆలోచన నాకే కలిగిందంటే ఆ ఆలోచనకి ఏదో ప్రయోజనం అంటూ లేకుండా పోతుందా... మిగతా జనంకంటే విభిన్నంగా బతకలేకపోతానా అనిపించేది.

అలా అనుకుంటూ, ఎప్పుడూ ఏవో కలలు కంటూ ఉండేవాడిని.

జీవితంలో ఏదో ఒక అద్భుతం జరుగుతుంది. నా దగ్గరికి బోలెడంత డబ్బు వచ్చి పడుతుంది. దాంతో అప్పులన్నీ తీర్చేస్తాను. మా అక్కకి ఘనమైన సంబంధం చూసి పెళ్ళి చేస్తాను. చిన్నక్కకి కూడా కొంత డబ్బు ఇస్తాను. ఊళ్ళో మంచి ఇల్లు కట్టించి మా నాన్నచేత తాగుడు మాన్పించి, అమ్మనీ నాన్ననీ ఏ శ్రమా లేకుండా సర్వసుఖాలూ అనుభవించేలా చేస్తాను. అమ్మమ్మ, తాతయ్య, మావయ్యలకి జీవితాంతం సుఖంగా గడవడానికి కావాల్సినంత డబ్బు ఇస్తాను. నేను మంచి సంబంధం చూసుకుని కట్నం లేకుండా పెళ్ళి చేసుకుంటాను. నా పిల్లల్ని మావయ్య పిల్లలకిచ్చి పెళ్ళిళ్ళు చేసి మావయ్య రుణం తీర్చుకుంటాను. ఇలా కలలు కంటున్నంతసేపూ ఎంతో హాయిగా ఉండేది. మనసు నిండా ఎంతో ఉత్సాహం నిండిపోయేది. కలలుకన్న జీవితం కళ్ళ ముందుకు వచ్చేరోజు ఎంతోదూరంలో లేదు.. దగ్గరలోనే ఉందనిపించేది...

ఈ బాధలన్నీ నాలుగు రోజులే. హాయిగా గడిపేస్తే తర్వాతంతా సుఖమే కదా అనిపించేది.

దాంతో చేస్తున్న పని ఎలాంటిదైనా చలాకీగా చేసుకుపోతుండేవాడిని. వాస్తవంగా ఆలోచిస్తే ఈ ఆలోచనలవల్లే నేను చేస్తున్న పనిలో 'బాధ' కనిపిస్తున్నదనీ.. ఆ ఆలోచనలే మిగతా వాళ్ళకీ నాకూ ఏదో తేడా ఉందన్న భావన కల్పించి నేనిలాంటి పనిచేయడమేంటని అనిపిస్తోందనీ..

మామూలుగా బతికేసే మిగతా వాళ్ళకీ, ప్రతిక్షణం బాధపడుతూ బతికే నాకూ తేడా ఈ ఆలోచనలొకటే అని తెలిసిన పుడు వాటిని ఎలాగైనా వదిలించుకోవా లనీ, పగటి కలలు కనడం మానెయ్యాలనీ, జీవితంలో అద్భుతాలేమీ జరగవు.. మనల్ని మనమే విముక్తం చేసుకోవాలి.. కానీ అది ఈ జన్మకి జరగదు.. అన్న వాస్తవాన్ని పదేపదే గుర్తుంచుకోవాలనీ అనిపించేది.

కానీ కలలు ఆగేవి కావు. ఈ వాస్త వాలూ అనుభవంలోకి రాక మానేవి కావు.

గ్రామాభివృద్ధిలో భాగంగా ఆ సంవ త్సరం మా ఊరి బడిని పదో తరగతి వరకూ పెంచారు. స్కూలు బిల్డింగుని కూల్చి, కొత్తది పెద్దగా కట్టారు. ఆ భవ నంలోనే గ్రంథాలయాన్ని కూడా ఏర్పాటు చేశారు.

అప్పట్నుంచీ నా సాయంకాలాలు అక్కడే గడిచేవి. రోజూ పత్రికలు చదివే వాడిని. వారపత్రికలు చదివేవాడిని. నెమ్మ దిగా లైబ్రేరియన్ బాగా పరిచయం కావ డంతో పుస్తకాలు యింటికి యిచ్చేవాడు.

ఎన్నెన్నో పుస్తకాలు... తెలుగు రచయి తలవి... బెంగాలీనుంచి అనువదించబడి నవి.. రష్యన్ నుంచి, యితర విదేశీ భాష లనుంచీ అనువాదం చేయబడినవీ...

నా అజ్ఞానాన్నంతా జ్ఞానంగా మార్చేసిన ఎన్నో పుస్తకాలు... ఎందరో రచయి తలు... నా ప్రపంచం చాలా చిన్నదనీ, నా అవగాహనంతా చాలా తక్కువనీ, బయటి ప్రపంచం చాలా విశాలమనీ, నా కష్టాలన్నీ కలిపినా ప్రపంచంతో పోలిస్తే పీత కష్టాలేననీ నాకు తెలియజెప్పి, నా లోకాన్ని విశాలం చేసిన పుస్తకాలు...

ఇవన్నీ నాలో మెదిలిన భావాలే కదా అనిపించిన భావాలు.. యిలాంటి స్థితే నాకూ ఎదురైనా యిలాంటి భావాలు నా లో తట్టలేదే అన్న ఆలోచనలు...

అన్నింటికీ మించి రోజులకి రోజులు నా పనితోనూ, చదువుతోనూ గడిచిపోవడం మరీ హాయిగా ఉంది నాకు.

సాయంత్రాలు అక్కడ చదువుకోవడం, రాత్రికి యింటికి వచ్చాక చదువుకోవడం, నిద్ర వస్తుందనేసరికి పుస్తకం మూసి నిద్ర పోవడం, ఏ తెల్లవారుజామునో మెలకువ వస్తే మళ్ళీ చదువుకోవడం.

పుస్తకాల తాలూకు, ఆ పుస్తకాల్లో ప్రతి బింబించే జీవితం తాలూకు అసలైన లోతుని ఆ రోజుల్లో అనుభవించగలిగాను నేను.

చదవడం ఉధృతంగా సాగుతున్న ఆ రోజుల్లో ఏదో రాయాలనే తపన నన్ను ఉగ్రూతలూగించేది. ఏవేవో ఆలోచనలు మెదడులో సుడులు తిరుగుతూ అక్షరా లుగా మార్చమంటూ నన్ను వెంటాడేవి. అయితే ఏదో ఆత్మన్యూనత నన్ను పేపరు మీద పెన్ను పెట్టనివ్వకుండా అడ్డుకునేది. ఎప్పటికైనా సాహితీ చరిత్రలో చిరస్థా యిగా నిలిచిపోయే పుస్తకం రాయాలని తపించిపోయేవాడిని.

అలాంటప్పుడు బుచ్చిబాబు కథ- 'నన్ను గురించి కథ వ్రాయవూ?'లో రాసిన వాక్యాలు గుర్తుకు వచ్చేవి.

'జీవితంలో ఏదో ఉద్గ్రంథం నేను మర ణించే లోపల రాయాలని నా జీవితా శయం. అయితే వాటిలో ఏదో ఒకటి కచ్చి తంగా జరిగి తీరుతుంది కదా అన్న నమ్మకం నన్ను తృప్తిపరచేది. ఉద్గ్రంథం రాయకపోయినా చావు మాత్రం వచ్చి తీరుతుంది కదా...'

ఆ పుస్తకాల సాహచర్యం వల్లనే నాకు ఎంతో యిష్టమైన పాటల తాలూకు లోతు కూడా తెలియడం ప్రారంభమైంది.

రేడియోల్లో, గ్రామ్‌ఫోన్‌లలో వినిపిస్తూ

నా మనసులో ధృడంగా పాతుకుపోయే పాటల తాలుకూ లోతులు, వాటి అందాలూ, అందులోని చమక్కులూ, ద్వంద్వార్థాలు అన్నీ తెలిసి వస్తుండేవి.

ఆ కాలంలో ఎంత పిచ్చిగా చదివానంటే.. బూతు పుస్తకాలనించి మహాగ్రంథాలనిపించుకున్న పుస్తకాలదాకా అన్నీ చదివేశాను. పుస్తకాల్తోపాటు పాట కూడా నిత్యం నా వెన్నంటే ఉండేది. ఎన్ని అద్భుతమైన పాటలు... ఎన్ని అపురూపమైన భావాలు...

'జగమే మాయ, బ్రతుకే మాయ... వేదాలలో సారమింతేనయా' అనీ, 'కలిమి లేములూ, కష్టసుఖాలూ కావడిలో కుండలనీ' అన్న సీనియర్ సముద్రాల నుంచి 'పోయినోళ్ళందరూ మంచోళ్ళు... ఉన్నోళ్ళు పోయినోళ్ళ తీపిగురుతులు' అన్న మనసు కవి ఆత్రేయ వరకూ...

'పిల్లన గ్రోవికి నిలువెల్ల గాయాలు... అల్లనమ్రోవికి తాకితే గేయాలు' అనీ... 'ఆదినుంచీ ఆకాశం మూగది, అనాదిగా తల్లి ధరణి మూగది... నడుమవచ్చి ఉరుముతాయి మబ్బులు... ఈ నడుమంత్రపు మనుషులకే మాటలూ.. యిన్ని మాటలు' అని రాసిన వేటూరి సుందర రామ్మూర్తి నుంచి, వస్తూ వస్తూనే 'ఆదిభిక్షువు వాడినేమి అడిగేది... బూడిదిచ్చేవాడినేమి కోరేది' అని రాసిన 'సిరివెన్నె'ల సీతారామ శాస్త్రి వరకూ...

నిత్యం నా నాలుకపై ఎన్నో పాటలు... ఆ పాటల్లో అలతి అలతి పదాలు... నా మనసంతా నిండిపోయిన మాటలు... నా మస్తిష్కంలో అలల్లా ఎగసిపడే భావాలు...

"లాహిరి లాహిరి లాహిరిలో... ఓహో జగమే ఊగెనుగా... తూగెనుగా..."

★ ★ ★

ఎప్పుడూ ఒకేలా ప్రవహిస్తే అది నది అవదు. నిత్యం ఒకేలా సాగితే అది జీవితం అవదు... ఏదో నవలలో నేను చదివిన వాక్యాలవి.

నా జీవితంలో నిత్యం ఎదురైన నిజాలు కూడా.

ఈసారి మలుపు మా నాన్న అనారోగ్యం రూపంలో వచ్చింది. తాగి తాగి ఒళ్ళు గుల్లచేసుకున్న మా నాన్న హఠాత్తుగా మంచాన పడ్డాడు.

మొదట జ్వరం అనుకున్నా రెండ్రోజులుగా ఒళ్ళు కాలిపోతూ పడుకుని ఉంటే. ఒకటే చలి... ఎన్ని దుపట్లు, బొంతలు కప్పినా మనిషి వణికిపోతూనే ఉండేవాడు.

మూడోరోజుకల్లా ఆయనలో విపరీతమైన వణుకు. నరాలు పట్టువదిలేసిన వాడిలా కాళ్ళూ చేతులూ కొంకర్లుపోయేవి.

పక్కఊర్లో ఉండే ఆచార్యులుగారు పసరుమందు యిచ్చారు. తగ్గలేదు.

గవర్నమెంటు హాస్పిటల్‌కి తీసుకెళ్తే ఏవో మందులు రాసిచ్చారు. ఫలితం కనిపించలేదు.

చివరికి ఒక ప్రైవేటు హాస్పిటల్‌లో చూపిస్తే, ఖరీదైన మందులు వాడితే గుణం కనిపించింది.

ఆ డాక్టరుగారు డైరక్టుగా చెప్పాడు 'యిక మీదట చుక్కమందు తాగినా చచ్చిపోతావు' అని.

## కొత్తగాలి...

**వృత్తిరీత్యా అతడు**
**వృత్తంలోనే ఉన్నాడు**
**మనసుని అమ్ముకోలేదు**
**అందుకే ఎదుగూ బొదుగూ లేదు**

– కూర్మాన వెంకట సుబ్బారావు,
విశాఖపట్నం

అక్కడ భయంగా, బుద్ధిగా ఊకొట్టినా, రెండురోజులు కూడా ఉండలేకపోయాడు మా నాన్న. ఎప్పటిలా తాగడానికి బయటికి పోబోతుంటే 'ఇల్లు కదిలావంటే కాళ్ళి రగ్గొడతా' నని అరిచింది మా అమ్మ.

మనిషి మొత్తం కుచించుకుపోతున్నట్టు అయిపోయి ఆగిపోయాడు ఆయన.

ఆ రోజంతా జాగ్రత్తగా కాపలా కాసింది మా అమ్మ.

మర్నాడు పనికి వెళ్తూ 'నీ బుద్ధి నాకు తెలుసు. నేనిలా వెళ్ళగానే అలా జారుకుంటావ్. డాక్టరు సెప్పింది గుర్తుందిగా. ఆనక నీ యిట్టం... మొన్నంటే ఎక్కడో అప్పుసేసి డాట్టరుకి సూపించాం. యింకో పాలి ఏవొచ్చినా తీసుకెళ్ళే పసక్తే లేదు' ఖరాఖండీగా చెప్పేసి వెళ్ళిపోయింది మా అమ్మ.

ఆమె భయపడినట్టే మామూలుగా సారా కొట్టుకి పోయాడు మా నాన్న. యిప్పుడు కూలీ డబ్బులు కూడా లేవు గనుక, కొట్టువాడు అప్పుపెట్టినంతా తాగి, తర్వాత మా అమ్మ దాచుకున్న డబ్బులు పట్టికెళ్ళిపోయి, తర్వాత యింట్లోని బిందెలు అమ్మేసి, మా అమ్మగొడవ పడలేక, సారా కొట్టు దగ్గర వాళ్ళ దగ్గరా వీళ్ళ దగ్గరా సారా కోసం దేబిరిస్తూ... కొన్నాళ్ళు అలా గడిపేశాడు.

అయితే మా అమ్మ భయపడినట్టు మళ్ళీ హాస్పిటల్‌కి తీసుకెళ్ళవలసిన పని రాలేదు.

ఏ వైద్యమూ అక్కరలేకుండా, ఆ అవసరమే లేకుండా సారా కొట్టు దగ్గరే ప్రాణాలు విడిచేశాడు మా నాన్న.

ఒళ్ళంతా మట్టికొట్టుకుపోయి, మొహమంతా ఈగలు ముసిరిన స్థితిలో ఆయన శవాన్ని యింటికి మోసుకొచ్చాం.

శవానికి వాకిట్లో చోటులేదు. శోకానికి అంతూ దరీ లేదు. సామాన్యుడిగా పుట్టి, సామాన్యంగా పెరిగి, సామాన్యంగా పెళ్లి చేసుకుని, సామాన్యులైన పిల్లల్ని కని... అందరినీ బాధపెట్టి... తను మాత్రం బాధకీ, సుఖానికి తేడా తెలియని మిథ్యా ప్రపంచంలో ఏళ్ళకి ఏళ్ళు గడిపి...

ఏ అర్థమూ పరమార్థమూ లేకుండానే తన జీవితాన్ని ముగించేసి వెళ్ళిపోయాడు మా నాన్న.

ఎంత కాదనుకున్నా, ఎంతగా బాధించినా ఆయన మా నాన్న... మా అమ్మకి కట్టుకున్న భర్త... ఆ మాత్రం దుఃఖం ఉంటుంది.

అలాగే ఎంత సమర్థించుకున్నా మనిషిని బాధ పెట్టేవాడి జ్ఞాపకాలు మాత్రం తొందరగా సమసిపోతాయి. అది నిజం. అనుభవైక వేద్యం. జనం కోసం దుఃఖం నటించడం తప్ప లోలోపల సంతోషం కూడా ఉంటుందనేది నా చీకటి రోజుల జ్ఞాపకం కూడా..

★ ★ ★

నాతోపాటు అదే సంవత్సరంలో పితృవియోగాన్ని అనుభవించిన వాడు - నవీన్.

ఆయన ఒక యాక్సిడెంట్‌లో అనుకోకుండా, అకస్మాత్తుగా ప్రాణాలు కోల్పోయాడు.

హఠాత్తుగా తగిలిన ఆ షాక్‌నుండీ, ఆయన మరణం తాలూకు దుఃఖం నుండీ తేరుకోకుండానే ఆ కుటుంబానికి మరో షాక్ తగిలింది.

ఆయన లక్షల్లో ఫైనాన్స్ వ్యాపారం చేసేవాడు. అయితే ప్రజల మీదే ఉండేదా సొమ్మంతా. ఇంట్లో ఉండేది బహు తక్కువ. ఆయన అకస్మాత్తుగా మరణించడం వలనా, డబ్బు యివ్వలసిన వాళ్ళ వివరాలు ఎక్కడా వివరంగా రాయకపోవడం వలనా, ఎవరితోనూ ఆఖరికి కట్టుకున్న భార్యతో సహా ఈ విషయాలు చర్చించే అలవాటు లేకపోవడం వలనా

స్మితం

## మనవరాలికి తాతగారి చురక

శ్రీ ముట్నూరు కృష్ణారావుగారి మనుమరాలు శ్రీమతి చిట్టెమ్మ. యూరప్‌లోని అనేక దేశాలు తిరిగి వచ్చింది. చదువుకొన్నది. సరసత తెలిసిన ఇల్లాలు. తాతగారిని చూచిపోదామని వచ్చింది. ఆవిడ వ్యంగ్యంగా ఒకసారి అన్నది, 'ఏమండీ తాతగారూ! ఈ ఊరినిండా గాడిదలేనే' అని. బందరులో గాడిదలు ఎక్కువగా ఉన్నమాట నిజమే. చిట్టెమ్మ తాతగారితో ఎకసక్కెమాడింది. ఆ మాట విని పంతులుగారు, 'అవునమ్మా?! నీవన్నమాట నిజమే. ఈ ఊరునిండా గాడిదలే. ఇవి చాలనట్టు అప్పుడప్పుడు ఈ గాడిదలను చూడడానికి పొరుగూరి గాడిదలు కూడా వస్తుంటవి' అన్నారు చురకవేస్తూ. ఆ చతురోక్తికి చిట్టెమ్మ కూడా నవ్వింది.

ఈ తరంవాళ్ళు ముట్నూరివారి కథలు పెద్దగా చదవలేకపోవచ్చునేమోగాని, గొప్ప హాస్య రచయితగా తెలుగు పాఠకుల హృదయాల్లో ఆయన పేరు చిరస్థాయిగా నిలిచే ఉంటుంది.




డబ్బు చాలా పోయింది.

ఇంట్లో వందల సంఖ్యలో ప్రామిసరీ నోట్లు ఉన్నాయి. సగం మంది వెయ్యో పదిహేనువందలలో బాకీ ఉన్నాం అన్నారు. మిగతా సగంలో సగం మంది తీసుకున్నది ఎంతైనా, చాలా మట్టుకు జమ చేసేశాం అన్నారు. మిగతా జనం మాత్రం బాకీలు ఏనాడో జమ చేసేశాం, నోట్లు తర్వాత తీసుకుందాంలే అని వదిలేశాం అన్నారు.

పాట చీటీలకి డబ్బు కట్టినవాళ్ళు తమ సొమ్ము తమకు సరిపెట్టమని యింటిమీద పడ్డారు..

ఆయన స్నేహితులు కొందరు రావాలసినవి వసూలు చేసి, యివ్వాల్సిన వాళ్ళకి సరిపెట్టగా యింకా యివ్వవలసిన సొమ్ము చాలా మిగిలింది.

ఆవిడ ఒంటిమీద బంగారం అమ్మీ, యిల్లు తనఖా పెట్టీ ఆ బాకీలు తీర్చారు.

అంతా క్లియరయ్యే సమయానికి మధ్యలో ఆగిపోయిన నవీన్ చదువూ... తనఖాలో ఉన్న ఒక్క యిల్లూ... శోక దేవతలా వాళ్ళమ్మా.. మిగిలారు.

అచ్చం మా అమ్మ, మా అక్క.. నేనూ లాగా...

మాకేమి చెయ్యకుండానే చెయ్యాలనే ఆలోచన చెయ్యకుండానే మా నాన్న మమ్మల్ని విడిచి వెళ్ళిపోయాడు.

ఎంతో చేస్తూ ఉన్న నవీన్ వాళ్ళ నాన్న కూడా ఆయన ప్రమేయం లేకుండానే ఏమీ మిగల్చకుండా వెళ్ళిపోయాడు.

ఎంత విచిత్రమైనది విధి? ఎంత కఠినాత్ముడు భగవంతుడు? మనుషుల బాధల్తో, కన్నీళ్ళతో ఆయనకి ప్రమేయం లేదు. జనాన్ని చిత్రవిచిత్ర రీతుల్లో బాధిస్తూ వేడుక చూస్తూ ఆనందిస్తూ ఉంటాడు.

మార్క్‌ట్వైన్ 'విచిత్ర వ్యక్తి' నవలలో విచిత్ర వ్యక్తి పాత్ర గుర్తొచ్చింది. అతనూ యిలాగే మనుషుల్ని సృష్టిస్తూ నిర్మూ

## కొత్తగాలి...

**ఆశతో బతికే**
**ప్రతి మోడు**
**నీకు ఆదర్శమై**
**నిలుస్తుంది చూడు**

– నీహారిక, ఖమ్మం

లిస్తూ ఉంటాడు. అతన్ని చూస్తూ పిల్లాడు ఆశ్చర్యపోతాడు.

మనుషులు చీమల్నీ, దోమల్ని నలిపి పారేసినట్టు అతను మనుషుల్ని నలిపి పారేస్తుంటే విస్తుపోయి అతనిదెంత కఠిన హృదయమని అనుకుంటాడు.

పిల్లాడి ఆలోచనల్ని చదివేసిన విచిత్ర వ్యక్తి, నా దృష్టిలో మనిషికేమీ విలువ లేదు. మీకు చీమలూ దోమలూ ఎలాగో నాకు మనుషులూ అలానే. ఆ మాటకొస్తే మనుషులకన్నా జంతువులే ఎంతో నయం అంటాడు. జంతువులను హీనంగా మాట్లాడనివ్వడు...

మనుషులుగా పుట్టాం గనుకే యిన్నిన్ని బాధలు.. బాధల గురించిన ఆలోచనలు.. జంతువులుగా పుట్టి ఉంటే ఏ గొడవా ఉండదు. అంతా హాయి... ఏమీ తెలియని పసిపిల్లాడు ఉయ్యాలలో కేరింతలాడుతూ, వెచ్చగా అమ్మ ఒడిలో బజ్జొంటూ పొందే హాయి... అవునూ... అప్పుడు ఈ 'హాయి' అనే మాట కూడా తెలియదు కదా.. బాధ ఉండకపోతే హాయి కూడా ఉండదు కదా... అయితే దేవుడు వీటన్నింటికీ ఏదో ప్రయోజనం కల్పించే ఉంటాడు.

ఆ ప్రయోజనం ఏమిటో తెలుసుకోవడంలోనే ఉండి ఉంటుంది మానవ జన్మ యొక్క సార్థకత...

మానవజన్మ మొదలైన క్షణం నుంచీ ఎంతమంది ఆ ప్రయోజనం ఏమిటో తెలుసుకోవడానికి ప్రయత్నించారు? ... తమ ప్రయత్నాల్ని, వాటి ఫలితాల్నీ భావితరాల కోసం గ్రంథాలుగా రాసి పెట్టి ఉంచారు? ... ఎందరు మేధావులు... ఎందరు తత్త్వవేత్తలు... ఎందరు మహా రచయితలు... ఎందరో మహాకవులు...

వాళ్ళందరి ముందూ నేనెంత?

ముసురుకునే ఈ ఆలోచనలన్నీ, బతకడంకోసం చేసే పోరాటంలో, పనిలో భాగంగా పక్కన పెడితే... చివరికి మిగిలేది ఏమిటి?

నేను.

చివరికి మిగిలేది నేనే.

★ ★ ★

రాయకపోతే విముక్తి లేదన్నంతగా కొన్ని ఆలోచనలు నన్ను వెంటాడటంతో అవన్నీ కాగితం మీద పెట్టాను.

మంచి కథ తయారయింది నా దృష్టిలో. అయినా పత్రికకి పంపే ధైర్యం చేయలేకపోయాను. అందులోనూ పూర్తిగా నా మీద పడిన యింటి బాధ్యత... చాలా రోజులపాటు జీవచ్ఛవంలా పడి ఉండిపోయింది అమ్మ.

అక్క అయితే పూర్తిగా మరో లోకంలో ఉంటోంది. నాన్న పోయినప్పుడు వచ్చిన చిన్నక్క, కార్యక్రమాల అనంతరం వెళ్ళిపోయిన చుట్టాల్తో పాటు వెళ్ళిపోయింది.

నేనూ... నా పనీ... సాయంత్రానికి యింటికొస్తే యాంత్రికంగా కదిలి వంట చేసి పెట్టే అక్క, అమ్మా...

రోజులిలాగే గడిచిపోతున్నాయి.

మరోసారి కాలం పచ్చిపచ్చిగా ఉన్న గాయాలమీద మరుపనే లేపనం పూసింది.

పుండుకి పుల్ల మొగుడని అంటుంటారు మా ప్రాంతంలో. పుండు తగిలిన చోటే పుల్ల గుచ్చుకుంటూ ఉంటుంది గనుక.

కొంచెం కొంచెంగా మానుతోన్న మా గాయాల్ని మా బుజ్జక్క మరణమనే పుల్ల,

## జనవరి -10
# చతుర ప్రవేశిక విజేతలు వీరే!

డ్రాలో ఎంపికైన ఈ అయిదుగురికీ త్వరలో బహుమతులు అందుతాయి.

1. **సిహెచ్.పార్వతి** - టీచర్స్ ఎన్‌క్లేవ్, గుంటూరు
2. **డి.భరతరాజు** - వెంకటేశ్వరపురం, నెల్లూరు
3. **జి.వనజ** - గుడివాడ, కృష్ణా జిల్లా
4. **కోట లలిత** - లక్ష్మీనగర్, సికింద్రాబాద్
5. **పెరవలి రేవతి** - శేరిలింగంపల్లి, రంగారెడ్డి జిల్లా

### సరైన జవాబులు

1. వైదేహి 2. ప్రభ 3. సూర్యకాంతమ్మ 4. రమ్య 5. కామేశ్వరరావు 6. యయాతి 7. శ్రీశ్రీ 8. 1928, సెప్టెంబరు 1న 9. వివేకానంద 10. ఎటీన్ లాంటీర్

లోతుగా కెలికి వదలిపెట్టింది...

యవ్వనం ఎవర్నీ వదిలిపెట్టదు. కూటికిలేని బీదరాలి ఒంటిమీదకి కూడా యవ్వనం ఆకర్షణని తెచ్చిపెడుతుంది. గుడ్డ కూడా సరిగా కప్పుకోలేని శరీరాల్ని చూసి జాలిపడే బదులు ఆశ పడేవాళ్లు కూడా ఎందరో ఉంటారీలోకంలో. అయితే ఆ ఆశకి అందమైన ముసుగు కూడా తొడి గాడు రాజుగాడు.

మా అక్కని ప్రేమించానన్నాడు. పెళ్లి చేసుకుంటానన్నాడు. కాణీ కట్నం అక్కర లేదన్నాడు. నువ్వు నాతో వస్తే చాల న్నాడు. మనిద్దరం హాయిగా ఉందామ న్నాడు. చుక్కల్లోకం చూపిస్తానన్నాడు.

ఏమీ పట్టించుకోని తండ్రికీ, పట్టించు కుంటున్నట్టు కనిపించని తమ్ముడికీ, చేత కాని తల్లికీ భారం కాకూడదనే ఆలోచనతో ఉన్న మా అక్క, ఆ ఆలోచనలు ఆచరణ సాధ్యమయ్యే తరుణం వచ్చిందనుకుని తొందరపడింది.

అది మల్లెల వేళయనీ... అది వెన్నెల మాసమనీ... తొందరపడి ఆ కోయిల ముందే కూసింది.

మా నాన్న అనారోగ్యం, ఆయన మరణం రాజుగాడి అవకాశావాదానికి ఆయువుపట్లయ్యాయి. రేపు మాపు అంటూ వాయిదాలు వేసుకుంటూ గడిపే సిన రాజుగాడు తీరా మా అక్కకి కడుపని తెలియగానే ఎక్కడికో పారిపోయాడు.

ఎలా చెప్పాలో, ఎవరికి చెప్పాలో తెలి యని సందిగ్ధంతో, భయంతో... తెల్లకాగి తానికి కలంతో ఈ సంగతులన్నీ చెప్పించి ఉరితాటికి వేళ్లాడింది మా బుజ్జక్క రాధా రాణి.

నేనెక్కడో చదివాను... మన చుట్టూ ఆత్మహత్యలు చేసుకునే వాళ్లు మనకి తెలి యకుండానే మన మీద ప్రభావం చూపి స్తారనీ... మనం కష్టాల్లో ఉన్నప్పుడు ఒక 'దారి' చూపించిన వాళ్లవుతారనీ... అందుకే ఒక్కో ప్రాంతంలో ఒక్కో రీతిలో వరసగా ఆత్మహత్యలు జరుగుతూ ఉంటా యనీ...

మా పెద్దక్క మరణం బుజ్జక్కకి ఒక 'దారి' చూపింది. షాకుల మీద షాకుల వలన బుర్ర మొద్దుబారిపోయి కాబోలు అన్ని విషాదాల తర్వాత కూడా నేను పిచ్చెక్కిపోకుండానో, చచ్చిపోకుండానో...బతికే ఉన్నాను.

చాలామంది అనుకుంటారు... మనకొచ్చిన కష్టాలు మనం కాబట్టి భరించామని... పగవాడిక్కూడా యిలాంటి కష్టాలు రాకూడదనీ... వేరెవరైనా అయితే భరించలేక ఏదో అయిపోయేవారనీ...

గతంలా వదిలేసి, భవిష్యత్తులోకి సాగిపోతారు... కాలంతో పాటే.

నేను నా పుస్తకాల జ్ఞానంతోనూ, వైరాగ్యంతోనూ, వేదాంతంతోనూ ఆ బాధని దిగమింగగలిగినా మా అమ్మ మాత్రం దాన్ని గరళంలా కంఠంలోనే ఉంచుకుందని చాలారోజుల వరకూ అర్థం కాలేదు నాకు. తీరా అర్థమయ్యే సరికే ఆ గరళం మా అమ్మ ప్రాణాల్ని తీసేసింది. గరళాన్ని భరించడానికి మనిషి పరమాత్ముడు కాదుగదా...

## ఉంగరం ముచ్చట

ఓసారి కాకినాడలో గానసభకు దాసుగారి మిత్రులు కొమ్మిరెడ్డి సూర్యనారాయణ నాయుడు అధ్యక్షులు. దాసుగారు ఆ సభలో హరికథ చెప్పాలి. రావటం ఆలస్యమైంది. తీరా వచ్చిన తరువాత ఆయన వేలికి నాయుడుగారొక ఉంగరాన్ని తొడిగారు, ఆలస్యంగా వచ్చిన సంగతి తెలియజేయడానికి.



దాసుగారేం సామాన్యులా? ఆరోజు రామాయణం చెబుతున్నారు. వెంటనే సందర్భోచితంగా 'శ్రీరామచంద్రుడు తన అంగుళీయకాన్ని హనుమంతుని కొసంగి సీతకియ్యమని ఆజ్ఞాపించెను' అని ఆ ఉంగరాన్ని మళ్లీ నాయుడిగారికిచ్చారు. చెవులు చిల్లులు పడేలా సభలో హర్షధ్వానాలు మిన్నుముట్టాయి.

అక్కడితో బంధాలన్నీ విముక్తమై ఏకాకిలా మిగిలాను నేను. నా చుట్టు నేనెన్నటికీ తీర్చలేని అప్పు, అంతూదరీ లేని ఏకాకి ఒంటరితనమూ మిగిలాయి.

వీటితో సహవాసం చేస్తూ కాలం గడపసాగాను.

ఆ గడచిపోయిన కాలంలో అమ్మమ్మ, తాతయ్యా కూడా కాలం చేశారు.

పూలమ్మినచోట కట్టెలమ్మలేక నవీన్ తల్లి, నవీన్‌తో సహా హైదరాబాదు వెళ్ళిపోయింది.

కానీ 'మనిషి' ఎన్నో రకాల కష్టాలు చూశాడు, భరించాడు. కాలక్రమంలో అలవాటుపడ్డాడు.

ఎవరైనా అంతే! ఎలాంటి కష్టాలు వచ్చినా నెమ్మదిగా అ...ల... వా...టు... పడిపోతారు.

కష్టాలు వస్తూ ఉంటాయి. పోతూ ఉంటాయి. కొందరు మనుషులు మాత్రం ఆ కష్టాల తాలూకు ఆలోచనలని నిత్యం మోసుకుంటూ తిరుగుతారు.

అధిక శాతం మాత్రం కష్టాల్ని కాలానికి

నాకు మిగిలిన ఏకైక బంధం- మా అక్క లక్ష్మీదుర్గ. సిసలైన భారత స్త్రీలా సంసారంలో మునిగిపోయింది.

★ ★ ★

ఇక ఈ జీవితం యింతే... అప్పులు తీర్చడం కోసం జీవితాంతం యిక్కడే యిలాగే పనిచేస్తూనే కడతేరిపోవాలన్న నిర్లిప్తతతోనే నేను చాలా రోజులు గడిపేశాను.

నేను కలలు కన్నట్లుగా అద్భుతం ఏమీ జరగదనీ, డబ్బు ఎక్కడ్నుంచో రాలిపడ

దనీ, జీవితాంతం ఈ పాలేరుతనం తప్ప దనీ రూఢీగా తెలిసిపోయింది.

అలా అని కలలు కనడం మాత్రం మానలేదు.

వేరేలా కనడం ప్రారంభించాడు.

నా జీవితంలోని విషాదాలకి జాలిపడి మా యాజమాని నన్ను వదిలేసి 'ఎక్కడి కన్నా పోయి హాయిగా బతుకు... పో' అంటాడనీ, ఎక్కడికో వెళ్ళి రాత్రింబవళ్లు కష్టపడి ఎంతో డబ్బు సంపాదించి, గొప్ప వాడ్ని అయిపోతాననీ, మా యజమానికి కృతజ్ఞతా పూర్వకంగా గొప్పమేలు చేసి, మా అక్క అన్యాయం అయిపోవడానికి కారణమైన రాజుగాడ్ని వెతికి వేటాడి తగిన శిక్ష వేయిస్తాననీ కలలు కనేవాడిని.

కొన్నాళ్ళు గడిచేసరికి అవీ జరగవని అర్థమైపోయింది. జీవితాంతం పని చేసే వాడ్ని ఊరికినే వదిలేసేంత విశాల హృదయం ఉండడానికి మా యాజమా నేమీ కథల్లోని పాత్ర కాదు...మామూలు మనిషి.

అక్కడ్నుంచి నా కలల రూటు మళ్లీ మారింది.

ఏ తుపానో, వరదలో వచ్చి మా యజ మాని కుటుంబమంతా ఒకేసారి కడతేరి పోయినట్టు, దాంతో నాకు స్వేచ్ఛ దొరికి విశాల ప్రపంచంలోకి ఎగిరిపోయినట్టూ కలలు కనేవాడిని.

అలాంటి ఆలోచనలు వచ్చినప్పుడు నవీన్ వాళ్ళ నాన్నగారు గుర్తుకు వచ్చే వారు. ఆయనకి డబ్బులు యివ్వవలసిన వారికి జరిగింది అదే కదా. వాళ్ళ అదృష్ట వశాత్తు ఆయన ఆకస్మాత్తుగా చనిపో యాడు. బాకీలు గాల్లో కలసిపోయాయి.

ఒక నిండు కుటుంబం నాశనమైపో యినా, కొందరికి మాత్రం 'మంచే' జరి గింది.

కానీ నాకంతటి అదృష్టం ఉందా? ...

## కొత్తగాలి...

**ఎర్రబస్సు**
**తగలడిపోయింది!**
**ఊరెలా వెళ్ళమంటావు?**

**– దూసి అవిల్,**
బెంగళూరు

మరోపక్క ఇవన్నీ తప్పుడాలోచనలని హెచ్చరించే వివేకం... మన బాగుకోసం ఎవరో చనిపోవాలనీ, కుటుంబమంతా నాశనమైపోవాలనీ కోరుకోవడం ఎంత కరుడుగట్టిన స్వార్థం...

యిలా మంచిగా ఆలోచిస్తున్నప్పుడు మా అక్కలు గుర్తొచ్చేవారు. వాళ్ళ జీవి తాల్తో ఆడుకున్నవారెవరికీ నాలా పాప భీతి లేదు. సానుభూతి లేదు. జాలీ దయా ఏమీలేవు.

ఇద్దరు అమాయకురాళ్ళతో ఆడుకున్న వాళ్ళు ఎక్కడో సుఖంగానే ఉన్నారు. అభం శుభం తెలియనివాళ్ళు బలవన్మర ణాలకి గురయ్యారు.

నా కుటుంబం గుర్తుకురాగానే ఎంతో రోత పుట్టేది నాకు. ఎందుకు అలాంటి మనుషులు పుట్టడం, పెరగడం... వాళ్ళు బాధలు పడటానికా? ..ఇలాంటి వారివల్ల మా యజమానిలాంటి డబ్బున్నవాళ్ళు కాలుమీద కాలు వేసుకుని జీవితాంతం... ఆ మాటకొస్తే తరాలకి తరాలు గడిపెయ్య డానికా? ...

ప్రపంచమంతా ఇంతే... పూటకి గతి లేని వాళ్ళు కూడా పెళ్ళిళ్ళు చేసుకోవడం... అనేకమంది పిల్లల్ని కనేయడం... వాళ్ళ బాధ్యతల్ని మోయలేక వదిలేయడం... వాళ్ళంతా సంపన్నులకు బానిసత్వం చేస్తూ, మూటలు మోస్తూ, బొగ్గు గనుల్లో

కొత్తగాలి...

**కత్తి విసిరితే**
**నెత్తురు**
**పూలగుత్తి విసిరితే**
**అత్తరు**

– ఎం. పెంచల నరసింహం, నెల్లూరు

పనిచేస్తూ, పాయఖానాలు శుభ్రంచేస్తూ, మలమూత్రాలు ఎత్తిపోస్తూ బతికితే... అందులో కొందరు దొంగలుగా, వీధి రౌడీలుగా మారుతూ, అడుక్కుంటూ గడుపుతారు. ఎందుకా బతుకులు... ఎవరు చేసిన పాపాలకి వాళ్ళకా శిక్షలు?

పెళ్ళన్నా, పిల్లలన్నా అప్పుడే నాకు విరక్తి పుట్టేసింది. అన్నివిధాలా కలిగినవాళ్లు, పిల్లల్ని సమర్ధంగా పెంచి, పోషించి, వాళ్ళకి సవ్యమైన దారి చూపించి, వాళ్లని ఉత్తమ పౌరులుగా తీర్చిదిద్దగలిగిన వాళ్లే పిల్లల్ని కనాలి. లేదంటే మానేయాలి.

అయిదు నిమిషాల సుఖం ఫలితంగానో, పిల్లలు లేకపోతే వాళ్ళూ వీళ్ళూ ఏమంటారనో, ఆడపిల్ల కావాలనో, మగపిల్లవాడు కావాలనో మాత్రం... గంపెడు పిల్లల్ని కనకూడదు.

ఆ మాటకొస్తే వంశపారంపర్యంగా రోగాలు వచ్చినవాళ్ళు కూడా పిల్లల్ని కనకపోవటమే మంచిది. అంతగా కావాలనుకుంటే చుట్టూ ఎంతమంది పిల్లలు లేరు... పిల్లల మీద నిజంగా అంత ప్రేమే ఉంటే దాన్ని విశ్వజనీనం చేస్తే ఎంత బావుంటుంది. తనని జీవితాంతం నరక యాతన పెట్టిన రోగాన్ని చూస్తూ చూస్తూ పిల్లలకి తరం నుంచి తరానికి మోసుకుని వెళ్లే తల్లిగాని, తండ్రిగాని ఎంత కరినులు... ఎంత మూర్ఖులు...

అలాంటి ఆలోచనలవల్ల ఎందుకు పెళ్ళి చేసుకున్నారో, ఎందుకు పిల్లల్ని కన్నారో, ఎందుకు కొడుకే కావాలని పట్టుపట్టారో తెలియని నా తల్లిదండ్రుల మీద అసహ్యం వేసేది.

ఒక పెళ్ళి ఆరుగురి జీవితాల్తో ఆటాడుకుంది. అందులో ఎవరికీ సుఖమన్నదే లేకుండా చేసింది.

మా అమ్మానాన్నా ఒకర్నో, యిద్దర్నో కని ఆపేసి ఉంటే వాళ్ళ జీవితాలు, కన్న బిడ్డల జీవితాలూ ఎంత బావుండేవి? కనీసం యిప్పటి దారుణమైన స్థితికన్నా బావుండేది.

నేననేవాడ్ని ఉండేవాడ్ని కాను.

పోనీయ్... ఉండి మాత్రం ఏం ప్రయోజనం? .... ఎవరికి ప్రయోజనం... నేనుండటం వలన? నాకే ఏ ప్రయోజనమూ లేదే...

పెళ్ళి దుర్గక్క జీవితాన్ని నరకప్రాయం చేసింది.

నిత్యం శ్రమించే ఒకచోటి నుంచి మరో చోటికి మాత్రమే అది వెళ్ళింది. పైగా అక్కడ కూలీపనితోపాటు సంసార బాధ్యత కూడా. మొదటి కానుపుకే మనిషి అస్థిపంజరం రూపు దాల్చింది... భర్త పుట్టింటికి పంపిస్తే బెంగపెట్టుకుని జీవచ్ఛవం అయింది. తర్వాత వరస కానుపులతో చీపురు పుల్లల బొమ్మలా అయిపోయింది. బహుశా కరువుదేశంలోని తిండి లేనివాళ్ళు కూడా అంతలా ఉండరేమో...

ఈ పరిస్థితుల మీద అసహ్యం, కోపం. ప్రపంచం ఇలా కాకుండా మరోలా ఉండి ఉంటే బావుండేదన్న కోరిక.. ఈ ప్రపంచాన్ని అందంగా మరోలా మలచుకునేందుకు సాధ్యంకాదా అన్న ఆలోచన.. ప్రతి తల్లి దండ్రులు బాధ్యతగా ఆలోచిస్తే దేశం ఆరోగ్యకరమైన, ఉత్తమ పౌరులతో నిండిపోతుందన్న ఆశ... యివన్నీ నన్ను వెంటాడాయి, వేటాడాయి.

అవన్నీ కాగితం మీద పెట్టేవరకూ అవి

నన్ను వదలలేదు.




**గో**పీచంద్

గ్రంథాలయంలో మొదలైన మా పరిచయం దినదినాభివృద్ధి చెంది బలమైనదిగా మారింది.

మా ఊరి స్కూలుకి కొత్తగా టీచరుగా వచ్చాడతను. ఊళ్ళోనే మకాం పెట్టాడు.

ఉదయం స్కూలుకి వెళ్ళేటప్పుడు సాయంత్రం స్కూలు అయిపోయాకనూ తిన్నగా గ్రంథాలయానికే వచ్చేసేవాడు.

యిద్దరం నిత్య పాఠకులం కావడంవలన చిరునవ్వుల్తో మొదలైన పరిచయం, మొదట పలకరింపులతోనూ, ఆనక సుదీర్ఘ సంభాణలతోనూ సాగింది. సాహిత్యం మీద నాకున్న పట్టునీ, పాటలమీద నా అభిరుచిని, నా పనినీ తెలుసుకుని ఆశ్చర్యంతో నోరు వెళ్ళబెట్టాడతను.

"నిన్ను చూసి ప్రపంచం సిగ్గుపడాలి నేస్తం... ఏ రంగంలో ఉన్నవాళ్ళు ఆ రంగం గురించి సంపూర్ణంగా తెలుసుకోవాలన్నది నా అభిమతం. నేను టీచర్ని. నా పిల్లలకి సరిగ్గా చదువు చెప్పాలంటే నేను బాగా చదవాలి. అందుకే నిత్యం యిక్కడికి వస్తుంటాను. తాము బోధించే అంశం మీద తమకే పట్టులేని సవాలక్ష మంది జీతం కోసం పనిచేసే టీచర్ల మధ్య నన్ను నేను చూసుకుని గర్వపడుతూ ఉంటాను. కానీ జ్ఞాన సముపార్జనకి వృత్తి, ప్రవృత్తుల్తో సంబంధం లేదనీ ఆసక్తీ, నేర్చుకోవాలన్న జిజ్ఞాసా ఉంటే చాలనీ, తీరిక సమయాన్ని చాలా చక్కగా సద్వినియోగం చేయొచ్చనీ, మనిషి నిత్య విద్యార్థి కావాలనీ ఒక్క పరిచయంతో నా గర్వాన్ని పటాపంచలు చేశావు. శభాష్ మిత్రమా శభాష్" అన్నాడు ఆవేశంగా.

ఆ తర్వాత కొంతకాలానికి నేను రాసిన కథలూ, కవితలూ, పాటలూ చదివి తిట్టిన తిట్టు తిట్టకుండా తిట్టాడు.

"ఎందుకు ఇంత టాలెంట్ పెట్టుకుని ఈ పల్లెటూళ్ళో పాలేరుగా పడి ఉన్నావు. వెళ్ళు... నీ టాలెంట్‌కి తగిన గుర్తింపు వచ్చేచోటికి... దాన్ని గౌరవించి నెత్తిన పెట్టుకునే చోటికి వెళ్ళు... దేవుడు నీకు గొప్ప శక్తిని యిచ్చాడు. దాన్ని నువ్వు వృథాగా పాడుచేస్తున్నావు" అన్నాడు.

నా పరిస్థితి మొత్తం వివరించి చెప్పాను.

అంతా విని "కాల్చేకొద్దీ బంగారానికి మెరుపు వస్తుంది. నీ జీవితంలో జరిగిన సంఘటనలు నీలోని రచయితని కాల్చి కాల్చి వన్నెతరగని బంగారంలా మార్చాయి. జరిగిపోయిన దాని గురించి వదిలెయ్. అన్నీ నీ మంచికే అనుకో. అవన్నీ జరగకపోతే నీలో యిలాంటి భావాలు రావు కదా. అందుకే జరిగినదానికి బెంగపడక జరగవలసినదానిని ఉన్నతంగా తీర్చిదిద్దుకో" అన్నాడు.

"కానీ నా అప్పులు తీర్చకుండా నా యజమాని నన్ను ఇల్లు కదలనివ్వడు"

"పారిపో..."

ఉలిక్కిపడి చూశాను అతని వైపు.

"అవును నేస్తం... పారిపో... నువ్వు మాట్లాడొద్దు... నేను చెప్పేది పూర్తిగా విను... సరాసరి మద్రాసు వెళ్ళిపో... సినిమా రంగంలో, పత్రికా రంగంలో

ప్రయత్నించు. నీ ప్రయత్నం ఫలించిందా, యిక్కడ ఏడాదిలో సంపాదించేది అక్కడ నెలలో సంపాదిస్తావ్... అప్పుడు తిరిగి రా... సగర్వంగా నీ యజమానిని కలిసి అప్పు తీర్చేయ్... ఎదగడానికి ప్రయత్నించు మిత్రమా ప్రయత్నించు... ప్రయత్నించడం వల్ల నీకు పోయేదేం లేదు, ఈ బండచాకిరీ నుంచి విముక్తి తప్ప..."

గోపీచంద్ మాటలు నాలో ఉత్సాహాన్ని రగిలించాయి. ఆ వేడిలో ఉండగానే అతను కొంత డబ్బు నా చేతిలో పెట్టి "ఈ రాత్రికే యివన్నీ తీసుకుని వెళ్ళిపో. కావాలంటే పట్నందాకా నేను తోడు వస్తాను" అన్నాడు.

భవిష్యత్తు గురించి నేను కన్న కలలు నిజమయ్యే తరుణం వచ్చిందనుకున్నాన్నేను. యిదే మేలిమలుపు అనుకున్నాను.

మనసునిండా బంగారు భవిష్యత్తు గురించిన ఆలోచనలని 'మాత్రమే' నింపుకుని ఆ రాత్రి నేను ఊరు విడిచాను.

దారిలో రాజమండ్రిదాకా వచ్చినప్పుడూ, అక్కడ మద్రాసుకి రైలు ఎక్కినప్పుడూ... రైల్లో ప్రయాణం సాగుతున్నప్పుడు నా మనసు నిండా గోపీచందే నిండి ఉన్నాడు.

దేవుడు అతని రూపంలో వచ్చాడనీ, అందమైన భవిష్యత్తుకి దారి చూపించాడని అనిపించింది. పదే పదే అతని గురించి తలచుకుంటూ వందలసార్లు కృతజ్ఞతలు తెలుపుకుంటూ ప్రయాణం సాగించాను.

మనసులో మరోపక్క భయం కూడా ఉంది. నా యజమాని నా మీద కోపంతో, నన్ను వెతుక్కుంటూ ఎంత దూరమైనా వచ్చేస్తాడేమో, నన్ను పట్టుకుని లాక్కెళ్ళి జీవితాంతం బండచాకిరీ చేయించుకుంటాడేమోనని ఒకటే కంగారు...

ఆయన అప్పు తీర్చేద్దామనే ఉద్దేశం నాకుందని నాకు తెలుసు. ఆయనకి తెలియదు కదా...అప్పుచేసి, అది తీర్చకుండా, తన దగ్గర పని చేయకుండా పారిపోయాననీ, నమ్మక ద్రోహిననీ తిట్టుకుంటాడు. మనుషుల మీద విశ్వాసం కోల్పోతాడు.

ఈ రోజుల్లో ఎవరికీ సాయం చేయకూడదనీ, ఎవరి చావు వాళ్ళని చావనివ్వాలనీ, రోజులు బాగా మారిపోయాయనీ, పాపం మరీ పెరిగిపోయిందనీ, కలికాలమనీ ఊరందరితోనూ చెప్తాడు.

అందరి దృష్టిలో నేనో దోషిలా అయిపోతాను. ప్రతివారూ పనిగట్టుకుని విమర్శిస్తారు.

అవన్నీ గోపీచంద్‌కి తెలిసినా నోరు తెరవడు.

ఇప్పుడు నేను వెళ్ళే ప్రయత్నం ఫలించిందా సరేసరి. డబ్బు, పేరుతో ఊరిలో తిరిగి అడుగుపెడతాను. సగర్వంగా అందరికీ కనబడతాను. అప్పు తీర్చేస్తాను. నన్ను తెగడిన నోళ్ళే పొగిడేలా ఊరంతా కలకాలం నన్ను గుర్తించుకొనేలా ఊరి కోసం ఏదైనా చేస్తాను.

ఒకవేళ దురదృష్టవశాత్తు నా ప్రయత్నం విఫలమైతే? ... అలా ఊహించడానికే చాలా భయం వేసింది నాకు.

★ ★ ★

గోపీచంద్ ఇచ్చి పంపించిన డబ్బులు నెలకి సరిపోతాయని అతనే చెప్పాడు.

గది తీసుకొమ్మనీ, అడ్వాన్సూ, ఆ నెల అద్దె, తిండీ గిండీ లాంటివంటి వాటికి సరిపోతాయనీ, రెండో నెల ఆఖరికల్లా ఏదో ప్రయత్నం ఫలించేలా చూసుకుంటే సరిపోతుందనీ, మరీ ఇబ్బందయితే ఉత్తరం రాస్తే తాను పంపిస్తాననీ చెప్పాడు.

ఒక చిన్న గది తీసుకుని మకాం పెట్టాను.

ఊరు కొత్త తప్ప పరిస్థితి నాకేం కొత్త కాదు.

ఈ ఏకాకితనం, స్వయంపాకం, మిగతా

ప్రపంచంతో పెద్దగా సంబంధాలు లేకపోవడం... యివన్నీ నాకు బాగా అలవాటు అయినవే.

ఎక్కడో ఉండి హోటల్స్‌లో తినడం కన్నా, గదిలో ఉంటూ స్వయంగా వండుకు తినడమే ఎకానమీ అని గోపీచంద్ ముందే చెప్పాడు.

ఆ గదిలో దిగిన రెండోరోజే నేను రాసిన కథల్ని ఫెయిర్ చేసి పత్రికాఫీసుకి తీసుకెళ్లాను.

అక్కడికి వెళ్ళేటప్పుడు నా మనసులో ఉన్న ఊహ యిదీ...'నా రచన చదవగానే ఎడిటర్ ఫ్లాట్ అయిపోతాడు. వెంటనే ప్రచురణకి స్వీకరించి, నన్ను వేనోళ్ళ పొగడుతాడు. తెలుగు సాహితీ రంగానికి నాలాంటి రచయిత ఒకడు తప్పకుండా ఉండి తీరాలని అంటాడు' అని ఊహించుకుంటూ వెళ్ళాను.

నా మీద నాకున్న నమ్మకం, నా కథల మీద నమ్మకం, గోపీచంద్ నన్ను పొగిడిన వైనం ఆ అభిప్రాయానికి రావడానికి కారణాలు... కానీ వాస్తవం వేరేగా ఉంది.

కథలన్నీ తీసుకున్న ఎడిటర్, "ప్రచురణ విషయం త్వరలో తెలియజేస్తాం. ప్రచురణార్హం కాకపోతే తిప్పిపంపడానికి రిప్లయి కవరు జతచేస్తే పంపిస్తాం" అన్నాడు చాలా మామూలుగా.

"ఒక్కసారి చదివి చెప్తే..." నసిగాను.

"లేదండీ, ఇప్పుడు నేను చాలా బిజీ. బోల్డంత పని ఉంది. ఏ రచన అయినా చదివి ప్రచురణార్హమో కాదో తెలియజేయడానికి టైమ్ పడుతుంది. వెళ్ళిరండి" అన్నాడాయన.

నీరసంగా బయటకి వచ్చేశాను నేను.

తర్వాత సినిమా కంపెనీల చుట్టూ, స్టూడియోల చుట్టూ, దర్శక నిర్మాతల చుట్టూ తిరగడం ప్రారంభించాను.

ఎక్కువ మంది, 'టచ్‌లో ఉండండి. చూద్దాం' అన్నారు.

తక్కువ మంది నా పాటలు చదివి, 'వీలయినప్పుడు తప్పకుండా చూద్దాం' అన్నారు.

పట్టు వదలని విక్రమార్కుడు చెట్టుమీద నుంచి శవాన్ని దింపి శ్మశానం వైపు నడిచినట్టు... పదే పదే నేను ఆయా ఆఫీసుల చుట్టూ తిరగడం.. వాళ్ళు తర్వాత చూద్దాం అనడం...

మరింత బాగా ఏమైనా రాస్తే తొందరగా అవకాశం వస్తుంది కదా అని తెల్లకాగితాల్ని నలుపు చేయడం...

నెల గడిచింది.

ఏ అవకాశమూ రాలేదు.

నాలో ధైర్యం, ఆత్మవిశ్వాసం మాత్రం సన్నగిల్లడం ప్రారంభమైంది. మరోపక్క డబ్బు కూడా అయిపోవచ్చింది.

పరిస్థితులు వివరిస్తూ గోపీచంద్‌కి ఉత్తరం రాశాను.

అంతగా నిరాశ పడిపోవద్దనీ, చేసిన ప్రయత్నం చాలదనీ, మరింతగా ప్రయత్నించమనీ, అవకాశం అంత సులభంగా రాదనీ ఉత్తరం రాసి, కొంత డబ్బు మనియార్డర్ కూడా చేశాడు.

ఆ మనియార్డర్ తీసుకోవడానికి చాలా నామోషీ అనిపించినా తప్పదు గనుక తీసుకున్నాను.

జారిపోతున్న ఆత్మస్థైర్యాన్ని కూడగట్టుకుని మళ్ళీ ప్రయత్నాలు ప్రారంభించాను నేను.

ఎక్కే గడప... దిగే గడప...

అదే పనిగా నెలరోజులు గడిపాను.

ఊహూ... ఫలితం ఏమీ కనిపించలేదు.

నిత్యం అర్ధాకలి... బెంగ... భయం... ఆందోళన... నిద్రలేమి... నీరసం...

గోపీచంద్ పంపించిన డబ్బు పూర్తిగా అయిపోయింది.

# ఆ పిల్లీ ఎలుకల కథా కమామిషు

సింహం గర్జిస్తే ఏమవుతుందన్న ప్రశ్నకి ఎంజిఎం సినిమా మొదలవుతుందనే జవాబు ప్రసిద్ధి. ఎంజిఎం లోగోలో పిల్లి కూడా ఉండటం తక్కువ మందికి తెలుసు. ఆ లోగోలోని పిల్లి మ్యావ్ అనగానే ఎంజిఎం కార్టూన్ సినిమా మొదలవుతుంది.

ఎంజిఎం 1944-58 వరకు 152 కార్టూన్ సినిమాలను రూపొందించింది. ఒక్కోదాని నిడివి పది నిముషాలు. వీటికి టెక్నీషియన్స్ మారకుండా పని చేశారు. జోసెఫ్ బార్బరా, విలియం హన్నా అనే ఇద్దరు కథని అందించడమే కాక, వాటికి కలిసి దర్శకత్వం కూడా వహించారు. స్కాట్ బ్రాడ్లీ వీటన్నిటికీ నేపథ్య సంగీతాన్ని సమకూర్చాడు. కార్టూన్ సినిమాకి సంగీతం ఎలా ఉండాలో బ్రాడ్లీనే ఊహించి, సమకూర్చి ఇతరులకు మార్గదర్శి అయ్యాడు.

ఈ కార్టూన్ సినిమాల్లో టామ్ అనే పిల్లి, జెర్రీ అనే ఎలుక ప్రధాన పాత్రలు. ఓ ఇంట్లో నివసించే టామ్ ఆ ఇంట్లోనే వున్న జెర్రీని వెంటాడి వేటాడడం, జెర్రీ తెలివిగా తప్పించుకుని పిల్లిని ఎదుర్కోవడం వీటన్నిటి థీమ్. వేటాడే సన్నివేశాలకి స్కాట్ బ్రాడ్లీ అందించిన నేపథ్య సంగీతంలో కామెడీ, సీరియస్‌నెస్ మేళవించి ఉంటాయి.

ఈ కార్టూన్ సినిమాలకి చిత్రకారులుగా అరడజను మంది పనిచేశారు. విలియం హన్నా ఒకప్పటి క్లాస్‌మేట్ అయిన ఇర్విన్ స్పెన్స్ వారిలో ఒకరు. అతడు మొత్తం 57 కార్టూన్ సినిమాలకు పని చేశాడు. 1909లో పుట్టిన అతడు సెప్టెంబర్ 1995లో టెక్సాస్‌లోని డల్లాస్‌లో మరణించాడు. 1943లో అకాడమీ అవార్డు 'యాంకీ డూడిల్ మౌస్'ను పొందిన బెస్ట్ యానిమేటెడ్ పార్ట్‌కి అతడు పని చేసాడు.



కెన్నెత్ మ్యూస్ పదిహేడేళ్ళ పాటు 58 కార్టూన్ సినిమాలకి చిత్రకారుడుగా పని చేసాడు. ఆఖరి కార్టూన్ సినిమా 'టాట్ వాచెర్స్'కి అతను పని చేసాడు. బ్యాక్‌గ్రౌండ్ చిత్రించడంలో దిట్ట.

చిత్రకారుడు జాక్ జాందర్ తొలి చిత్రం నుంచి, చివరి చిత్రందాకా మొత్తం 114 కార్టూన్ సినిమాలకు పని చేసాడు. ఇతను 99 ఏళ్ళు జీవించి డిసెంబర్ 2007లో మరణించాడు.

ఇంకా రే పాటర్సన్, పీటిబర్న్బు మార్లల్ కెన్నెత్, టామ్ రే, డాన్ టేస్‌లేలు కూడా వీటికి చిత్రకారులుగా పని చేసారు. ఈనాటికీ ప్రపంచమంతటా టీవీలో వీటిని ప్రదర్శిస్తున్నారు. ముప్పై కోట్ల మంది సినిమా థియేటర్‌లో చూశారని అంచనా.

1986లో విండ్సర్ మేక్‌లీ అవార్డుని ఇంటర్నేషనల్ యానిమెటెడ్ సొసైటీ నుంచి ఈ టీమ్ అందుకుంది. ఎనిమిది కార్టూన్ సినిమాలకి అకాడమీ అవార్డులు లభించాయి. అయితే నిర్మాత ఫ్రెడ్ క్వింబీ వాటిని స్వీకరించాడు తప్ప దర్శకులైన జోసెఫ్ బార్బరా, విలియం హన్నాలని ఏ ఒక్కసారి స్టేజ్ మీదకి పిలవలేదు.

టామ్ అండ్ జెర్రీలతో పాటు బాతు, కుక్క, మెకాల్ అనే పిట్ట మొదలైన పాత్రలు కూడా ఈ కథల్లో చోటు చేసుకున్నాయి. మనకి 'మాయాబజార్' అంటే ఎంత ప్రీతో, అలా అమెరికన్స్‌కి 'టామ్ అండ్ జెర్రీ' అంటే అంత ప్రీతి- వాల్ట్‌డిస్నీ మిక్కీమౌస్‌తో సమానంగా టామ్ అండ్ జెర్రీలు అభిమానాన్ని చూరగొన్నాయి.

నాలోని ధైర్యం అడుగంటిపోయింది.

మళ్ళీ అతనికి రాసి డబ్బు తెచ్చుకోవడా నికి ఆత్మాభిమానం అడ్డొచ్చింది. అయినా అతను మాత్రం ఎన్నాళ్ళని... ఎంతని పంపిస్తాడు...

ఆ రోజు వరకూ అస్పష్టంగా సుడులు తిరుగుతున్న ఆలోచనలు ఆరోజు స్పష్టంగా రూపుకట్టాయి.

హాయిగా ఉన్నవూళ్ళో ఉంటున్నవాడిని యిక్కడికి అనవసరంగా వచ్చాను. లేని పోని కష్టాలు కొనితెచ్చుకున్నాను. మిగతా వన్నీ ఎలా ఉన్నా తిండికీ నిద్రకీ లోటులే దక్కడ. ఉండటానికి యిల్లుంది. దానికి నెలనెలా అద్దెకట్టనక్కరలేదు. ఆ పల్లె టూళ్ళో యిక్కడిలా ప్రతిదీ డబ్బుతోనే కొనక్కరలేదు.

ఏమయిందిక్కడ? చాలీచాలని జీవితం యిది... ఉడికీఉడకని అన్నం... రుచీపచీ లేని కూర... యిరుకు గది... చింకి చాప... చిరిగిన దుప్పటి... దోమలు... ఒంటరితనం... ఎవ్వరూ తెలియని... నన్నెవరూ పలకరించని ఏకాకితనం...

ఆత్మాభిమానాన్ని చంపుకుని, చీదరించు కుంటున్న వాళ్ళని నా టాలెంట్‌ని గుర్తిం చమనీ, అవకాశం యిమ్మనీ బతిమాలుకో వడం.. చుట్టూ అంతా నావంక వింతగా చూడడం...

ఆ రాత్రంతా ఏడుస్తూ కూర్చున్నాను. నిద్రలేదు.

మర్నాడు గదిలోంచి బయటకు కూడా అడుగు పెట్టలేదు. నా చుట్టూ నన్ను వెక్కిరిస్తున్నట్టున్న నా రచనలు...

మరోవైపు పేగుల్ని కొరికేస్తున్న ఆకలి.. జేబులో పైసాలేదు.

అత్యంత బరువుగా ఆ రోజు కూడా గడి చిపోయింది.

అప్పటికి నాకు తెలియదుగానీ డిప్రెషన్ నన్ను పూర్తిగా వశం చేసుకుంది. ఆత్మ హత్య చేసుకున్న నా అక్కలూ, ఇంకా చాలామంది జనమూ నా మదిలో తిర గడం మొదలు పెట్టారు. సూయిసైడ్ ఇన్ స్టింక్ట్ నాలో ప్రవేశించింది. ఎందుకు బత కాలన్న ప్రశ్న మొలకెత్తింది. ఎవరికోసం? అన్న ప్రశ్నకి సమాధానం లేదు. ఏదైనా అవకాశం వస్తుందన్న నమ్మకం ఎలాగూ లేదు.

మర్నాడు ఉదయానికి అవన్నీ స్పష్టమైన నిర్ణయాలుగా రూపుదిద్దుకున్నాయి.

లోపల ఆకలి... అవిశ్వాసం... అపన మ్మకం... ఆత్మన్యూనత...

బయటికి- కనుకొలనుల్లో నిలిచిన కన్నీరు...

జీవితంలో ఎన్నడూ లేనిది ఆ రోజు ఆత్మహత్య చేసుకోవాలన్న నిర్ణయం నాలో మొలకెత్తింది. నా కుటుంబంలో యిద్దరు అలా చనిపోయారు. నేను మూడోవాడ్ని అవ్వాలని రాసిపెట్టి ఉంది. అందుకే రాజు లపూడి వదిలి మద్రాసు వచ్చాను... అను కున్నాను.

లేకపోతే ఎక్కడి నేను... ఎక్కడి గోపీ చంద్... ఎక్కడి మద్రాసు...

ఏ మూలనుంచో విజ్ఞత, "వద్దు... ఆత్మ హత్య చేసుకోవద్దు" అంటూనే ఉన్నది. మరోపక్క ఊర్లో మూసుకుపోయిన దారులు... యిక్కడ తెరచుకోని ఉపాధి అవకాశాల ద్వారాలు...

బలవన్మరణాలు పొందిన మా అక్కల దగ్గరకే... జీవితంలో ఏదీ సాధించకుం డానే.. ఏదీ అనుభవించకుండానే... రాలి పోయిన మా అమ్మానాన్నల దగ్గరకే వెళ్ళి పోవడానికి నిశ్చయించుకున్నాను.

మరోసారి అవకాశం కోసం ప్రయత్నిం చడానికి కూడా నాకు ఓపిక లేదు.

నేను కూడా మా అక్కల లాగానే ఉరి వేసుకోవాలని నిర్ణయించుకుని తాడు కోసం చూశాను.

గదిలో ఎక్కడా లేదు. కొనడానికి డబ్బులు కూడా లేవు. ఏదో వంక పెట్టి ఇంటివాళ్లని అడగాలి. లేదా బయట ఎక్కడైనా దొరుకుతుందేమో ప్రయత్నించాలి. ఆ ఉద్దేశంతో బయటికొచ్చిన నాకు నేనుండే యింటి బయట ఒక బిచ్చగాడు తను ముష్టెత్తుకుని తెచ్చుకున్నది కూర్చుని తింటున్నాడు.

నేను రాసి పొట్టపోసుకునే నా అక్షరాల మీద ఒట్టు... ఆ క్షణం వాడు తినేదాన్ని చూసి నాకు నోట్లో నీళ్ళూరాయి.

కనీసం అడుక్కుని తినడానికి కూడా నేను పనికిరానన్న నిజం నా చావు కోసం తొందరపెట్టింది.

నా ఆకలిని గమనించి ఆ బిచ్చగాడు ఒక ముద్ద పెట్టకూడదా అని పదేపదే అనుకున్నాను.

నేను బతకడానికి గుప్పెడన్నం దొరికినా నేను చావాలనుకోనుకదా, బతికే ఉందును కదా అనిపించింది.

మనిషి పుట్టేటప్పుడే వాడికందవలసిన అన్నం మెతుకుల మీద వాడి పేరు రాసి పెడతాడట దేవుడు. నా పేరు రాసున్న మెతుకులు అయిపోయాయి.

అందుకే ఆకల్తో.. ఖాళీ కడుపుతో ఆత్మహత్య చేసుకోవాల్సి వస్తోంది.

మామూలుగా మెతుకులు అయిపోయినప్పుడు దేవుడే మనిషిని తీసుకుని పోతాడు కదా... మరి నేనేంటి బలవంతంగా చావుని వెతుక్కుంటూ వెళ్ళవలసి వస్తోంది? ...

నిజంగా బలవంతంగా చావడం ఎంత బాధాకరం?

మృత్యువు కొన్నిక్షణాల దూరంలో నిలిచి ఉందని తెలియడం ఎంత భయంకరం? ... మరి ఆత్మహత్యలు చేసుకునే వాళ్ళందరూ ఎలా చేసుకోగలుగుతున్నారు. మృత్యువుకన్నా జీవితమే వాళ్ళని భయపెడుతుంది గనుకా? బాధామయ

## కొత్తగాలి...

**తల పొలం**
**దుక్కి దున్నే**
**నాగలి**
**దువ్వెన**

— కొలకలూరి ఇనాక్, హైదరాబాద్

మైన జీవితంకన్నా మృత్యువు ఒడే హాయి కదా అనుకుంటారు గనుకా?

ఆత్మహత్యలు పాపమనీ, నేరమనీ ఒడ్డున నిలబడి కబుర్లు చెప్పడం ఎంత హాయి? ఎంత సులువు?

దిగేవాడికి తెలుస్తుంది లోతు... పడేవాడికి తెలుస్తుంది బాధ...

మామూలుగా ఎంతో సున్నితంగా, సుకుమారంగా ఉండేవాళ్ళు, చిన్నగా గోరు గీసుకుంటేనే బాధపడిపోయేవాళ్ళే ఎక్కువగా ఆత్మహత్యలు చేసుకుంటారు. ఎక్కడ్నుంచి వచ్చేస్తుంది వాళ్ళకంత ధైర్యం? నిజంగా చావడానికి ఎంత ధైర్యం కావాలి?

ఏదేమైనా ఆత్మహత్య చేసుకోవడం అన్నది బాధాకరమైన అనుభవమే. అయితే ఆ అనుభవం తర్వాత యింకేమీ ఉండదన్న నమ్మకమే చాలామందిని అటు వైపు దృష్టి సారించేలా చేస్తుంది.

ఈ లోకంలో రోజూ ఎంతోమంది చనిపోతున్నారు.. ఇంకా యింకా బతకాలనుకొనేవాళ్ళు... బతకడానికి ఏ లోటూ లేని వాళ్ళు... ప్రపంచానికి ఉపయోగపడే మేధావులు... శాస్త్రవేత్తలు... దేశనాయకులు... ఎలాంటి అభం శుభం తెలియని పసిపాపలు...

అంతమందికి వద్దన్నా వస్తోన్న చావు నాకెందుకు మామూలుగా రాదు? నడుస్తూ నడుస్తూ ఉన్నవాణ్ణి యిలాగే ప్రాణాలు వదలగలిగితే ఎంత బావుంటుంది?

అదే లోకంలోని విషాదం... నిజంగా చావాలనుకునేవాడికి చావురాదు. వాడే వెతుక్కుంటూ వెళ్ళాలి. ఈలోగా ఆ చావు యింకా బతకాలి అనుకున్నవాడి దగ్గరకి వెతుక్కుంటూ వెళ్ళిపోతుంది.

...ఆలోచనల్లో పడి చాలా దూరం వచ్చేశాను.

ఒకచోట రోడ్డుకటూయిటూ ఉన్న చెట్లలో ఒకదానికి ఒకతాడు కట్టి ఉంది. లావూ పొడవూ సరిగ్గా సరిపోతుంది.

ఆ చెట్టు కాస్త పొట్టిగా ఉంటే దానికే ఉరి వేసుకుని చనిపోయేవాడినేమో. కానీ అది చాలా పెద్ద చెట్టు.

తాడు మాత్రం విప్పుకుని మళ్ళీ నడక సాగించాను.

ఆకల్తో, నీరసంతో, ఉండటం వల్ల కాళ్ళు గాల్లో తేలిపోతున్నట్టుగా ఉన్నాయి. అంత దూరం నడక తాలూకు నొప్పి కూడా మొద్దుబారిన నా మెదడుకు తెలియలేదు.

దాన్నిండా ఆత్మహత్యకి సంబంధించిన ఆలోచనలే.

నా గత జీవితం గురించిన సమీక్షలూ...

నా కుటుంబం, అమ్మమ్మ ఊరూ, వాళ్ళ యిల్లూ, నవీన్ వాళ్ళ యిల్లూ, నా యజమానీ, నేను చదివిన పుస్తకాలూ, అవి రాసిన రచయితలూ, నేను విన్న పాటలూ... మా పెద్దక్క మరణానికి కారకుడైన అజ్ఞాతి, బుజ్జక్కని మోసం చేసిన రాజుగాడూ... ఆమె రాసిన ఉత్తరం...

మా అమ్మ... మా నాన్న...

ఎక్కడుండి ఉంటారు వాళ్ళు?... పై లోకంలో ఉండి నన్ను చూస్తూ ఉండుంటారా?... మా అమ్మ బాధపడుతూ ఉంటుందా? మా నాన్న పశ్చాత్తాప పడుతూ ఉంటాడా?...

వద్దు... చచ్చిపోవద్దు అంటూ మనకి వినిపించని శబ్దాల్తో, మనకి అర్థంకాని

భాషతో అరుస్తూ ఉంటారా? ...

మనిషిని సృష్టించేది దేవుడనీ, ఆయనే వాళ్ళ తలరాతలు రాసి భూమి మీదకి పంపుతాడనీ అంటారు కదా... దేవుడు తన చేత్తో తనే ఈ మనిషి ఆత్మహత్య చేసుకోవాలి అని రాస్తాడా? .. సృష్టించే బాధ్యతని తను తీసుకొని మరణాన్ని నిర్దే శించుకునే హక్కుని మనిషికి యిచ్చేస్తా డా? ... అలా అయితే చిరంజీవిలా చిర కాలం ఉండిపోవాలనుకునే ఏ మనిషి కోరి కనూ ఎందుకని నెరవేర్చడు? ...

దాదాపు అన్ని పక్షుల జీవితాలు ఒకేలా ఉంటాయి. అన్ని జంతువుల జీవితాలు ఒకేలా ఉంటాయి. మొక్కల జీవితాలు ఒకేలా ఉంటాయి.

మరి, మనుషుల్లో మాత్రమే ఎందుకీ తేడాలు? ఎందుకీ హెచ్చుతగ్గులు?

మనిషి సుఖంగా మనుగడ సాగించడం కోసం నిర్మించుకున్న నాగరికత, అభివృద్ధి చెందేకొద్దీ ఎందుకు మనుషుల జీవితాలు క్లిష్టంగా మారిపోతున్నాయి? ... అంతరి క్షంలోకి సైతం అడుగుపెడుతున్న మాన వుడు ఎందుకు పక్కవాడి మనసులోని బాధని అర్థం చేసుకొని తొలగించలేకపోతు న్నాడు? ఎందుకు ఆత్మహత్యల్నీ, హత్యల్ని జరగకుండా ఆపలేకపోతున్నాడు?

ఆలోచిస్తూ ఆలోచిస్తూ గది దగ్గరకి వచ్చేశాను.

బిల్డింగ్ ఓనర్‌ని స్టూల్ అడిగి తీసుకొని గదిలోకి అడుగుపెట్టాను. గది తలుపు గడియపెట్టి, కిటికీలు మూసేసి, స్టూలు ఎక్కి దూలానికి తాడుని కట్టాను. కిందికి జారిన తాడుని మెడ పట్టేలా లూజు ముడివేశాను.

లోలోపల్నించి దుఃఖం తన్నుకొస్తున్నా ఆలోచనల వేడికి ఆవిరైపోతున్నట్టు బయ టికి చుక్క కూడా రావడం లేదు.

భరించలేనంతటి వేదన నన్ను ముంచె త్తుతుంటే.. తలని ఆ ముడిలో పెట్టాను.

కాలితో బలంగా స్టూలుని తన్నబోతుం డగా... తలుపు తట్టిన చప్పుడు... 'పోస్ట్' అన్న కేక...

అది వినగానే నా మదిలో మెదిలిన మొదటి ఊహ- గోపీచంద్ ఏమైనా ఉత్తరం రాశాడేమోనని...

ఆc! యిప్పుడు అవన్నీ అవసరమా అని పించి, మళ్ళీ ఆ ముడిలో తల దూర్చాను.

మళ్ళీ తలుపుని బాదుతున్న చప్పుడు... మళ్ళీ కేక...

ఇంటి యజమానురాలు బయటికొచ్చిన ట్టుంది... కొంచెం నిశ్శబ్దం తర్వాత "ఇప్పుడే స్టూలు తీసుకొని లోపలికెళ్ళాడే" అని ఆవిడ మాటలు.. "అబ్బాయ్..." అంటూ ఆవిడ పిలుపు.

కంగారు కంగారుగా తాడు విప్పేసి మూలకి విసిరేసి, స్టూలు ఒక పక్కగా పెట్టి, తలుపు తీశాను.

పోస్ట్‌మాన్ తెచ్చింది ఉత్తరం కాదు.

మనియార్డరు.

నేను రాసిన కథని స్వీకరించిన పత్రిక, ప్రచురణ అయిన సంచిక వివరం రాస్తూ పారితోషికంగా పంపిన మనియార్డరు...

★ ★ ★

ఆ పత్రికలో వచ్చిన కథ నాకు కొంత ఉపయోగకరం అయింది. ఆర్థికంగా మాత్రమే కాదు. పాటలు రాస్తానంటూ సినిమావాళ్ళ చుట్టూ తిరిగేటప్పుడు దాన్ని చూపించడానికి నాకంటూ ఒకస్థాయి కల్పించిన ప్రచురణ అది.

ప్రయత్నించగా ప్రయత్నించగా ఒక సిని మాలో పాటలు రాసే అవకాశం వచ్చింది.

అయితే అవకాశం రావడం ఆలస్య మైనా, నా ప్రయత్నాల్లో ఎన్నోసార్లు విఫ లమైనా ఈసారి నీరసం లేదు. ఆత్మన్యూ నత లేదు.

ఆ మనియార్డరు అంతలా నాలో ఆత్మ

విశ్వాసాన్ని నింపింది. 'బతకలేకపోను, ఏదో విధంగా' అన్న నమ్మకాన్ని కలిగిచింది.

ఆత్మహత్య ప్రయత్నాలు పక్కన బెట్టి కథ ప్రచురణ విషయమూ, పాటలు రాసే అవకాశం వచ్చిన విషయమూ గోపీచంద్‌కి ఉత్తరంలో రాశాను.

ఎంతో సంతోషాన్ని వెలిబుచ్చుతూ జవాబు రాశాడతను.

'నిశీధులే నిను మూగినా
ఉషస్సువై ఎదురేగుమా
తుపానులే అణిచేసినా
చిరుమొలకవై తల ఎత్తుమా'
అన్నది నా తొలిపాట.

బతకడానికి కావాల్సినంత ధైర్యాన్ని, దాంతోపాటు డబ్బును యిచ్చిన పాట. నాతో పాటు మరో యిద్దరు రచయితలు రాసారు ఆ సినిమాకి పాటలు.

పాటలు పెద్ద హిట్ అయ్యాయి.

దురదృష్టవశాత్తు సినిమా ఫ్లాప్ కావడం వల్ల నాకు గుర్తింపు రాకుండా పోయింది.

మళ్ళీ ప్రయత్నాలు...

తినడానికీ, ఉండటానికీ ఉన్నది చాలనుకుంటూనే మరింత ఉన్నతమైన జీవితం కోసమూ, అప్పు తీరిపోవడానికి తగినంత డబ్బు కోసమూ ప్రయత్నాలు.

చిత్రంగా నేను ఆశించిన దానికన్నా ఎక్కువగానే సంపాదించగలిగాను.

డబ్బునే కాదు, పేరుని కూడా.

కాస్త నిలదొక్కుకున్నాక ఊరు వెళ్ళాను.

యజమానిని క్షమాపణలు అడిగి అప్పు తీర్చేశాను. అక్కకి కొంత డబ్బు యిచ్చాను.

గోపీచంద్‌కి వేల వేల కృతజ్ఞతలు చెప్పుకున్నాను. ఊళ్లో అతడి పేరున విద్యాలయం కట్టించాను. డిగ్రీ వరకూ అక్కడ ఉచిత విద్య నేర్పిస్తారు, గోపీచంద్ ఆధ్వర్యంలో.

ఏ రంగంలో వాళ్ళు ఆ రంగం గురించి క్షుణ్ణంగా తెలుసుకోవాలన్న గోపీచంద్ మాటల ప్రకారమే నిత్య విద్యార్థిగా ఉండటం వల్లనే అనతి కాలంలోనే నేను నెంబర్‌వన్ పాటల రచయితని కాగలిగాను.

కొన్ని వందల పాటలు, అద్భుతమైన పాటలు, రాష్ట్రం నలుమూలలా వినిపిస్తుండే, గర్వంతో నేను ఉప్పొంగిపోయే పాటలు రాశాను. జీవితం హాయిగా చక్కగా సాగిపోతోంది.

అలాంటి రోజుల్లో చిననాటి స్నేహితుడు నవీన్ గురించి తెల్సిన నిజం మళ్ళీ నన్ను పాత రోజుల గురించీ, నా ఆత్మహత్య ప్రయత్నం గురించీ ఆలోచించేలా చేసింది.

తల్లితో సహా హైదరాబాద్ చేరిన నవీన్, ఊహించని విధంగా ఎదురుదెబ్బ కొట్టిన జీవితాన్ని తలచుకొని, తలచుకొని కుమిలిపోయి, భూమికి భారంగా పడి ఉండటం తప్ప ఎందుకూ పనికిరాని తను ఎందుకు బతికుండాలనుకుని ఆత్మహత్య చేసుకోవడానికి ప్రయత్నించాడు.

అయితే ఆ ప్రయత్నంలో దారుణంగా విఫలమయ్యాడు.

విషం తాగి చావాలనుకున్న అతడి కోరిక నెరవేరలేదు. విషం ప్రభావం వల్ల కాళ్లూ చేతులూ చచ్చుబడిపోయి జీవచ్ఛవంలా తయారయ్యాడు.

తల్లికి మరింత భారమయ్యాడు.

ఆ విషయం గురించి ఆలోచించినప్పుడు నేను చేసిన ప్రయత్నం కూడా గుర్తొచ్చేది. ఆరోజు పోస్ట్‌మ్యాన్ రావడం ఒక్కక్షణం లేటయితే? ఈ జీవితం, ఈ పేరు ప్రతిష్ఠలు, ప్రజలని అలరించే పాటలు... యివేవీ ఉండకపోయేవి కదా అనిపించేది.

నేను చచ్చిపోతే నన్ను నమ్మి గది యిచ్చిన ఆ ఇంటి యజమానికి ఎంత యిబ్బంది? నన్ను పంపించిన గోపీచంద్‌కి

**కొత్తగాలి...**

**అమ్మాయి కావాలి**
**అమ్మలా ఆదుకోటానికి**
**అమ్ముడుపోయిన అబ్బాయి**
**అలిసిగలో కలికితురాయి**

– వి.రాఘవేంద్రరావు, హైదరాబాద్

ఎంత మానసిక వేదన? మిగిలిన నా ఏకైక అక్కకి ఎంత యాతన? ...

మరో విషయం కూడా అప్పుడే అర్థమైంది నాకు.

ఏదైనా సమస్య వచ్చినపుడు నా తల్లిగానీ, నవీన్ వాళ్ళమ్మగానీ ఆత్మహత్యకి ప్రయత్నించలేదు. తన రెక్కల కష్టాన్ని నమ్ముకుని ముందుకు సాగిపోయింది మా అమ్మ.

విశాలమైన ప్రపంచంలో బతుకు తెరువుని వెతుక్కుంటూ వెళ్ళిపోయింది నవీన్ తల్లి.

మేమే... మా తరం వాళ్ళమే ప్రతిదానికీ బెంబేలు పడిపోయి ఆత్మహత్య చేసుకోవాలని తొందరపడినది...

నాకన్నా ముందరి తరాలకి సమస్య జీవితంకన్నా చాలా చిన్నదనీ తెలుసు. సమస్య జీవితమంత పెద్దది కాదనీ వారు గ్రహించారు.

సమస్యలు చుట్టుముట్టినప్పుడు వాటిని వదిలించుకుంటూ బతకడం కోసం ప్రయత్నించడంలో కనీసం బాధ, హాయి లాంటివేవో ఉన్నాయనీ, ఆత్మహత్య చేసుకుంటే అసలు 'ఏమీ' ఉండవనీ వాళ్ళకి తెలుసు. అందుకే వాళ్ళు ఎప్పుడూ బతకడానికే ప్రయత్నించారు, చావడానికి కాదు.

ఏ అవయవమూ పనిచేయక, మంచం మీద పడిన నాడు మాత్రమే వాళ్ళు, 'నన్నింకా తీసుకుపోవేం దేవుడా' అని ప్రార్థించేవాళ్ళు.

బహుశా భారతీయ వేదాంతమూ, కర్మ సిద్ధాంతమూ, దైవం మీద విశ్వాసమూలాంటివి వారికి ఉపకరించి ఉంటాయి. కౌన్సిలింగ్‌లాగా అవి పనిచేసి ఉంటాయి.

ఇలాంటి వాటికి పూర్తిగా దూరమైన తరం చాలా చిన్న సమస్యలకీ కాస్త యిబ్బందిపడినా, పరిష్కారమైపోయే సమస్యలకీ ఆత్మహత్యలకి పాల్పడటం నన్ను ఆలోచింపజేసింది.

తొందరపాటు వలన మంచి జీవితాన్ని కోల్పోబోయిన నా అనుభవం ఆధారంగా నేనో రచన చేయడానికీ, దాని ద్వారా కనీసం కొంతమందైనా ఆత్మహత్యలకి పాల్పడకుండా చేయగలిగితే చాలనీ నిశ్చయించుకున్నాను.

అయితే వృత్తిపరమైన బిజీవల్ల ఆ పని చాలాసార్లు వాయిదా పడింది.

ఈలోగా నాకు జాతీయ అవార్డు వచ్చింది. ఆ సందర్భాన్ని పురస్కరించుకుని ఈ పుస్తకాన్ని వెలువరించాను.

నా ప్రయత్నం నెరవేరితే, ఈ పుస్తకం వల్ల కనీసం ఒకరైనా జీవితం పట్ల ఆశని పెంచుకుంటే, ఆత్మహత్య మానుకుంటే నాకు అంతే చాలు.

అంతిమంగా నేను చెప్పేది ఒక్కటే.

జీవితం చాలా గొప్పది. మళ్ళీ మళ్ళీ దొరకనిది. ప్రపంచం చాలా విశాలమైనది. అవకాశాలకి లోటులేనిది.

ఆత్మహత్య మహా పాపం. చట్టరీత్యా నేరం. పైపెచ్చు అది దైవధిక్కారం. ఆశావాదం గొప్పది.

ఉన్నతమైన కలలు కనేవాడే గొప్పవాడు. ఆ కలల్ని నిజం చేసుకోవడానికి 'సరైన ప్రయత్నం' చేసినవాడే నిజమైన మనిషి.

'నందోరాజో భవిష్యతి' అనుకున్నవాళ్ళు 'ఏమో గుర్రం ఎగరావచ్చు' అని ఆశపడిన

వాళ్ళూ బాధపడినట్టు, ఆశాభంగం చెందినట్టు చరిత్రలో లేదు.

నేడు ప్రముఖులూ, ఉన్నత స్థానాల్లో ఉన్నవాళ్ళూ అయిన చాలామంది జీవితాలు వడ్డించిన విస్తర్లు కావు.

ఎన్నెన్నో వైఫల్యాల తర్వాతనే వాళ్ళు విజయపు మెట్లని అధిరోహించగలిగారు.

ఎన్ని కష్టాలు పడినా, ఎంత బాధ అనుభవించినా, ఎన్ని వైఫల్యాలని ఎదుర్కొన్నా... అవన్నీ ఒక్క విజయం తర్వాత తీపి జ్ఞాపకాలుగా మారిపోతాయి.

నిజానికి తేలిగ్గా వచ్చిపడే ఏ విషయమూ మనిషికి సంతృప్తిని ఇవ్వదు. పైగా అక్కడితో రిలాక్స్ అయ్యేలా చేసి యింక పైకి ఎదగనివ్వదు.

కష్టమొక్కటే మనిషిని రాటుదేలుస్తుంది. వరుస వైఫల్యాలే మనిషిలో కసిని పెంచుతాయి. ఆ తర్వాతొచ్చే విజయాన్ని తనివితీరా ఆస్వాదించేలా చేస్తాయి.

నిరాశ అనే చీకట్లని పారద్రోలే ఆశ అనే వెలుతురు అందరి జీవితాల్లోనూ ప్రసరించాలని కోరుకుంటూ...

- సమాప్తం -



**పు**స్తకం మూసిన అశోక్ గట్టిగా నిశ్వాస వదిలాడు. అది యిదీ అని స్పష్టంగా చెప్పలేని ఒక భావం అతన్ని పట్టుకుని ఊపేస్తోంది.

చాలా మందిలాగానే అతడు కూడా అప్పటి వరకూ తనలాంటి కష్టాలు ఎవరికీ లేవు, రావు అనుకుంటూ ఉన్నాడు.

ఇంకా దారుణమైన కష్టాల్నే అనుభవించినవాళ్ళూ, అనుభవిస్తోన్నవాళ్ళూ మన చుట్టూనే ఉన్నారన్న సంగతి తెలుసుకోలేకపోయాడు.

ఇప్పుడు విరించి కథ చదివాక తనదసలు కష్టమే కాదనుకుంటూ ఉన్నాడు. ఆయన కూడా తనలా ఆలోచిస్తే ఎన్ని సార్లు ఆత్మహత్యలు చేసుకోవాలి? ఎంత దారుణమైన అనుభవాలు ఆయనవి? ... ఎంత దుర్భరమైన బాధ ఆయనది? ...

ఆలోచనలు ఆపి పక్కకి చూశాడు.

మిగతావాళ్లు గాఢంగా, హాయిగా నిద్రపోతున్నారు.

మెల్లగా లేచి బయటకొచ్చాడు అశోక్.

పిట్టగోడ దగ్గరకి నడిచి కిందికి చూశాడు.

చీకట్లో అక్కడక్కడా మిణుగురు పురుగులా మిణుక్కుమంటూ కనిపిస్తోంది హైదరాబాద్ మహానగరం.

చల్లగా గాలి వీస్తోంది.

ఒంటరి చంద్రుడు గూర్ఖాకి మల్లే గస్తీ తిరుగుతున్నాడు.

ఇంత పెద్ద నగరంలో బాధలు లేనివాడు ఎవ్వడు?

మరణమే లేని ఇంటినుంచి గుప్పెడు ఆవాలు తెస్తే మనిషిని తిరిగి బతికిస్తానన్నాడట బుద్ధుడు, చనిపోయిన వ్యక్తి గురించి ఎవరో ఏడుస్తూ ఉంటే.

మరణంలేని, దుఃఖం లేని ఇల్లూ, జీవితాలు ఎక్కడ? ...

అసలు ఎంత అదృష్టవంతులం మనం...

మనం చూపు పోగొట్టుకున్నవాళ్లం కాదు.

మనకి కాళ్లూ చేతులూ సవ్యంగా ఉన్నాయి.

హిరోషిమా, నాగసాకీల లాగా మన నగరాలమీద ఎన్నడూ అణుదాడి జరగ లేదు. దాని తాలూకు దుష్ఫలితాలని తరాల తరబడి అనుభవించడం లేదు.

భోపాల్‌లాగా గ్యాస్ బాధితులం కాము మనం.

సోమాలియాలాగా కరువు దేశం కాదు మనది.

కలహామా ఎడారి ప్రజలలాగా ఆకలి వేయకుండా ఉండడానికి కాక్టస్ మొక్కలు తినడం లేదు మనం. ఆకలేస్తే అన్నంతోనే కడుపు నింపుకుంటున్నాం.

ఒకనాటి ఆంధ్రప్రదేశ్‌లోలాగా గంజికి కూడా కరువు రావడం ఎరుగం మనం.

ఒక జాతి జాతినంతటినీ నిర్మూలించ డమే లక్ష్యంగా పెట్టుకొని, గాలి కూడా చొరపడని గదుల్లో వందలమంది మను ష్యుల్ని కుక్కి గ్యాస్ చాంబర్లలోకి తోసి అమానుషంగా చంపిన హిట్లర్‌లాంటి వాడిని మనం ఎరుగనే ఎరగం.

కనీసం పరాయి పాలనలో పీడించబ డుతూ ఉండి, స్వతంత్రం కోసం పోరాడవ లసిన ప్రాణాలు వదలవలసిన స్థితిలో కూడా లేము.

దేశ రక్షణ కోసం మంచు కొండల మధ్య అహర్నిశలు కాపలా కాస్తూ మామూలు జీవితానికీ, కుటుంబాలకీ దూరంగా ఉండవలసిన సైన్యం పరిస్థి తుల్లో కూడా లేము.

నల్గొండ జిల్లాలో మాదిరిగా ఫ్లోరైడ్ సమస్యతో బాధపడటం లేదు. కాళ్లూ చేతులు కొంకర్లు తిరిగిపోయి, వయసు పెరుగుతున్నా మనిషి ఎదగకుండా ఉండ టంలేదు.

శుభ్రమైన నీళ్లు తాగుతూ ఆరోగ్యంగానే ఉన్నాం...

కనీసం వాళ్లకన్నా... ఈ ప్రపంచంలో చాలామంది కన్నా...

లక్షలాది మంది గంగపుత్రులలాగా జీవనం గడపడం కోసం, నిత్యం ఉప్పొంగే సముద్రం మీదికి వేటకి వెళ్లనక్కరలేదు మనం.

నాలుగైదు వందలకోసం సెప్టిక్ ట్యాంక్ లలోకి దిగి క్లీన్ చేయనక్కరలేదు మనం. బతుకు తెరువుకోసం మానవ మలమూ త్రాల్ని ఎత్తిపోయనక్కర్లేదు మనం.

కడుపు నింపుకోవడానికి ఒళ్లు అమ్ము కునే స్థితిలోనో, ఒంట్లోని అవయవాలో, ఏ కిడ్నీలో అమ్ముకునే స్థితిలోనో లేము మనం.

ఎంత అదృష్టవంతులం వాళ్లకన్నా మనం...

ఆలోచనల్నించి బయటపడిన అశోక్, రేపే విరించికి, తల్లికీ ఉత్తరాలు రాయా లని నిర్ణయించుకున్నాడు.

ఆశ నింపినందుకు కృతజ్ఞతతో ఒకరికీ, ఆ ఆశని ప్రతిఫలించేలా ఆత్మ విశ్వాసంతో మరొకరికీ ఆ ఉత్తరాలు...

'రేపు' నిన్నటిలా ఉండదనీ కచ్చితంగా బావుంటుందనే నమ్మకం నిండి ఉంది ఇప్పుడు అశోక్‌లో.

నెమ్మదిగా కదిలాడు అశోక్... లోపలికి వెళ్లడానికి.

లోకాన్ని చుట్టుముట్టిన చీకట్లని పారద్రో లడానికి సూర్యుడు అప్పుడే సమాయత్తమ వుతుంటే, వేదిక కావడానికి తూర్పు సిద్ధ మవుతున్నట్టు... అక్కడ ఆకాశం ఎర్రగా మారుతోంది.

సూర్యుడు తూర్పున ఉదయాన్నే ఉద యిస్తాడన్న నమ్మకాన్ని బహుశా తను పుట్టిన క్షణం నుంచీ ఏనాడు కోల్పోలేదు భూమి.

సూర్యుడు కూడా ఆ నమ్మకాన్ని వమ్ము చేయలేదు.

నమ్మినోడెప్పుడూ చెడిపోడు అనడా నికి అది నిత్య నిదర్శనం. ©

# కాప్షన్ మీదే - 14



ఈనాడు కార్టూనిస్ట్, ప్రముఖ చిత్రకారుడు శ్రీధర్ వేసిన పై కార్టూన్‌కు నవ్వొచ్చే కాప్షన్ రాయండి. చక్కని బహుమతి అందుకోండి!
బాగున్న మరో నాలుగు ఎంపిక చేసి పంపినవారి పేర్లను ప్రచురిస్తాం.

మీ కాప్షన్లు అందాల్సిన చివరి తేదీ ఈ నెల 16

చిరునామా: సంపాదకులు, చతుర, ఈనాడు కాంప్లెక్స్, సోమాజిగూడ, హైదరాబాద్- 082
e-mail : vipula.chatura@gmail.com

ఉత్తమ వ్యాఖ్య :

**అదేంటోగానీ.. మంచి గిరాకీ దొరికినప్పుడే ఈ ఫోన్ లైన్లు దొరికి చావవు**

–జి.ద్వారకానాథ్,
కోట, నెల్లూరు జిల్లా




## కాప్షన్ మీదే -13

బాగున్న మరికొన్ని కాప్షన్లు :

**మనోడు ఆడుకోవడానికి డైనోసార్ కావాలన్నాడుగా తిరగ్గా తిరగ్గా అడవిలో ఒకటి దొరికింది**

– జి.వాసు, జలగంనగర్, ఖమ్మం

**హలో! ఆంధ్రాలో అల్లర్లా అడవిలో ఉంటేనే క్షేమమా?! బాస్ నడిగి కాల్ చేస్తారా?**

– పి.లక్ష్మీశారద, రాజమండ్రి

**హలో స్పీల్‌బర్గా! మీ కొత్తపిక్చర్ కోసం 'రాచ్చసబల్లి'ని పట్టేశా! వచ్చి తోల్కపో!!**

– మైత్రేయ, వైనతేయ, హైదరాబాద్

**హలో! జంగ్లీ! డైనో 65కి అంతా చేశావా రెడీ!?**

– ఎం.అరుణరేఖ,
లక్ష్మీపురం, గుంటూరు

# ఎప్పుడు...?

## చతుర కతేలు



'హల్లో... సార్... ఒక చిన్న మాట..." అంటూ తన ముందు వెడుతున్న వ్యక్తిని పిలిచారు పరంధామయ్యగారు!

ఆ వ్యక్తి వెనక్కి తిరిగి చూసి, "పిలిచారా?" అన్నాడు.

"అవున్సార్!" అంటూ గబగబా అంగలేసుకుంటూ వచ్చి "నమస్తే! నమస్తే! మీరు..." అంటూ అర్థోక్తిలో ఆగిపోయాడు!

"నా పేరు కృష్ణారావు..." అన్నాడా వ్యక్తి!

"నా పేరు పరంధామయ్య. మిమ్మల్ని కలుసుకోవడం సంతోషం! మీరు భెల్ కంపెనీలో..."

"నో.. నో.. నేను ఎస్.బి.ఐ.లో ఎంప్లాయీ!"

"అలాగా.. సంతోషం! చాలా సంతోషం! మీ శాలరీ ఎంతుంటుంది? అఫ్‌కోర్స్, ఆడదాని వయసు, మగాడి జీతం అడక్కూడదంటారు. నడవండి! అలా నడుస్తూనే మాట్లాడుకుందాం!"

"ఏమిటి మీరడిగేది? ఆ వివరాలన్నీ మీకెందుకు?"

"కోపగించుకోకండి సార్! నేను మీ శ్రేయోభిలాషిని..."

"మీరెవరో నాకు తెలీదు. అయినా ఈ వివరాలన్నీ మీకెందుకో నాకు అర్థం కావట్లేదు"

"మరేం భయపడకండి! నేనేం ఇన్సూరెన్స్ ఏజెంటునూ కాను. ఇన్‌కమ్‌టాక్సు ఆఫీసర్నూ కాను. జస్ట్.. తెలుసుకుందామని. మీరు మరోలా అనుకుంటుంటే, పోనీ చెప్పక్కర్లేదు లెండి. ఇందాకనే చెప్పానుగా.. నేను మీ శ్రేయోభిలాషినని"

"సర్..! అయితే... చెప్తా... నా శాలరీ... పన్నెండు వేలు..."

"వెరీగుడ్... మీకు తెలుసా? సరిగ్గా కుటుంబరావుగారి జీతమూ అంతే..!"

"కుటుంబరావుగారా? ఆయనెవరు...?"

"ఓ.. సారీ! మీకు చెప్పనే లేదు కదూ! ఆయన కలెక్టరాఫీసులో పన్జేస్తున్నారు. ఆయనకూ అంతే జీతం.. కానీ పాపం ఏం లాభం...?"

"అదేంటి? ... ఏంటలా అంటున్నారు?"

"ఆయనకు ఆర్గురు సంతానం! ఒక్కసారి ఆలోచించండి. ఆర్గురు పిల్లలు, భార్య, భర్త, మొత్తం ఎనమండుగురు. ఆ పన్నెండు వేలతో బతకాలంటే ఎంత కష్టమో!"

"నిజమే... కష్టమే మరి.."

"అలా తేలిగ్గా అనేస్తారేమిటి సార్! చాలా కష్టం! నిజంగా ఎంత కష్టమో! ఏమంటారు? నిజం చెప్పాలంటే.. ఆయన పీకల్లోతు కష్టాల్లో ఉన్నాడు. పిల్లలకు సరైన తిండి, బట్ట, చదువు సమకూర్చలేకపోతున్నాడు"

"అలాగా! పాపం..! అలా ఎందుకొచ్చింది?"

"ఏంటి సార్.. మీరొట్టి అమాయకుల్లా ఉన్నారే.. ఏం చెప్పాను మీకు? ఆయనకు.."

"ఆర్గురు పిల్లలని చెప్పారు..."

"కరెక్ట్! ఆర్గురు పిల్లలు, భార్య, భర్త మొత్తం ఎనమండుగురు. వీళ్లకితోడు, ఆయన తల్లీ తండ్రీ.. అంటే మొత్తం పదిమందికి, ఆ పన్నెండు వేలు పంచితే, ఒక్కొక్కరికీ నెలకు ఎంత వస్తుంది సార్?"

"పన్నెండొందలు..."

"వెరీగుడ్. వెరీ గుడ్! మీరు చాలా చురుకైనవారు! నా పాయింటుని ఠక్కున అర్థం చేసేసుకుంటున్నారు. పన్నెండొందలతో ఒక్కొక్కరిని నెలంతా పోషించడం జరిగే పనేనా? తిండికెంత? బట్టలకెంత? మందులకెంత? అద్దెకెంత? ఇంకా.. ఇంకా..."

"నిజమే! ఏ మాత్రం చాలదు... ఈ రోజుల్లో అసలు తిండికే చాలదు."

"కరెక్ట్! నా పాయింట్‌ని ఠక్కున పట్టేశారు.. అందుచేతనే సదరు కుటుంబరావుగారు కష్టాల ఊబిలో దిగబడిపోతున్నారు.. పోతున్నారే

మిటి? దిగబడేపోయారు.. అసలు దీనికంతకూ కారణమేమిటనుకుంటున్నారు? "

"అది నాకెలా తెలుస్తుంది? "

"మరీ అమాయకంగా చెప్పకండి సార్! మీకు తెలుసు! నాతో పరాచికాలాడాలని, జోక్ చేస్తున్నారు.. పోన్లెండి.. నేనే చెప్తాను.. ఆయన సంపాదనతో అంత సంసారాన్ని పోషించడం ఆయనవల్ల కాకపోవడమే కారణం! అసలంత మంది కాకుండా లవకుశుల్లా, ఇద్దరే యిద్దరు పిల్లలే ఉంటే, ఎంత సుఖంగా ఉండగలిగేవాడు! ఆ పిల్లలిద్దరూ, తనూ, భార్య- ఎంత ఆనందంగా, ఆరోగ్యంగా, హాయిగా ఉండేవారు! వాళ్ళకి పుష్టికరమైన ఆహారం, మంచి మంచి బట్టలు, చదువు అందించగలిగేవాడుగా! చెప్పండి!"

"కచ్చితంగా! నిస్సందేహంగా చెప్పొచ్చు..."

"థాంక్యూ సార్.. థాంక్యూ.. అందుకే.. ఇప్పటికేనా ఆపరేషను చేయించుకోవయ్యా అని సలహా యిస్తున్నాను. కేవలం ఆయనకేకాదు సార్, ఆయనలాగే ఇంకా చాలామంది అలాగే మూర్ఖంగా ఉంటున్నారు.. వారంతా అజ్ఞానంతో, అమాయకత్వంతో, బాధ్యతారాహిత్యంతో బతుకుతూ బాధలు పడుతున్నారు. వారు బాధలు పడటమేకాదు, ఇతరుల్ని, దేశాన్ని కూడా బాధపెడ్తున్నారు. అధిక వనరులు, అధికోత్పత్తి ఉన్నా, మన దేశం అభివృద్ధి చెందాల్సినంతగా, అభివృద్ధి చెందకపోవడానికి కారణం- కుటుంబరావులాంటివారే! ఏమంటారు? ... ఇప్పుడు చెప్పండి!! మీరు కుటుంబరావులాగే ఉండాలనుకుంటారా? "

"నో.. నో.. నెవ్వర్..."

"గూడ్.. వెరీగూడ్.. అయితే..ఇప్పుడు చెప్పండి! మీరు ఆపరేషన్ చేయించుకునేది ఎప్పుడు" అంటూ ఆత్రంగా అడిగేశాడు ఓ కేసు దొరుకుతోందన్న ఆశతో!

"పెళ్ళయ్యాక, ఇద్దరు పిల్లలు పుట్టాక..." అన్నాడు తాపీగా, సదరు కృష్ణారావు!

"ఆ!.. మీకింకా పెళ్ళి కాలేదూ...? " అంటూ కొయ్యబారిపోయాడు సదరు పరంధామయ్య!

—సోమంచి రామం

---

## కామన్ సెన్స్



ఓ కోటీశ్వర్రావుగారు ఇంటికి కాపలా కాసే వాచ్‌మన్‌కోసం ఇంటర్వ్యూలు చేస్తున్నారు.

చివరి వడపోతలో ఇద్దరు కేండిడేట్లు మిగిలారు.

కోటీశ్వర్రావుగారు "గిన్నెలో నెయ్యిపోసి ఎండలో బెడితే ఏమవుతుంది? " అనడిగాడు ఇద్దరినీ కలిపి కూర్చోబెట్టి.

"సూర్య కిరణాలు సోకి ఆ వేడికి నెయ్యి కరిగిపోతుంది సార్!" అన్నాడు మొదటివాడు కాన్ఫిడెంట్‌గా.

"కుక్క గిన్నె ఎత్తుకుపోతుంది సార్!" అన్నాడు మొదటివాడికన్నా వయసులో కాస్త ఎక్కువ ఉన్నవాడు వినయంగా.

"మీ ప్రశ్నకు సైంటిఫిక్‌గా, చక్కగా సమాధానం చెప్పిన మొదటి అబ్బాయికే న్యాయంగా ఉద్యోగం దక్కాలి కదా!" అంది అక్కడే ఉన్న కోటీశ్వర్రావుగారి కూతురు.

"వాచ్‌మన్‌కు ఉండాల్సింది సైన్సు కాదమ్మా! కామన్ సెన్సు" అని రెండోవాడికి ఉద్యోగం ఇచ్చేశాడు కోటీశ్వర్రావుగారు.

ఆరోజు రాత్రి పడగ్గదిలో భార్య కోటీశ్వర్రావుగారిని నిలదీసింది. "మీ సెలెక్షన్ బాగా లేదని అమ్మాయి ఒహటే గుణుస్తుంది పొద్దుట్నుంచీ. దాని చూపంతా ఆ మొదటబ్బాయి మీదే ఉందండీ!"

"అందుకనే పిచ్చి మొద్దూ.. రెండోవాడిని సెలెక్టు చేసిందీ! చెప్పాగా ఎవరికైనా సైన్సుకన్నా కామన్ సెన్సే ముఖ్యమనీ" అన్నాడు కోటీశ్వర్రావుగారు.

– కర్లపాలెం హనుమంతరావు

# నా అందం ఆరోగ్యం రహస్యాలివే!



బెంగుళూరులో పుట్టి పెరిగిన తమిళ భామ ప్రియమణి. లంగా ఓణీ నుంచి మోడ్రన్ బికినీల వరకు ఎలాంటి వస్త్ర ధారణతో అయినా జనాల్ని మెప్పించగలిగిన నటి. 'ఆరోగ్యంగా ఉంటే అందంగా ఉన్నట్టే' అంటున్న ప్రియమణి తెలుగులో అగ్ర, యువ కథానాయకుల సరసన ఆడిపాడుతోంది. జగపతిబాబుతో 'పెళ్లైన కొత్తలో', ఎన్టీఆర్‌తో 'యమదొంగ', కళ్యాణ్‌రామ్‌తో 'హరేరామ్' వంటివన్నీ ఆమె ఖాతాలోనివే. ప్రస్తుతం 'శంభో శివ శంభో', 'సాధ్యం' చిత్రాల్లో నటిస్తోంది. మణిరత్నం దర్శకత్వంలో 'రావణ్' లోనూ ఆమె కీలక పాత్రధారి. ఈ జాతీయ అవార్డు గ్రహీత.. అందం-ఆరోగ్యం గురించి చెబుతున్న స్వీయానుభవాల మాలిక.. మీకోసం !

### ఆరోగ్యం కోసం...

★ రాత్రి ఎంత పొద్దుపోయిన తర్వాత పడుకున్నా ఉదయాన్నే లేస్తాను. సూర్యోదయాన్ని చూడటమంటే నాకు చాలా మక్కువ. పొద్దుపొద్దున్నే నీరెండలో నడుస్తుంటే హాయిగా ఉంటుంది. ప్రపంచంలో ఉన్న ఉత్సాహమంతా మన దగ్గరే ఉన్నట్టనిపిస్తుంది.

★ కనీసం రోజు మార్చి రోజైనా యోగా చేస్తాను. మానసిక ప్రశాంతత మాత్రమే కాదు.. శరీరం కూడా మనం చెప్పినట్టు వింటుంది. వయసు మీద పడ్డాక మేలుకోవడం అనర్థం. రోజూ యోగా చేస్తే భవిష్యత్తులో ఎన్నో లాభాలుంటాయి.

★ యోగా చేయని రోజుల్లో కార్డియో, ఇతర జిమ్ వర్కవుట్‌లు చేస్తుంటాను.

★ ఉదయాన్నే అల్పాహారంలో ఇడ్లీ, దోసెలు లాంటివే తరచూ తీసుకుంటాను. చాలా సందర్భాల్లో గ్లాసు నిండా పాలు, రెండు ఉడికించిన గుడ్లు తీసుకుంటాను. ఆమ్లెట్ వేసుకునే పనయితే గుడ్డులోని పసుపును తీసేసి తెల్ల సొనతో ఆమ్లెట్ వేసుకుంటా.

★ మొలకెత్తిన గింజలను తినడమంటే నాకు సరదా. చిప్స్, ఇతరత్రా నూనె పదార్థాల స్థానంలో మొలకెత్తిన గింజలను తీసుకుంటాను. షాట్ గ్యాప్‌లో వీటిని ఎక్కువగా తీసుకుంటా.

★ ఒకేసారి కడుపునిండా తినేయడం కన్నా తరచూ తినడమే మంచిదని నిపుణులు ఇచ్చే సలహానే పాటిస్తుంటాను. పొట్టనిండా తినేసి ఆయాసపడటం కన్నా తరచూ ఏ పండో, పళ్ళ రసాన్నో తీసుకోవడానికే మొగ్గుచూపుతా.

★ మధ్యాహ్నం నా భోజనంలో తప్పక ఏదో ఒక ఆకు కూర ఉంటుంది. అన్నం చాలా తక్కువగా తీసుకుంటాను. కూరలు ఎక్కువగా తింటాను. చిన్నప్పటి నుంచీ అమ్మ అలాగే నేర్పింది.

★ నూనె వంటలను పెద్దగా ఇష్టపడను.

ఆరోగ్య రీత్యా నూనెకు కాస్త దూరంగా ఉండటమే మేలు. అందుకే వీలైనంత వరకు ఆవిరి మీద ఉడికించిన వెరైటీల కోసమే ప్రయత్నిస్తాను.

★ రాత్రిళ్ళలో వీలైనంత త్వరగానే భోజనం చేస్తాను. లేకుంటే అందరితోపాటే. మరీ ఆలస్యంగా తింటే మాత్రం ఒక ముద్ద తక్కువే తింటాను. ఓ గ్లాసెడు గోరువెచ్చటి పాలు తాగనిదే నిద్రపట్టదు.

★ రాత్రివేళల్లో షూటింగ్ ఉండి మేలుకున్న పక్షంలో వేడి చేయకుండా కాస్త చలవచేసే పదార్థాలను ఎక్కువగా తింటాను. పెరుగు తినడం కన్నా పలచటి మజ్జిగను తాగటానికే ఇష్టపడతాను.



## అందం కోసం...

★ ఎండలో వెళ్తున్నప్పుడు, ఆరు బయట షూటింగ్ జరుగుతున్నప్పుడు సన్‌స్క్రీన్ లోషన్ తప్పకుండా వాడతాను. వీలైనంత వరకు నీడలో ఉండటానికే ప్రయత్నిస్తాను. షాట్‌లో లేకపోతే కూలింగ్ గ్లాసుల్ని వాడతాను. కళ్ళు ఎవర్కికైనా చాలా ముఖ్యం. అందుకే నేను ప్రత్యేక జాగ్రత్తలు తీసుకుంటాను.

★ ఇంటికి రాగానే ముందు చేసే పని చల్లని నీటితో కళ్ళు కడగడం. అలాగే కనుబొమ్మల తీరు కూడా కళ్ళ అందాన్ని ఇనుమడింపజేస్తుంది. కనుబొమ్మల్ని షేప్ చేయించుకునే ప్రతిసారీ ముందు ఆవిరిపట్టి, తర్వాత ఏదో క్రీమ్ రాసి ఆ తర్వాతే ట్రిమ్ చేయించుకుంటాను. ఇలా చేయడం ద్వారా నొప్పి తెలియదు. కంటి పరిసరాలు చాలా సున్నితంగా ఉంటాయి కదా? అందుకే ఈ జాగ్రత్తలు.

★ కనుబొమ్మల్ని మరీ సన్నగా చేయించుకోకూడదు. కాస్త మందంగా ఉంటేనే ముఖానికి అందం. ఈ విషయంలో తరచూ ఒకరి దగ్గరికే వెళ్లడం అన్ని విధాలా ఉత్తమం.

★ అలాగే మేకప్ విషయంలోనూ జాగ్రత్తలు ముఖ్యం. నాణ్యమైన వస్తువులను వాడాలి. రాత్రి నిద్రపోవడానికి ముందు మేకప్‌ను పూర్తిగా తొలగించేయాలి. నేనైతే పాలతో ముఖాన్ని రుద్ది శుభ్రం చేసుకుంటాను.

★ షూటింగ్‌లు లేని సమయాల్లో అమ్మ సెనగపిండిలో మీగడ, తేనె కలిపి ముఖానికి రాస్తుంది. ముఖం ప్రకాశవంతంగా ఉండటం కోసమే ఈ ప్రక్రియ.

★ పుల్లటి పెరుగు, మెంతిపిండిని తలకు పట్టించి తలస్నానం చేస్తాను. మనిషి ఎంత అందంగా ఉన్నా రెట్టింపు కళ తెచ్చిపెట్టేది కేశ సంపదే.

★ శుభ్రత పాటిస్తాను. నా పరిసరాలు ఎప్పుడూ శుభ్రంగా ఉండాల్సిందే. రోజుకు రెండు పూటలా స్నానం, రెండు పూటలా దంతధావనం తప్పనిసరి. లేకుంటే చిరాగ్గా ఉంటుంది.

## ప్రశాంతత కోసం...

★ మానసిక ప్రశాంతత ముఖ్యం. ఎంత ఉరుకులు పరుగుల జీవితమైనా ప్రశాంతంగా గడపడానికే ప్రాముఖ్యమిస్తాను. పక్కా ప్రణాళిక ఉంటే సంతోషంగా గడపవచ్చు. మనం శాంతంగా ఉంటే ఆలోచనల్లోనూ పరిపక్వత ఉంటుంది. అన్నీ సవ్యంగా ఉంటే ముఖం ప్రకాశిస్తుంది.

★ ఎప్పుడూ ఏ చెడు ఆలోచనను రానివ్వను. భావోద్వేగాలను మరింత అదుపుచేసుకోను. బాధగా ఉంటే ఏడ్చేస్తాను. మనసారా నవ్వుతాను.

★ సమయం దొరికితే మంచి వినోదాత్మక చిత్రాలను చూస్తాను. రేపటి బాగు కోసం ఈ రోజు ఎన్ని రకాల శిక్షణలు పొందాలో ఆలోచించి ఆచరిస్తుంటాను.

★ సంగీతం వింటాను. మరీ ఆనందంగా ఉంటే కూనిరాగాలు తీస్తుంటాను. ఇవన్నీ మనస్సును ప్రశాంతంగా ఉంచుతాయి. రెట్టింపు ఉత్సాహంతో పనిచేయడానికి శక్తినిస్తాయి.

– చల్లా భాగ్యలక్ష్మి

# రచయితలకు సూచనలు



**నవ్యనవలా వేదిక 'చతుర'కు రచనలు పంపేవారు ఈ కింది సూచనల్ని గమనించాలి.**

---

★ చతురకు నవలలు పంపేవారు సామాజిక సమస్యలపై దృష్టి పెట్టాలి. హాస్య, వ్యంగ్య తదితర ఏ ఇతివృత్తమైనా ఎంచుకోవచ్చు. ఏ మాండలికమైనా రాయొచ్చు. వైవిధ్య కథా వస్తువులకు ప్రాధాన్యం ఉంటుంది. నవ్యతకే పెద్దపీట.

★ బొమ్మలు, వివిధ శీర్షికలు, ప్రకటనలు పోను 'చతుర' నవల అచ్చులో 80-85 పేజీలు ఉంటుంది. దీన్ని దృష్టిలో పెట్టుకుని రచయితలు తమ నవలల్ని అచ్చులో 85 పేజీలు మించకుండా రాసి పంపాలి.

★ ఒక పాత 'చతుర' సంచిక తీసుకుని అందులో ఉన్న నవలలో ఒకటి లేదా రెండు పూర్తి పేజీలను తమ దస్తూరితో రాసి చూసుకుని ఆ మేరకు తమ నవల రాతప్రతి ఎన్ని పేజీలలో రాయవచ్చో అంచనాకు రావడం సులభం. ఏదేమైనా అచ్చులో 80-85 పేజీలకు మించకుండా లేదా తక్కువ కాకుండా ప్లాన్ చేసుకుని పంపడం మంచి పద్ధతి.

★ ప్రచురణకు స్వీకరించని నవలలు/రచనలు తిప్పిపంపేందుకు వీలుగా స్టాంపులు అంటించిన సొంత చిరునామాగల కవరు జతపరచడం మరువకండి. రాతప్రతులు పోస్ట్‌లో పోతే 'చతుర' బాధ్యత వహించబోదు.

★ స్టాంపులు అంటించిన సొంత చిరునామాగల కవర్లు జతపరచని వారి రచనలు తిరస్కారానికి గురైతే ట్రాష్‌లోకి వెళ్ళిపోతాయి. వాటి గురించి ఉత్తరప్రత్యుత్తరాలకు తావులేదు.

★ సాధారణంగా నవలలు కార్యాలయానికి అందిన 4 - 8 వారాలలోగా పరిశీలించి ప్రచురణార్హమైతే ఆ విషయం తెలియపరుస్తాం. కాకుంటే తిప్పిపంపడం జరుగుతుంది.

★ ప్రచురితమైన ప్రతి నవలకు రూ. 6000/- పారితోషికం ఉంటుంది. నవల ఏ నెలలో ప్రచురిస్తే ఆ నెల మొదటి వారంలోనే పై మొత్తానికి రచయితకు చెక్కు అందుతుంది.

★ 'కొత్తగాలి' శీర్షికకు చిరుకవితలు పంపేవారు నాలుగు/ఐదు పంక్తులు మించకుండా పంపాలి. స్పార్క్‌కే మార్కు అన్న విషయం గుర్తించాలి.

**చతుర**

చిరునామా :

ఎడిటర్, చతుర, ఈనాడు కాంప్లెక్స్, సోమాజిగూడ, హైదరాబాద్-500082

# మిస్టరీ సారస్వత సార్వభౌముడు



జేమ్స్ హాడ్లీ ఛేజ్

నవలా సాహిత్యంలో ప్రపంచవ్యాప్తంగా ఓ సంచలనం సృష్టించిన విశిష్ట రచయిత జేమ్స్ హాడ్లీ ఛేజ్. 1929-39 మధ్యకాలంలో ఓ దశాబ్దం పాటు ఆర్థికమాంద్యం పాశ్చాత్యదేశాలను కుదిపి వేసింది. వినోదానికి, విశృంఖల జీవితానికి అల వాటు పడ్డ అమెరికా సామాజికంగా ఆర్థికంగా బాగా దెబ్బతిన్న రోజులవి. 'ధనం మూలం ఇదమ్ జగత్' అన్నసూత్రం భూమికగా చేసుకుని మాఫియా ముఠాలు, వర్గాలు అనేకంగా దేశమంతటా పెచ్చరిల్లిపోయాయి. ఇలాంటి పరి స్థితుల్లో ఛేజ్ సామాజికస్పృహతో సృజనాత్మ కంగా రచన సాగించటానికి సన్నద్ధమయ్యాడు. ఏదో విధంగా రాత్రికి రాత్రి కోట్లకు పడగలెత్తా లన్న ఆకాంక్ష అమెరికా జీవనశైలిని అమితంగా ప్రభావితం చేసింది. ఫలితంగా దురాశాపరులు, హంతకులు సభ్యసమాజాన్ని అతలాకుతలం చేయటం మొదలైంది. ప్రతి నేరానికి కారణం ధనాశ. అలాంటి నేరస్థుడి వెనుక స్త్రీ హస్తం. ఈ కాంతా, కనకాల కోసం ఎంతకైనా తెగించి ఘోరాలకు, నేరాలకు పాల్పడుతూండటమే ఛేజ్ నవలల్లో ప్రధాన ఇతివృత్తం. పైకి సెక్స్ క్రైమ్ కళ్లకి కట్టించినా, తర్వాత వాటి పర్యవసానం ఎంత తీవ్రంగా ఉంటుందో తెలియజేయటమే రచయిత అభిమతం.

ఛేజ్ ని ఓ రచయితగా నిలబెట్టిన మొట్టమొదటి నవల 'నో ఆర్కిడ్స్ ఫర్ మిస్ బ్లాండిష్' మిస్ బ్లాండిష్ ఓ పెద్ద ధనిక కుటుంబానికి వార సురాలు.

1939లో వెలుగు చూసిన ఈ తొలి నవల బహుళ జనాదరణ పొందటం విశేషం. ఈ బెస్ట్ సెల్లర్ లండన్ వెస్టెండ్ రంగస్థలాన్ని అలరిం చటం, ఆ తర్వాత హాలీవుడ్ చిత్రంగా రూపుది ద్దుకోవటం ఒక ఎత్తు. 1971లో 'గ్రిస్సామ్ గ్యాంగ్' టైటిల్ తో మళ్లీ తెరకు ఎక్కటం మరో ఎత్తు. ఛేజ్ కలం నుంచి జాలువారిన ఎనభై నవలల్లో సింహభాగం వెండితెరకు ఎక్కటం గమనించదగ్గ మరో విశేషం. వివాదాస్పదమైన నవలని 'ద నైట్ ఆఫ్ ది జనరల్స్' తెరకెక్కించ టానికి ఛేజ్ తనవంతు సహాయాన్ని నిర్మాతకు అందజేశాడు. పీటర్ ఓటూల్ నటించిన ఈచిత్రం విశ్వవ్యాప్తంగా ప్రేక్షకుల మన్ననలు చూరగొన్నది.

ఛేజ్ అసలు పేరు రెని బ్రాబజాన్ రేమాండ్. తండ్రి బ్రిటిష్ సైమానిక దళంలో కల్నల్. కొడుకు భవిష్యత్తు గురించి కలలుకన్న ఆ తండ్రి రేమాండ్ కొడుకును ఓ వైజ్ఞానికుడు కావాలని కోరుకున్నాడు. రొచెస్టర్, కెంట్ లో పేరెన్నికగన్న కింగ్స్ స్కూల్లో చేర్పించాడు. ఉద్యోగరీత్యా ఇండియా రావటం వల్ల ఛేజ్ కోల్ కతాలో కొంత కాలం విద్యాభ్యాసం చేశాడు. అదే అతడికి, మన దేశానికి వున్న ఓ అనుబంధం. కాని విధి వక్రించి, పద్దెనిమిదవ ఏటనే ఛేజ్ విద్యాలయా నికి దూరం అయ్యాడు. పుస్తకాలు, నిఘంటు వులు అమ్ముకుంటూ బుక్ సెల్లర్ గా, హోల్ సేల ర్ గా జీవనయాత్ర సాగించాడు. అయినా సార స్వత ప్రపంచాన్ని అంటిపెట్టుకునే వున్నాడు. బహుశా ఈ న్యూనతాభావం వల్లే, 'జేమ్స్ హాడ్లీ ఛేజ్' అన్న కలంపేరు ఎన్నుకుని వుండవచ్చు చివరిదశలో అతను అజ్ఞాత జీవితం గడపటానికి కారణం అనుకోనూవచ్చు 1906 డిసెంబరు 24 న లండన్ లో పుట్టేడు ఛేజ్. అమెరికాతో అతడి అనుబంధం అంతంత మాత్రమే. అయినా ఆ జీ వన విధానాన్ని, సామాజిక పరిస్థితిని క్షుణ్ణంగా అధ్యయనం చేశాడు. నిఘంటువు సహాయంతో అమెరికా పామరభాషను ఆకళించుకుని ఆకర్షణీ యమైన శైలితో అందరిని ఆకట్టుకోవటం అంత సులభం కాదు. కలాన్ని రేసుగుర్రంలా నడి

పించి, పాఠకుడిలో ఉత్కంఠరేపి, శిఖరాగ్రానికి చేర్చటంలో ఛేజ్ తనకుతానే సాటి అనిపించుకు న్నాడు. అంతేకాదు, దేశం కోసం ప్రాణాలొడ్డి పోరాడే స్పై (గూఢచారి) నవలలు రాయటం లోనూ అందెవేసిన చేయి. 'మిషన్ టు వెనిస్', 'మిషన్ టు వియన్నా' నవలలు అందుకు మచ్చు తునకలని చెప్పవచ్చు.

రెండో ప్రపంచ యుద్ధం రోజుల్లో బ్రిటిష్ వైమానిక దళంలో స్క్వాడ్రన్ లీడర్‌గా ఛేజ్ కొంతకాలం పనిచేశాడు. చదువుకు దూరమైనా సాహిత్యానికి ఎప్పుడూ దగ్గరే. ఆరోజుల్లో డేవిడ్ లాంగ్‌డన్‌తో కలిసి ఆర్.ఎ.ఎఫ్ జర్నల్ నడిపే బాధ్యత పంచుకున్నాడు. అతను రాసిన కథాని కలు తరువాత సంకలనంగా 'బుక్ స్లిప్ స్ట్రీమ్' శీర్షికతో వెలువడింది. 1933లో సిల్వియా రేతో వివాహం జరిగింది ఛేజ్‌కి. ఒక కొడుకును




కూడా కన్నాడు. అయినా ఏకాంత జీవితంపట్ల అతడి ఆసక్తి పెరిగింది. 1956లో ఫ్రాన్స్, అనం తరం 1961లో స్విట్జర్‌లాండ్ వలసపోయాడు.

1974లో జెనీవా చేరుకున్నాడు. ఫిబ్రవరి 6, 1985లో కన్నుమూసేదాకా అతడి శేషజీవితం అక్కడే గడిచిపోయింది. ఛేజ్ జీవిత గమనం ఆగిపోయినా సాహిత్యపరంగా తనదైన బాణీలో మిస్టరీ సారస్వత సార్వభౌమత్వాన్ని సొంతం చేసుకున్నాడు. ఆసియా, ఆఫ్రికాలతోపాటు, పెరి స్త్రోయికాతో సరళీకృతమైన రష్యా, ఇటలీ, ఫ్రాన్స్ దేశాలు ఛేజ్ పుస్తకాలను నెత్తినపెట్టుకున్నాయి. చెవి మెలివేసి చదివించగల నవలల్లో అంతర్గ తంగా కనిపించే రచయిత ఆవేదన, నేరానికి తగ్గ శిక్ష అనుభవించి తీరాలన్న సూచన పాఠకులు గ్రహించాలన్న తపన అందరూ గమనించకపో వచ్చు. కాలక్షేపం కోసమే కాకుండా, కవి హృద యాన్ని అర్థం చేసుకున్నప్పుడే ఏ రచయిత అయినా ఆనందిస్తాడు. అదే పాఠకులు చెల్లించ వలసిన కానుక.

ఛేజ్ కలం జాలువార్చిన ప్రతి నవలా ఒక ఆణిముత్యమే. అట్టహాసం లేకపోయినా, టైటిల్ చూడగానే చదవాలనిపించటం అతని ప్రతిభా విశేషానికి నిదర్శనం.

ద డెడ్ స్టే డంబ్, మోర్ డెడ్లీ దాన్ ద మేల్, యూఆర్ లోన్‌లీ వెన్ యూఆర్ డెడ్ పేర్లు చూడగానే అవెవరివో పాఠకులకు ఇట్టే తెలిసిపో తుంది. అంతేకాదు, ఛేజ్ నవలల్లో హంతకుడె వరో పాఠకుడికి ముందుగానే తెలిసిపోతుంది. అయినప్పటికీ తెరచిన పుస్తకం మూయకుండా చదివించగల సత్తావున్నవి కావటంవల్ల ఛేజ్ పేరు అందరినోటా వినిపిస్తుంది.. అప్పుడూ ఇప్పుడూ ఇక ముందు కూడా.

*(ఛేజ్ 25వ వర్థంతి సందర్భంగా అక్షర నీరాజనం)*

–వి.రాఘవేంద్రరావు

కథ వెనుక కథ

# దురాచారాలకు పాతర 'జాతర'



బోయ జంగయ్య

**కథలతో పాటు కవితలు, జీవిత చరిత్రలు, నాటికలు, బాలల- వయోజనుల పుస్తకాలు, వాచకాలు, ఉపవాచకాలు ఎన్నో రాశారాయన. బుల్లితెరకూ రాశారు. అయితేనేం? తను రాసిన తొలి నవల పేరే ఆయనకు ఇంటిపేరైంది. ఆయనెవరో కాదు.. జంగయ్య! ఆయన నవల 'జాతర'!! ఇప్పటికే అరడజను ముద్రణలు పొందిన ఈ నవల వల్ల ఆయన 'జాతర జంగయ్య' అయ్యారు.**

జంగయ్యకు పేరు ప్రతిష్ఠలు తెచ్చిన 'జాతర' నవలలో చర్చలు లేవు, సిద్ధాంతాలు లేవు. నినాదాలు, వాదాలు విన్పించవు. ఆవేశాలూ సందేశాలూ కన్పించవు. ఒక్క వాక్యం ఎక్కువ వుండదు, ఒక్క వాక్యం తక్కువ వుండదు. మరి ఇందులో ఏముంది? జీవితముంది. సమకాలీన సమాజముంది. వాస్తవ చిత్రణ ఉంది. దురాచారాల్ని కళ్లకు కట్టడం ఉంది. మూఢనమ్మకాలు మనుషుల జీవితాలతో ఎలా ఆడుకుంటాయో చెప్పడం ఉంది. అన్నిటి కంటే అడుగడుగునా సహజత్వం ఉంది. 'జాతర' గురించి జంగయ్య మాటల్లోనే..



ఓ మిత్రుడితో పాటు, నల్లగొండ పక్కనే సాగుతున్న గుట్ట జాతరకు వెళ్లాను. ఆ రాత్రంతా అక్కడికొచ్చిన జనాన్ని, అక్కడ జరిగే 'వ్యాపారాల'నీ చూశాం. జంటల పరాచికాలు, సరసంగా తిట్టుకోవడాలు, సుతారంగా కొట్టుకోవడాలు చూశాం. గుట్టకింద బండ చాటున శృంగారాల్ని చూశాం. వాటిని పట్టించుకోని పోలీసుల్ని చూశాం. ఉదయం మళ్లీ గుడి దగ్గరికి వెళ్లినపుడు, సంతానంకోరి వచ్చిన యువతుల పొర్లు దండాలు కన్పించాయి. పూజలంటూ నీళ్లు చల్లుతూనే, ఆ తడిగుడ్డల లోపలి యవ్వనాల్ని ఆబగా చూస్తున్న వ్యక్తుల రీతులూ కన్పించాయి.

భక్తి పేరుతో సాగిన ఆ మోసాలకు అటుతర్వాత అక్షరరూపమిచ్చాను. ఆ

## శ్రీశ్రీ లక్ష్య నిర్దేశం

'బతుకు లోతుల్ని తవ్వి, సంఘం ముందు ఉంచాల్సింది ఆయనే' అని శ్రీశ్రీ అన్నారు జంగయ్య గురించి. ఎప్పటికీ అదే జంగయ్య లక్ష్యం. జనజీవనాన్ని ఎప్పటికప్పుడు పరిశీలించడం, అన్నిరకాల దోపిడీల నుంచీ పీడితుల్ని కాపాడే రచనలు చేయడం.. అంతే. సంఘంలో కొందరు సృష్టిస్తున్న మాయను రచనలతో ఛేదించాలి, గుట్టును రట్టుచేయాలి అంటారాయన.

కథంతా సినిమా రీలులా.. ఐదేళ్లు నా మనసులో తిరిగింది. ముందూ వెనకా మరికొంత చేర్చాక, నవలగా రూపుదిద్దుకుంది. 'యువ' పత్రిక నవలల పోటీకి పంపాను. ఎన్నికైన జాబితాలో ఈ నవల రాలేదు. ఆ తర్వాత ఆ పత్రికా కార్యాలయానికి వెళితే దానిని సంపాదకుడు ఓ బీరువాలో భద్రపరచి సెలవుపై వెళ్లాడన్నారు. ఆ తర్వాత ఆయన తిరిగి రాలేదట. ఆ కార్యాలయం చుట్టూ తిరిగి, తిరిగి ఎలాగైతేనేమి దాన్ని తెచ్చుకున్నాను. ఆ నవలను ప్రత్యేకంగా ఎందుకు దాచి ఉంచారో ఎవరూ చెప్పలేదు.

### ప్రచురణ భాగ్యం

ఆ తర్వాత నిడివి సరిపోలేదేమో అనుకున్నాను. స్కైలాబ్ ఉదంతాన్ని జోడించి, పేజీల్ని పెంచి, 'ఆంధ్రజ్యోతి'కి పంపాను. వెంటనే పురాణంగారి నుంచి ఉత్తరం.. 'మీ నవలను ప్రచురిస్తున్నాం' అంటూ. దీపావళి ప్రత్యేక సంచికలో ప్రచురించి పారితోషికం పంపారు. 'దీన్ని పుస్తకంగా తీసుకురండి, ముందుమాట రాస్తాను' అని ఆయన నుంచే మరోలేఖ. దాంతో పుస్తకంగా తెచ్చాను. చంద్ర.. అట్ట మీద చక్కటి బొమ్మ వేశారు.

### హిందీలోకి అనువాదం

అంతకు ముందే నా కథల ద్వారా పరిచయమయ్యారు రావిశాస్త్రి. ఈ నవల వల్ల అలాంటివారితో దగ్గరితనం మరింత పెరిగింది. 'జాతర' ప్రాచుర్యాన్ని చూసిన సాహితీవేత్త డి.రామలింగం నన్ను భీమ్‌సేన్ నిర్మల్‌కి పరిచయం చేశారు. ఈ నవలను హిందీలోకి అనువాదం చేయాలని కోరితే ఆయన సంతోషంగా చేసిపెట్టారు. తర్వాత సెంట్రల్ వర్సిటీ ప్రొఫెసర్ డాక్టర్ శరత్ జ్యోత్స్నరాణి.. శ్రీరాములు అనే స్కాలర్‌ను 'జాతర'పై పరిశోధన చేయమని సూచించారు. ఆయన డాక్టరేట్ అందుకున్నాక, దాన్ని పుస్తకంగా అచ్చువేసి, కొన్ని ప్రతులు పంపారు. దానికి ముందు మాట నేనే రాశాను.

'జాతర' నవలను జనం ఆదరించారు. ఊహించిన దానికంటే ఎక్కువ గుర్తింపు నాకు అన్ని వర్గాలనుంచీ లభించింది. ఇన్ని మెప్పుల మధ్య ఓ హెచ్చరికా నాకు

★ 'జాతర' ఉత్తమ నవలగా తెలుగు విశ్వవిద్యాలయం పురస్కారం అందుకుంది.
★ ప్రచురితమైన ఆరేళ్లకే మైసూరు విశ్వవిద్యాలయం బీఎడ్ విద్యార్థులకు ఉపవాచకమైంది.
★ జంగయ్యకు డాక్టరేట్ ఇచ్చి 2003లో తెలుగు విశ్వవిద్యాలయం సత్కరించింది.

అప్పట్లోనే అందింది. నవలలో సెక్స్ రాశానని, యువతను చెడగొట్టాన'ని కొందరు రుసరుసలాడారు. 'అలాంటి రాతలు ఇక రాయొద్ద'నీ గదమాయించారు. బదులుగా నేను చెప్పిందొక్కటే. లేనిదేదీ రాయలేదు. తెలియని మనిషిని తెలిసిన మనిషి మోసం చేయడాన్నే రాశాను. ఏదీ వాదించలేదు, దేన్నీ ద్వేషించలేదు. అక్కడేం ఉందో అదే చెప్పాను. మనుషులు దురాచారాల కోరల్లోంచి బైటపడాలి. 'జాతర' చదివాక, పాఠకుల మనసులోకి వచ్చేదీ అదే అంటూ ముగించారు జంగయ్య.

### చీకటి వ్యవహారాల బట్టబయలు

జాతర వేళ.. పిల్లలులేని స్త్రీల పొర్లుదండాలుంటాయి. లింగపూజలంటూ వాళ్లతో

అక్కడి వ్యక్తి చెప్పే మాట, చేసే పని, సాగించే ప్రచారం- అంతా ఘోరమే. ఆ చీకటి పనుల, చాటు చేష్టల తతంగాల్ని చిత్రీకరించారు రచయిత. జూదగాళ్ల లాఘవాలు, ఆడవాళ్ల మీద పోలీసోళ్ల జులుం- లంచావతారాలు అన్నింటినీ ఎక్కడికక్కడ చిత్రిక పట్టారు. సగటుమనుషుల జీవితాలతో అవకాశవాదులు ఎలా ఆడుకుంటున్నారో వెల్లడి చేశారు.

### చురక.. హెచ్చరిక

ఇంటినీ ఇల్లాలినీ విస్మరించి, ఎక్కడెక్కడికో వెళ్లి, ఎవరెవరితోనో తిరిగొచ్చే మగాళ్లకూ ఇదో చురక. అలాగే కొందరు వ్యక్తులు మనిషి అక్కరమీద వల విసరడం, ఆ అవసరాన్నే పదేపదే గుర్తుచేసి భయపెట్టడం, ఏ దేవుడిపేరో చెప్పి మధ్యలో తమ 'అవసరాలు' తీర్చుకోవడం అడుగడుగునా ఈ నవలలో కన్పిస్తుంది.

## మెచ్చుతునకలు

✦ 'జాతర' విశేష నవల. అంధ విశ్వాసాలపై విసిరిన మెరుపు ఈటె

– మధురాంతకం రాజారాం

✦ ఇందులో తెలంగాణ గ్రామీణ జీవన సౌందర్యముంది. కథ ప్రవాహంలా సాగుతూ, జీవిత సత్యాల్ని కళ్లముందు ఉంచుతుంది

– పురాణం సుబ్రహ్మణ్య శర్మ

✦ 'జాతర'లో రచయిత అసమాన ప్రతిభ, రచనా వైవిధ్యం కన్పిస్తుంది

– ఆచార్య ఎన్.గోపి

✦ మంచి నవలల్లో ఇదొకటి. స్పష్టమైన అవగాహన ఇందులో ఉంది

– నవీన్

### అభినందనల వెల్లువ

తెలుగులో సంచలనం రేపిందీ నవల. 'జనం శాస్త్రీయ మార్గంలోనే నడవాలన్న హితాభిలాషి'గా జంగయ్యను కాళోజీ ప్రశంసించారు. జంగయ్య రచనలో వాస్తవికత ఉంటుంద'న్నారు డాక్టర్ ఆవంత్స సోమసుందర్. 'చదువరుల హృదయ తంత్రుల్ని మీటిన సిసలైన రచయిత'గా మలయశ్రీ అభివర్ణించారు. 'దళితుల గుండెచప్పుడన్నారు ఆర్వీయార్. జీవితం గురించి ఎంతో తెలిసిన అరుదైనవారని, మనిషి-సంఘం నడుమ సంబంధాల చిత్రణలో నేర్పరనీ జంగయ్యను కాలువ మల్లయ్య ప్రశంసించారు. 'పీడితుల జీవిత సారాన్ని కథన శిల్పంలో నింపుకొన్న ప్రగతిశీలి'గా మెచ్చుకున్నారు బి.ఎస్. రాములు. నాగభైరవ కోటేశ్వరరావు ప్రకారం- చదవదగిన కొందరు నవలాకారుల్లో 'బోజ' ఒకరు. 'పీడితుల జీవిత లోతుల్ని, ప్రతిఘటన తత్వాల్నీ పునాదిగా చేసుకున్నార'న్నారు అద్దేపల్లి రామ్మోహనరావు. 'అట్టడుగు వర్గాల విప్లవాత్మక భావాలకి ప్రతినిధి, నిబద్ధత నిండిన నవలాకారుడు'గా ఆయన జంగయ్యకు ప్రశంసలందించారు. 'అపురూప కథాశిల్పి, తెలంగాణా రావిశాస్త్రి' అన్నారు తిరునగరి. 'స్పార్క్ నిండిన రచయిత'గా కితాబిచ్చారు 'జాతర' కృతి భర్త కాంచనపల్లి చిన వెంకట రామారావు. ఆలోచనాత్మక కథా సంవిధానం, అసమాన రచనాశైలి 'జాతర'లో ఉన్నాయని చెప్పారాయన.

సేకరణ: శరత్‌బాబు

## కథాంశం

ఊరి పటేలు కోడలైన రాధకి పిల్లలు లేరనే బాధ. బండి కట్టించి, ఆమెను గుట్టమీద పూజకు పంపిస్తాడు మామగారైన సీతయ్య. ఆమెభర్త పాండయ్యనూ కోడలితో వెళ్లమంటే వెళ్లడు. పట్నం వెళ్లి అక్కడే క్యాబరే చూస్తూ రోజు గడుపుతాడు. పూజకు వెళ్లొచ్చిన రాధ అటు తర్వాత నెల తప్పడంతో అంతా సంతోషిస్తారు. దేవుడి మహిమగా భావిస్తారు. నిజానికి ఆ 'మహిమ' పూజారిది. అది మన్మథ పూజ!! రాధకులాగే అతగాడు ఎందర్నో అలా గర్భవతుల్ని చేశాడనడంతో నవల ముగుస్తుంది.



# ప్రేమ ఎంత మధురం

ప్రాణిని బతికించేది ప్రాణవాయువే కానీ బతకడానికి స్ఫూర్తినిచ్చేది ప్రేమేనంటే అతిశయోక్తి కాదు. సౌరభము లేల చిమ్ము పుష్పవ్రజంబు... చంద్రికలనేల వెదజల్లు చందమామ.. ఏల సలిలంబు పారు... గాడ్పేల విసురు... ఏల నా హృదయంబు ప్రేమించు నిన్ను... అంటారు కృష్ణశాస్త్రి.

నీరు ప్రవహించడం, గాలి వీచడం... ప్రకృతిలో సహజాతిసహజమైన చర్యలు. ప్రేమకూడా అలాంటిదేనని కవి హృదయం. అందుకే ప్రేమ వేనవేల పాటలకు పల్లవైంది.

మనసైన వ్యక్తి చెంత నిలిస్తే మనసు పరిమళిస్తుంది... తనువు పులకరిస్తుంది. గతితప్పిన హృదయం ఏవో పాటలు పాడుకుంటుంది. అవి అవతలి మనసుకు విన్పించేదెలా? అచ్చంగా ఈ భావాల్నే అక్షరాల్లో పొదిగి ప్రింటవుట్ తీసినట్లు పాటలుగా పొదిగి మనకందించిన కవుల్ని తలచుకోవడానికి ప్రేమికుల దినోత్సవాన్ని మించిన సందర్భమేముంటుంది చెప్పండి?

'కళ్లున్నందుకు ఒక సారైనా కలవాలోయీ... కమ్మని కబురులు సరదాకైనా చెప్పాలోయీ...' అంటూ ప్రోత్సహిస్తూనే మరోవైపు 'ఒకరికిస్తే మరలిరాదు... గాయమైతే మాసిపోదు... మనిషికి మనసే తీరని శిక్ష...' అంటూ విరహ బాధతో గుండెలు కరిగిస్తారు మనసుకవి ఆత్రేయ. ప్రేమ కలిగాక ఒకరికొకరు ఎలా ఉంటారో... ఎలా ఉండాలో... ఆత్రేయ పలు పాటల్లో చెప్పారు. 'అద్దంలో కనిపించేది ఎవరికి వారు.. ఇద్దరిలో కనపడేది ఒకరికి ఒకరు...' అంతే కదా మరి! 'కన్నుల్లో నీ బొమ్మ చూడు..' అనుకోని ప్రేమికులు ఉంటారంటారా? భాషలు వేరు కావచ్చు, కానీ సృష్టిలో ప్రేమికులందరిదీ ఒకే భాష. అదే లిపిలేని కంటిబాస.

మరో జీవన సత్యాన్ని ఆత్రేయగారే ఎంత బాగా చెప్పారో చూడండి... 'ఇవ్వనంతవరకు ఈ హృదయమెంతో పెద్దది... ఇచ్చినపుడొక్కరికే తావు గల చిన్నది'. ఎంత అద్భుతమైన భావప్రకటన. ఎంతటి విశాలహృదయులకైనా ప్రియమైన వ్యక్తి దగ్గరికొచ్చేసరికి ఒక్కరికే కదా చోటు. ప్రేమంటే కేవలం లైంగికాకర్షణే కాదు... ప్రేమంటే మనసునీ మనసునీ పెనవేసే మధురమైన బంధమనీ, జీవితాన్ని వెలిగించే నమ్మకమనీ, జీవన ధర్మమనీ చెప్పకనే చెప్పారు .

వయసొచ్చిన మనసు తోడుకోసం అన్వేషిస్తున్నప్పుడు... ఓ మనసు తటస్థపడుతుంది. అది చూడగానే ఇతనేనా అతగాడు... అంటూ ఆరాటపడుతుంది. కనిపించకపోతే కలవరపడుతుంది. కనిపిస్తే... సిగ్గుతో కళ్లు వాలిపోతుంటాయి... మాట తడబడుతుంది. కాళ్లు కదలనంటాయి. ఇలాంటి పరిస్థితిలోనే 'మనసున తొణికే మమకారాలు, కనులను మెరిసే నయగారాలు తెలపరాదటే సూటిగా... తెరలు తీసి పరిపాటిగా...' అంటూ మనసు విప్పి తొలిప్రేమను వ్యక్తీకరించమంటారు 'షావుకారు' సినిమాలో సముద్రాల.

మనసులు కలిస్తే చాలదు... ఆ కలయిక కళకళలాడాలంటారు ఆత్రేయ. ఏ విధంగానంటారా... 'కన్నులు నీవే కావాలి.. కలనై నేనే రావాలి... మనసు నేనై ఉండాలి... మమత నీవై నిండాలి...' ఇలా! ఇక్కడే పనిలో పనిగా మరో మంచిమాట యువజంటల చెవిన వేస్తారు ఆత్రేయ. 'దైవం నీవై నడపాలి... ధర్మం నేనై నడవాలి...' అంటూ జీవనమార్గాన్ని నిర్దేశిస్తారు.

శ్రీశ్రీ పాటల్లోని ప్రేమ కూడా వాస్తవానికి ఎంతో దగ్గరగా హాయి గొలుపుతుంటుంది... ఆ హాయి మనసైనవారి సన్నిధిలోనేనన్న అనుభూతి కలుగుతుంది. 'తీయని కలలే ఫలియించేనే.. ఎల కోయిల తన గొంతు సవరించెనే..', 'వేయి రేకులు విరిసింది జలజం... తీయతేనియ కొసరింది భ్రమరం', 'కలకల విరిసి జగాలే పులకించెనే వలపులు కురిసి సుఖాలే చిలికించెనే..', 'అలరుల తోట అందాల బాట... హాయిగపాడే కోయిల పాట...', 'ఆ మబ్బు తెరలోన దాగుంది

చందమామ... ఈ సిగ్గు పొరలోన బాగుంది సత్యభామ', 'హాయి హాయిగా జాబిల్లి తొలిరేయి వెండిదారాలల్లి మందు జల్లి నవ్వసాగె..', 'విరిసిన హృదయమె వీణగా... మధురసముల కొసరిన వేళలా... తొలి పరువం తొలికెడు సోయగం... కని పరవశమందెను మానసం..'

ఇలా ఏ పాట తీసుకున్నా గుండె గొంతుకలోకి వచ్చి కొట్టుకు లాడే ప్రేమ భావాలే. చిక్కని పదాలకు చక్కని ప్రాస చేరి వీనుల విందు చేస్తుంది. మనసుని మరోలోకంలోకి లాక్కుపోతుంది. ప్రేమికులకు కావలసింది అదే కదా. లౌకిక ప్రపంచానికి దూరంగా... ఏకాంతంగా... ప్రేమపక్షులు జంటగా ఎగిరిపోవడానికి ప్రేరణనిచ్చే ప్రణయ గీతాలు వేనవేలు.

వలచిన వ్యక్తి అందచందాలు, హావభావాలు ఎంత అద్భుతంగా కన్పిస్తాయో చెప్పడానికి ప్రేమించే హృదయానికి ఇక్కడ కవిహృదయమూ తోడైందన్నమాట. 'నవ్వులా అవి కావు నవపారిజాతాలు... రవ్వంత సడిలేని రసరమ్య గీతాలు..' సినారె మార్కు కనిపెట్టారా?

'నన్ను దోచుకుందువటే వన్నెల దొరసాని... కన్నులలో దాచుకొందు నిన్నే నా సామి..', 'ఊహలు గుసగుస లాడె... నాహృదయము ఊగిసలాడె.. నీ యానతే లేకున్నచో విడలేను ఊపిరి కూడా' నిలువెల్లా ప్రేమలో మునిగిన భావాన్ని ఇంతకన్నా బాగా ఎవరు చెప్పగలరు?

'నడకా..హంసధ్వని రాగమా..అది నడుమా.. గగనంలో కుసుమమా' ఈ సందేహాలంకారం వేటూరిది. వీణవేణువైన సరిగమలూ ఆయనవే.

'గలగలమని నవ్వకే సొగసు కరిగిపోతుంది.. చిలిపికనులు మూయకే చీకటిపడిపోతుంది' కోపల్లె శివరాం గారి మధురమైన భావన ఇది.

'నా కంటి పాపలో నిలిచిపోరా... నీ వెంట లోకాల గెలవనీరా...', 'తనివి తీర లేదే...' దాశరథి గారి మరపురాని గీతాలకు కొదవే లేదు.

అనుభవిస్తేనే తప్ప అర్థంకాని ప్రేమ భావాన్ని అందరికీ అర్థమయ్యేలా మాటల్లోకి... అదీ కేవలం మూడు నిమిషాల్లో ముగిసే పాటలోకి తర్జుమా చేయడానికి చాలా ప్రతిభ కావాలి.

'నీ వలపూ నా వలపూ పూలమాలగా... నీవు నేను విడివడనీ ప్రేమమాలగా..(ఎంత చక్కటి చమత్కారం) కలలె నిజము కాగ కలకాలమొకటిగా... తెలియరాని సుఖములలో తేలిపోవగా...' ప్రేమవనంలో విహరించే సీతాకోకచిలుకలకు పింగళిగారు చెప్పిన ప్రేమ పాఠమిది.

'మల్లీశ్వరి'లో కృష్ణశాస్త్రి మనసున మల్లెల మాలలూగెనే... మరవగలమా? లలిత లలితమైన పదాలు... వినసొంపైన ప్రాస... విరహిణి మనసుని ఎలా తెలుపుతాయో ఒక్కసారి గుర్తుచేసుకోండి.

'కొమ్మల గువ్వలు గుసగుసమనినా.. రెమ్మల గాలులు ఉసురుసురనినా.. అలలు కొలనులో గలగల మనినా.. దవ్వుల వేణువు సవ్వడి వినినా.. నీవు వచ్చేవని, నీ పిలుపే విని కన్నుల నీరిడి కలయజూచితిని.. గడియయేని ఇక విడిచిపోకుమా.. ఎగసిన హృదయము పగులనీకుమా..'

గీతంలోని భావమాధుర్యమే కాదు, భానుమతి గాత్రమాధుర్యం నుంచీ కూడా బయటపడడం కష్టమే... కానీ తప్పదు. ఆస్వాదించడానికి ఇంకా చాలా పాటలున్నాయి మరి.

ప్రేమిస్తూ కాలం వెళ్లదీయకండి.. పెళ్లి చేసుకుని ఇల్లుచూసుకుని... ఇంటా బయటా జంటకవుల వలే అంటుకు తిరగాలోయ్... నవభావముల నవరాగముల నవజీవనమే నడపాలోయ్.. అంటూ యువజంటలకు సూచనలిస్తారు పింగళి నాగేంద్రరావు. ఆత్మవిశ్వాసాన్ని పెంచి, జీవితం పట్ల ఆశావహ దృక్పథాన్ని పెంపొందించే గీతాలకూ కొదవ లేదు. 'ఆడుతు పాడుతు పనిచేస్తోంటే అలుపూ సొలుపేమున్నది... ఇద్దరమొకటై చేయికలిపితే మనకూ ఎదురేమున్నదీ? '

ఇలా చెప్పుకొంటూ పోతే ఎందరో మహానుభావులు. వారంతా పాటల ద్వారా హాయిగొలిపే సంగీతమే కాదు... వినసొంపైన పదాల అల్లికతో అద్భుతమైన ప్రేమ పొదిగారు. అనుబంధాల్లో అనుసరణీయ విధానాలను అలవోకగా చెప్పారు. అందుకే... ఈ సారి పాట విన్నప్పుడు మీరూ గొంతు కలిపి కూనిరాగం తీసి ఆగిపోకండి. అర్థాన్ని ఆకళింపు చేసుకుని ముందుకు సాగిపోండి.. వలపు పాటల్లో బతుకు పాఠాల్ని రంగరించి మనకందించిన మహనీయులకు వందనాలర్పిస్తూ... రాగాల వేగంలో బతుకే ఒక పయనంగా జన్మజన్మలీలాగే సాగిపోవు మధురంగా...

*(ప్రేమికుల దినోత్సవం 14న)*

**- విస్మయ**



# సరదాగా...  గుర్తింపు

'ఏంట్రా అలా దిగులుగా ఉన్నావ్... ఏమైందేంటి? '

'ఏం చెప్పమంటావ్ గురూ! నిన్నటిదాకా ఎవరికీ తెలియనోళ్లు కూడా ఇవ్వాళ లీడర్లయిపోతున్నారు.. పేరు తెచ్చుకుంటున్నారు.. ఏ టీవీలో చూసినా ఆళ్లే! ఏ వేదిక మీద చూసినా ఆళ్లే! ఏ పేపర్లో చూసినా ఆళ్లే..'

'ఇంతకీ ఏంట్రా నీ బాధ? '

'ఏదైనా చేసి నాకూ పేరు తెచ్చుకోవాలనుంది గురూ'

'ఓస్ ఇంతేనా? దీనికేనా అంత దిగులు? పేరు తెచ్చుకోవడానికి, పేపర్లకు ఎక్కడానికీ బోల్లన్ని చిట్కాలున్నాయి..'

'ప్లీజ్.. ఏదైనా ఒక్క చిట్కాచెప్పు గురూ'

'చూడు.. మనిషి ఎదగాలంటే లేట్రల్ థింకింగ్ కావాలి..'

'అంటే ఏంటి గురూ? '

'ఏంలేదు.. అందరూ ఆలోచించేదానికి భిన్నంగా ఆలోచించడం.. అప్పుడే అందరి దృష్టిలో పడతావ్. శ్రీశ్రీగారినే తీసుకో..'

'ఏంచేశాడేంటి? '

'కవులంతా తాజమహల్ అందాలు వర్ణిస్తుంటే ఆయన దాని నిర్మాణానికి రాళ్లెత్తిన కూలీలెవ్వరు? అన్నాడు. జనం ఉలిక్కిపడ్డారు.. ఆయన చూపిన శ్రమసౌందర్యానికి జేజేలు పలికారు..'

'శభాష్'

'ఇంకా చెప్తా విను.. చందమామ అందాన్ని గురించి అంతా ఆహా ఓహో అంటుంటే- ఎడారిలో కాళ్లుతెగిన ఒంటెలా ఉంది చందమామ అన్నాడాయన'

'భలే ఉందే! అందుకే శ్రీశ్రీ మహాకవి అయ్యాడు'

'గుడ్! పాయింట్ పట్టుకున్నావ్'

'ఇకచూస్కో గురూ విజృంభిస్తా..'

'విజయీభవ వెళ్లిరా!'

★ ★ ★

'ఏంట్రా ఈ మధ్య కనబడ్డంలేదు? గడ్డానికి ఆ ప్లాస్టర్ ఏంటి? '

'ఏం చెప్పమంటావ్ గురూ? .. ఆరోజు నీ దగ్గర నుంచి సైకిల్ మీద ఇంటికెళ్లేప్పుడే నీ సూత్రాన్ని ప్రయోగించా..'

'ఏంచేశావ్‌రా బాబూ? '

'ఏంలేదు. దార్లో ఏదైనా అడ్డొస్తే సైకిల్ వెనక బ్రేకు వేయడం సాధారణం కదా? కాస్త భిన్నంగా ఉండాలని ఫ్రంట్‌బ్రేకు వేసి బొక్కబోర్లాపడ్డా! కోలుకోవడానికి ఇన్నాళ్లు పట్టింది'

'ఓరి వెధవా? ఆలోచనల్లో కొత్తదనం ఉండాలిగానీ సైకిల్ బ్రేకులు వేయడంలోనా? '

'అంటే ఏంటి గురూ? '

'నీలాంటివాళ్లకు అర్థంకావడానికే ఒక పెద్దాయన అన్నాడు- విన్నర్స్ డోంట్ డూ డిఫరెంట్ థింగ్స్, దే డూ థింగ్స్ డిఫరెంట్లీ అని..'

'ఓహో అలాగా? '

'వెధవా తెలుగులో నీకర్థంకాలేదు గానీ ఇంగ్లీష్‌లో చెబితే అర్థమైందా? ఓహో అలాగా అంటున్నావ్!'

'ఔనుగురూ! చాన్నాళ్లక్రితం భూమి చాపలాగో.. చదరంగం బల్లలాగో ఉండేదనుకునే వారంట జనం. అప్పుడు ఆయనెవరో గెలియోనో ఎవరో పిచ్చిముఖాల్లారా.. భూమి బంతిలా గుండ్రంగా ఉందన్నాడంట. మొదట ఎవరూ నమ్మలేదంట'

'ఆయన పేరు గెలీలియో. మొదట ఆయన మాట నమ్మకున్నా తర్వాత అదే నిజమని ఒప్పుకున్నారు జనం. అలా పేరొచ్చిందాయనకు. ఏదేమైనా సరే మనిషికి పేరు రావాలంటే చిన్నాచితకా ఇబ్బందులూ కొన్ని తప్పవు..'

'నిజమే గురూ. అయితే ఒక కండిషన్! ఇక నుంచి సైకిల్ ప్రయోగంలా యాక్షన్ పార్ట్ కాకుండా ఓన్లీ డైలాగ్ పార్ట్‌కే పరిమితమవుతా? లేకుంటే మళ్లీ మూతిపళ్లు రాలొచ్చు'

'ఓకే.. ఆల్ ది బెస్ట్'

★ ★ ★

'ఏంటోయ్ బొత్తిగా దర్శనాల్లేవ్.. ఊరెళ్లావా? అవునూ ఏంటి చేతికి కట్టుకట్టావ్? ఏమైందే

మిటి? '

'ఏంచెప్పను గురూ? ఆ రోజున నీ దగ్గర నుంచి వెళ్తుంటే రవీంద్రభారతిలో స్త్రీవాదుల సమ్మేళనం బ్యానర్ కన్పించింది. లోనికి వెళ్లాను. ఆడాళ్లు ఆణిముత్యాలైతే మగాళ్లు మంద్రగబ్బలు.. తరహాలో వాళ్లు కవితలు చదువుతున్నారు.. వీరికి భిన్నంగా ఆలోచించి చిటితే పేరొస్తుందని- మగాళ్లు మణిమాణిక్యాలైతే.. ఆడాళ్లు అంటగిన్నె లని ఓ కవిత ఆశువుగా చదివాను. అంతే.. అంతా వెంటపడ్డారు.. పరుగెత్తుతుంటే డివైడర్ తగిలి బొక్కబోర్లాపడ్డాను..'

'ఓర్నీ అసాజ్జెం గూలా! ఫెమినిస్టుల సభలో వాళ్లను తిడతావుట్రా పిచ్చివెధవా? సరే మరో సారి ఏదైనా కొత్తగా ఆలోచించు! ఉదాహరణకు యజ్ఞయాగాల పేర జనం జీవహింస చేస్తుంటే బుద్ధుడు అహింస ప్రచారంచేసి దేవుడయ్యాడు. అంతెందుకు? పోరాటానికి తుపాకులు, ఆయు ధాలు కావాలని అనుకునే రోజుల్లో అహింస, సత్యాగ్రహంతో పోరాడి, బాపూజీ మనకు స్వాతంత్ర్యం తెచ్చాడు.. విభిన్నమైన ఆలోచన అంటే ఇదే! సరే మరోసారి ట్రైచెయి.. బెస్టాఫ్ లక్'

★ ★ ★

'నమస్కారం గురూ? '

'ఎవరు బాబూ నువ్వు? నాకు నమస్కారం పెడ్తున్నావ్ ఎందుకు? '

'గురూ నేను.. నీ మేలు మరచిపోలేను.. అబ్బ..'

'ఈ గొంతెక్కడో విన్నట్లుంది.. అవును నువ్వు మా పానకాల్రావు కాదుగదా? '

'కాదేంటి కర్మ.. వాడ్నే! కాస్త కళ్లెట్టుకు చూడు'

'అవును కదూ? ఓర్నీ అసాజ్జెంగూలా? గుర్తే పట్టలేకపోయాను.. రెండు వారాలైంది.. ఎక్క డికి పోయావేంటి? ఏంటా తలకుకట్టు? కుంటు తున్నావేంటోయ్.. మూతి అదేంటి పక్కకు తోసుకుపోయింది.. ఏమైంది? '

'నా పిండాకూడైంది.. అబ్బ.. ఒళ్లు హూనమై పోయింది..'

'విసుక్కోకుండా చెప్పు! ఏమైందోయ్? '

'రెండు వారాల క్రితం ఆరోజు నీ దగ్గర నుంచి వెళ్తుంటే సికింద్రాబాద్ స్టేషన్ దగ్గర జై తెలంగాణా అంటూ కాలేజి పిల్లలు ర్యాలీ తీస్తు న్నారు. వాళ్లతో భిన్నంగా మాట్లాడి మేధావిగా గుర్తింపు పొందాలని... '

'కొంపతీసి వాళ్లముందు జై సమైక్యాంధ్ర అన్నావా ఏంటి? '




'మరీ అంత తెలివితక్కువోణ్ణా గురూ? అలా అంటే ఏం జరుగుతుందో నాకామాత్రం తెలీదా? '

'మరి..'

'వాళ్లకి ప్రపంచీకరణ లేదా గ్లోబలీకరణ ప్రయోజనాల గురించి చెప్పాలనుకున్నాను.. అందుకే నాయనలారా.. ఇవ్వాళ ప్రపంచం ఓ కుగ్రామమైపోయింది.. అమెరికావాడితోనూ, రష్యావాడితోనూ పక్కవీధిలో వాడితో మాట్లాడి నట్టే మాట్లాడుతున్నాం.. జాతిభేదాలు.. ప్రాంత భేదాలు లేవు.. మనిషి ఈరోజు విశ్వమాన వుడు.. అంటూ చెప్పబోయాను. అంతే కొట్టి నంత పనిచేశారు. 'జై తెలంగాణా' అంటావా అనవా? అని చావగొట్టి, చెవులు మూశారు.. పారిపోబోతే వెంటపడ్డారు.. దాంతో జై తెలం గాణా అంటూ పరుగెత్తాను. అయినా వదల్లేదు.. చేసేదిలేక స్టేషన్‌లో అప్పుడే ఏదోట్రైన్ బయలు దేరుతుంటే ఎక్కేశాను. అప్పటికే రాత్రి ఎనిమి దైంది.. ఒళ్లంతా పులిసినట్లుండడం వల్ల మగ తగా నిద్రపట్టింది.. మెలకువ వచ్చినప్పుడల్లా ఎందుకైనా మంచిదని 'జై తెలంగాణ' అంటూనే ఉన్నాను. మళ్లీ మెళకువ వచ్చేసరికి బయట ఏవో కేకలు.. గోల విన్పించాయి. మొదట భయం వేసింది.. అయినా మేకపోతు గాంభీ ర్యంతో 'జై తెలంగాణా' అంటూ రైల్లోంచి బయ టకు దూకాను.. అంతే గురూ.. చుట్టుముట్టి కుమ్మేశారు..'

'ఎవరు? '

'ఎవరేంటి? జనం!'

'అదేం? '

'నేను రైల్లోంచి దూకింది బెజవాడట మరి!'

—సీపీ కంతేటి



జార్జి గిస్సింగ్

# న్యూగ్రబ్ స్ట్రీట్

గిస్సింగ్ రాసిన మరికొన్ని నవలల్లాగే ఇది కూడా మెటా నవల. అంటే నవలా రచన గురించిన నవల. సమకాలీన సాహిత్య వ్యాపార ధోరణినీ, పబ్లిషర్ల నియంతృత్వాన్నీ వ్యవస్థకు అమ్ముడుపోయిన 'సక్సెస్‌ఫుల్ రచయితల్నీ' పాఠకులకు పరిచయం చేసిన 'ఇన్‌సైడర్' నవల.

డాక్టర్లు, లాయర్లు, రాజకీయాల్లోని వ్యక్తులు, పారిశ్రామికవేత్తలు, వ్యాపారస్తులు, ఫ్యాక్టరీ కార్మికులు, ఆఫీసు ఉద్యోగులు వగైరా ఎవరి గురించి రాసినా ఆయా వృత్తుల్లోని సాంకేతిక సంక్లిష్టతను గాక, పాత్రల జీవితాలమీద అవి చూపిన ప్రభావాన్ని మాత్రమే వివరిస్తారు. ఇది సహజం. ఎందుకంటే వృత్తిగా చూసినప్పుడు, ఏ పనిలోనైనా రోజువారీ యాంత్రికత, రొటీన్ తప్పదు. దీని గురించి చెప్పటానికేముంటుంది? 'శ్రమ'కూ 'పని'కీ తేడా చూసిన హన్నా ఆవెంట్ లాంటి సామాజిక శాస్త్రజ్ఞులు కూడా 'మనిషే' ముఖ్యమన్నారు.

అయితే 'నవలా రచన' లాంటి 'సృజనాత్మక కృషి' వెనక రచయితల యాంత్రిక శ్రమ వుంటుందని నిరూపించిన నవల 'న్యూగ్రబ్ స్ట్రీట్'. ఈ నవల రాయటానికి సుమారు నూటాయాభై ఏళ్ల క్రితం లండన్‌లో 'గ్రబ్ స్ట్రీట్' నిజంగానే ఉండేది. అచ్చుకాని రచయితలకూ, చవకబారు



'పాట్ బాయిలర్స్' రాసి చిల్లర డబ్బులు సంపాదించుకునే హాక్ రైటర్లకూ అది గమ్యం. సాహిత్య విపణిలో నవల ఒక అంగడి సరుకు. పారిశ్రామిక ఉత్పత్తికీ, నవలా రచనకూ తేడా లేదు.

"రాయటానికేమైనా వుందా లేదా అని ఆలోచించే తీరిక కూడా లేని దశలో రోజూ నాలుగువేల పదాలు రాసి 'కోటా' పూర్తి చేయటం 'సృజనాత్మకత' అనిపించుకుంటుందా? ఆత్మనూ, ఉన్నతాశయాలనూ తాకట్టు పెట్టక, ఈ యాంత్రిక 'సాహిత్య' లోకంలో బతకటమెలా?" అని ప్రశ్నిస్తాడు ఎడ్విన్ రియర్‌డన్.

**ప్రపంచ ప్రసిద్ధ నవలల పరిచయ వేదిక**

ఈ నవల ప్రారంభించే నాటికి గిస్సింగ్‌కు ముప్ఫై మూడేళ్లు. అప్పటికే ఎనిమిది నవలలు ప్రచురించినా గుర్తింపు లేదు. తాము చెప్పినట్టు రాస్తే తప్ప పబ్లిషర్లు కొనరు.

పందొమ్మిదో శతాబ్ది ఉత్తరార్ధంలో నవలల కోసం, సర్క్యులేటింగ్ లైబ్రరీ వ్యవస్థ బాగా బలపడింది. ఖరీదెక్కువ గనక, నవలల్ని కొని చదివే పాఠకులు తక్కువ. సర్క్యులేటింగ్ లైబ్రరీలో సభ్యత్వం తీసుకుంటే ఏడాది పొడుగునా పుస్తకాలు అద్దెకు తీసుకోవచ్చు. ఒకసారి ఒకే పుస్తకం. ఆర్థిక లాభాల కోసం లైబ్రరీ నిర్వాహకులు మూడు సంపుటాల నవలలు కావాలన్నారు. ఇలాంటి నిబంధనలతో, నవల అనవసరంగా పెరిగిపోయి, ఉపకథలు, వర్ణనలతో కృతకంగా తయారుకావటం తథ్యం. ఆనాటి కొన్ని నవలల్లో మనకు విసుగెత్తించే రొమాన్సులూ, డైలాగులూ, అడ్వెంచర్లూ ఉండటానికిదే కారణం. అంతేకాదు, లైంగిక, రాజకీయ, మత విషయాలు రాసేటప్పుడు రచయితలు సంయమనం పాటించాలని ఆంక్షలు విధించారు. ప్రధాన పాత్రలు 'ఆదర్శవంతం'గా వుండాలి. లైబ్రరీ నిర్వాహకులు కొనకపోతే, పబ్లిషర్లు నవలలెందుకు అచ్చేస్తారు? శతాబ్దాంతా

# జార్జి గిస్సింగ్ (1857 - 1903)

పేరున్న పేద రచయిత జార్జి గిస్సింగ్. నవలా రచన తిండిపెడుతుందనీ, పెట్టాలనీ అనుకున్నాడు. అనేక కష్టనష్టాలకోర్చి రాసిన తొలి నవల 'వర్కర్స్ ఇన్ ది డాన్'(1880)ను పబ్లిషర్లు తిరస్కరించడంతో స్వంతంగా ప్రచురించుకున్నాడు. 1884లో 'ది అన్‌క్లాస్డ్'ను ముప్పై పౌండ్లకూ, 1886లో 'ఇసాబెల్ క్లారెండన్'ను పదిహేను పౌండ్లకూ, 1886లో 'డెమోస్'ను వంద పౌండ్లకూ, 'న్యూగ్రబ్ స్ట్రీట్'(1891)ని నూట యాభై పౌండ్లకూ అమ్ముకున్నాడు. భుక్తికి మరేదైనా వ్యాపకం ఎంచుకొమ్మని సలహా ఇచ్చారు మిత్రులు. కాని "తిరుగుబాటు జెండా ఎగరేసేవాడే కళాకారుడు. రచనే నా ఆయుధం" అని మొండిగా వ్యవస్థ మీద పిడికిలి బిగించాడు గిస్సింగ్. 'అతని కష్టాలు స్వయంకృతం' అనుకున్నారు హితైషులు.

యార్క్‌షైర్‌లోని ఒక మధ్యతరగతి కుటుంబంలో జన్మించాడు. జార్జి రాబర్ట్ గిస్సింగ్. యూనివర్సిటీ ఆఫ్ మాంచెస్టర్‌లోని ఓవెన్ కాలేజ్ స్కాలర్‌షిప్‌ను అప్పట్లో గెలుచుకుని మరీ పై చదువులు కొనసాగించాడు. సహవిద్యార్థులూ, టీచర్లూ 'బ్రిలియంట్, జీనియస్' అని పొగిడారు. 1875లో షేక్‌స్పియర్ ప్రైజ్‌తో సహా, అనేక బహుమతులందుకున్నాడు. చదువు ముగిస్తే అక్కడే మంచి వుద్యోగం దొరుకుతుంది. ఆర్థిక సమస్యలన్నీ తీరతాయి. అయితే మారియాన్ హెలెన్ హారిసన్ అనే వేశ్యతో ప్రేమలో పడ్డాడు గిస్సింగ్. తనకే డబుల్లేవు. ఆమెకు రోజూ ఎంతో కొంత సాయం చేయాలి. మిత్రుల డబ్బు దొంగిలించాడు. పట్టుబడ్డాడు. నెలరోజుల కఠినకారాగార శిక్ష తర్వాత యూనివర్సిటీ నుండి గెంటివేశారు. 'తెలివితేటలున్న మంచి కుర్రాడు. పైకి రావలిసినవాడు' అని కొందరు సానుభూతిపరులు అతణ్ణి అమెరికా పంపించారు. అక్కడికి చేరి, షికాగో ట్రిబ్యూన్‌కి కథలు రాశాడు. కాని ఆకలి బాధ తీరలేదు. ఈయన సోదరుడు ఆల్గెర్నాన్ గిస్సింగ్ కూడా నవలా రచయతే.

1887లో ఇంగ్లండు తిరిగి వచ్చి, మారియాన్‌ను పెళ్లాడి నవలా రచయితగా స్థిరపడ్డాడు. ఇల్లు గడవటం కష్టమైంది. ప్రయివేట్ ట్యూటర్‌గా కొంతకాలం బతికాడు. కాని ఆ సంపాదననికి ఈ వ్యవస్థ కనుమరుగైంది. అది వేరే విషయం. గిస్సింగ్ తొలి నవలల్ని 'పాఠకులకు నచ్చవు' అంటూ పబ్లిషర్లు తిరస్కరించారు.

"ఇప్పటికే, ఒక వ్యక్తి తన జీవిత కాలంలో పూర్తిగా చదవలేనంత సాహిత్యం ఉంది గ్రంథాలయాల్లో. మరికొన్ని పుస్తకాలు రాసి పాఠకులను ఇబ్బంది పెట్టడం ఎందుకు? కేవలం వ్యాపారావసరాల కోసమే ఇప్పుడు రాస్తున్నారు. లోకానికేదో కొత్తగా చెప్పాలని రచయితలు తపించటం లేదు. కనీసం వ్యక్తిగత ఆనందం కూడా కాదు వాళ్ల లక్ష్యం. కేవలం పబ్లిషర్లు రాల్చే చిల్లిగవ్వల కోసం ఇష్టంలేని చాకిరీ చేస్తున్నారు. ఆర్థిక కారణాలు శాసించని దశలో సృష్టించేదే ఉత్తమ సాహిత్యం!" అంటూ ఆత్మ పరిశీలన చేసుకుంటుందొక పాత్ర.

మరోచోట బ్రిటిష్ మ్యూజియం రీడింగ్ రూమ్‌ను రచయిత వర్ణిస్తాడిలా.

"విశాలమైన హాలునిండా పొడుగాటి పుస్తకాల బీరువాలు. వాటి మధ్య దారి తప్పిన ఆత్మల్లా సంచరిస్తున్న మనుషులు. టేబుళ్ల ముందర, పుస్తకాలలో తలలు దూర్చిన పాఠకులు- మంటల ముందు శలభాల్లా, సాలెగూడులో చిక్కుకున్న కీటకాల్లా ఉన్నారు. హద్దుల్లేని ఈ పుస్తకాల చెరసాలలో స్వేచ్ఛగా విహరిస్తున్నామని భ్రమపడుతున్న ఖైదీలు వారు."

వ్యవస్థ కబంధ హస్తాలలో, ఆ బ్రహ్మారా

ఏ మూలకూ సరిపోలేదు. భార్య ఆల్కహాలి క్‌గా మారింది. ఆమెతో వేరుపడినా పోషణ ఖర్చులు భరించాడు. గిస్సింగ్ కళ్లముందే విప రీతంగా తాగి 1888లో మరణించింది మారి యాన్.

రచయితలు చిట్టెలుకలైతే, పబ్లిషర్లు గండుపి ల్లులు. దినదినగండంగా బతుకీడుస్తున్నవాడు ఎంతిచ్చినా తీసుకుంటాడు. ఎన్ని వందల పేజీలు ప్రచురించినా, రోజు కూలీలంత కూడా సంపాదించలేకపోయాడు గిస్సింగ్.

1891లో మరో నిరుపేద యువతి ఎడిత్ అండర్‌వుడ్‌ను పెళ్లిచేసుకున్నాడు. ఆమె మాన సికరోగి. ఫిట్స్ వచ్చినప్పుడు 'వయొలెంట్'గా మారుతుంది. ఎదుట ఎవరున్నా రక్కుతుంది, కొరుకుతుంది. ఇద్దరు పిల్లల్ని కన్న తర్వాత 1897లో ఆమె నుండీ విడిపోయాడు గిస్సింగ్. పిల్లల్ని చెల్లెళ్ల పోషణకిచ్చాడు. 1900లో ఎడిత్ అండర్‌వుడ్‌ను 'ఉన్మాది'గా డిక్లేర్ చేశారు డాక్టర్లు.

'న్యూగ్రబ్ స్ట్రీట్', 'ఇన్ ఎక్సైల్', 'ది ఆడ్ విమెన్', 'ఇన్ ది ఇయర్ ఆఫ్ ది జూబిలీ' లాంటివి దార్శనిక దృష్టితో రాసిన నవలలు. 'సంకుచిత సమకాలీన సాహిత్య ప్రపంచం వాటిని ఆమోదించలేకపోయింది'. సాహిత్య రంగంలో పెరిగిన వ్యాపారధోరణిని చిత్రి స్తాయి, విశ్లేషిస్తాయి ఆ నవలలు. పెట్టుబడిదా రుల చేతిలో దోపిడీకి గురవుతున్న కార్మిక వర్గం, పురుషాధిక్య సమాజంలో వర్కింగ్ విమెన్ సమస్యలు, విచ్ఛినమవుతున్న వివాహ వ్యవస్థ ఇతనికి కథావస్తువులు.

కొందరు విమర్శకులు గిస్సింగ్‌ను జార్జి మెరె డిత్, థామస్ హార్డీలతో పోల్చారు. హెన్రీ జేమ్స్, హెచ్.జి.వెల్స్, జోసెఫ్ కోన్రాడ్, స్టీఫెన్ క్రేన్‌లు ఇతనికి మంచి మిత్రులు. 1897-98లలో గ్రీస్ పర్యటన తర్వాత ఆరోగ్యం పాడైంది. ఊపిరితిత్తుల వ్యాధితో సానిటేరి యంలో చేరక తప్పలేదు. 1898లో తన నవల నొకదాన్ని అనువాదం చేయటానికి వచ్చిన గేబ్రి యెన్ ఫ్లూరీని పెళ్లాడి ఫ్రాన్స్‌లో స్థిరపడ్డాడు. కారణం అప్పటికి ఎడిత్ బతికుంది గనక, ఇంగ్లండ్‌లో వుంటే బహు భార్యత్వం నేరం కింద కేసు నమోదవుతుంది.

1903లో ఇతని నవల 'ది ప్రయివేట్ పేపర్స్ ఆఫ్ హెన్రీ రైక్రాఫ్ట్' (ఆత్మ కథాత్మక రచన) వెలుగు చూసింది. అప్పటికే గిస్సింగ్ ఆరోగ్యం కొండెక్కింది.

ఇతని ఇతర రచనలు ది నెదర్ వర ల్డ్(1889), ది ఎమాన్సిపేటెడ్ (1890), చార్లీ డికెన్స్ - ఎ క్రిటికల్ స్టడీ విమర్శనా గ్రంథం (1898).

క్షసి కరకు దంతాల కింద నలిగిపోయిన ఎడ్విన్ రియర్‌డన్‌కు మిత్రుడు జాస్పర్ మిల్వేన్. పరిస్థితులను మార్చటానికి విఫ లయత్నం చేయటం కన్నా, వాటిని స్వప్ర యోజనాలకనుకూలంగా మార్చుకోవటమే వివేకమంటాడు. అతడూ రచయితే. పత్రి కల ఎడిటర్లు, పబ్లిషర్ల కోరికలు తెలుసు కుని ఎలా రాయమంటే అలా, ఏది రాయ మంటే అదే రాస్తాడు.

ఈ ఇద్దరు మిత్రుల జీవితచిత్రణ ఆనాటి సాహిత్య ప్రపంచానికి దర్పణం.

బతకనేర్చినవాడు మిల్వేన్. "డబ్బు ముఖ్యం కాదనుకుంటే రాయటమెందుకు?" అని ప్రశ్నిస్తాడు.

"పాఠకులంటే నా కసహ్యం. అయి తేనేం, నా పుస్తకాలు కొనేది వాళ్లే. అందు వల్ల వాళ్లకిష్టమైందే రాస్తాను", అని సాహి త్య సృష్టి పట్ల తన నిబద్ధత ప్రకటిస్తాడు.

'విలువలు లేని రచనా వ్యాసంగమేల? డబ్బు కోసం గడ్డి తినాలా?' అని మడి కట్టుకుని, ఇష్టంలేని పని చెయ్యటానికి నిరాకరిస్తాడు రియర్‌డన్. ఈయన భార్య ఎమీ యూల్, 'యువ రచయిత పైకొ స్తాడు. లక్షలు గడిస్తాడు' అనే భ్రమతో పెళ్లి చేసుకుంది. నిజానికి రియర్‌డన్ రచ నలొకటి రెండు విమర్శకుల మన్ననలు కూడా పొందాయి. కాని అమ్ముడుపోలేదు. అతడు గెలుపుగుర్రం కాదు. పబ్లిషర్లు పెట్టుబడి పెట్టటానికి నిరాకరించారు. కొడుకు పుట్టినతర్వాత రియర్‌డన్ పరిస్థితి

దిగజారింది.

డబ్బు సంపాదించలేని మొగుడితో ఎలా వేగుతుందా ఇల్లాలు? కుటుంబ పోష ణార్థం రియర్‌డన్ ఒక 'వ్యాపార నవల' రాస్తాడు. కాని అలా రాయటం అతడి స్వభావంలోనే లేదు. చివరి ప్రయత్నంగా ఓ ఆస్పత్రిలో గుమాస్తాగా చేరతాడు. 'రచ యిత భార్య' అనిపించుకోవటంలో ఉన్న గౌరవం, హోదా, 'చిరుద్యోగి పెళ్లాం' అని పించుకోవటంలో లేదు. ఈ ఘోర అవ మానం భరించలేక ఎమీ యూల్ భర్త నుండి విడిపోతుంది.

ఎమీకి ఇద్దరు అంకుల్స్ వుంటారు. ఒక తను జాన్‌యూల్. ధనవంతుడు. మరొక తను ఆల్ఫ్రెడ్ యూల్, రచయిత. ఇతని కూతురు మారియాన్. తండ్రికి సెక్రటరీగా పనిచేస్తుంది. మారియాన్‌తో స్నేహం చేస్తాడు మిల్వేన్. త్వరలో అది ప్రేమగా మారుతుంది. కాని ఆమెను పెళ్లి చేసుకో వటానికి సాహసించడు. అతడి మాటల్లో.. 'పెళ్లంటే ఏమిటి? నచ్చిన స్త్రీలలో ఒకర్ని ఎంపిక చేసుకోవటం, ఆమె మీద కోరిక పెంచుకోవటం. కాని కాస్త ప్రయత్నిస్తే, ఏ స్త్రీపట్లయినా అలాంటి కోరి కలు పెంచుకోవటం సాధ్యమని మీరూ అంగీకరిస్తారు, కురూపి కాకపోతే సరి! మరి అలాంటప్పుడు డబ్బున్నమ్మాయినే చేసుకుంటే ఉభయత్రా లాభిస్తుంది గదా!"

రియర్‌డన్ మరణం తర్వాత ఎమీకి, అంకుల్ జాన్ నుండి పదివేల పౌండ్ల ఆస్తి కలసివచ్చిందని తెలిసి ఆమెనే చేసు కుంటాడు మిల్వేన్.

మిల్వేన్‌కు క్లెమెంట్ ఫాడ్జ్ సంపాద కత్వం వహించిన 'ది కరెంట్' పత్రికలో మంచి ఉద్యోగం దొరుకుతుంది. కొంత కాలం క్రితం ఆ పత్రికలోనే ఆల్ఫ్రెడ్ యూల్ రచనల్ని దారుణంగా విమర్శిస్తూ, అతడు పైకి రాకుండా అడ్డుపడ్డాడొక సాహితీ రాబందు. "ఆ విమర్శ రాసింది మిల్వేన్. అందువల్లే అతడికక్కడ ఉద్యోగం దొరికింది" అనుకుంటాడు ఆల్ఫ్రెడ్. ఇది తప్పు. తన శత్రువును ప్రేమిస్తుందా కూతురు మారియాన్? పెళ్లికి నిరాకరిస్తాడు. మనోవ్యధతో అతడి ఆరోగ్యం పాడవుతుంది. తండ్రిని పోషించ టానికి మారియాన్ ఏదో ఒక ఉద్యోగం చూసుకోక తప్పదు. అంకుల్ జాన్ వది లిన ఆస్తి కూడా ఆస్పత్రి ఖర్చులకే సరి పోదు. మారియాన్‌ను చేసుకోకపోవటా నికి మిల్వేన్‌కిదో మంచి సాకు.

ఈ నవలలోని మరో పాత్ర హెరాల్డ్ బిఫెన్. ఇతడికీ, 'వాస్తవిక, కళాత్మక' రచ నలు చేసే బలహీనత ఉంది. పబ్లిషర్లు కరుణించకపోవటంతో ట్యూషన్లు చెప్పి పొట్టపోసుకుంటాడు.

మిల్వేన్ చెల్లెలు డోరా. 'ఇంట్లో కూర్చుని ఏం చేస్తావు. బాలసాహిత్యం రాయి. బాగా అమ్ముడుపోతుంది' అని సలహా ఇస్తాడు ఆమెకు బెస్ట్ సెల్లింగ్ రచయిత జాస్పర్ మిల్వేన్. మరో చెల్లెలు మాడ్ బాగానే రాస్తుంది. కాని డబ్బున్న మిస్టర్ డోలోమోర్ తారసపడటంతో, 'అతణ్ణి చేసు కుని హాయిగా సంసారం చెయ్యి. ఈ రచ నల మాయా జూదం నువ్వాడలేవు' అని ఆమెకూ జ్ఞానబోధ చేస్తాడు.

డోరా కొన్నాళ్లకు వెల్ప్‌డేల్‌ను పెళ్లిచేసు కుంటుంది. నవలారచన లాభసాటి వ్యాపారం కాదని, ఔత్సాహిక రచయిత లకు పుస్తకాలు రాసి ప్రచురించుకోవటానికి అవసరమైన సలహాలిచ్చి, వాటికి మెరు గులు దిద్ది, నవలారచన వర్క్ షాపులు నిర్వహించి, ఇబ్బడిముబ్బడిగా సంపాది స్తాడు జాస్పర్ మిల్వేన్. ఈయనకు పబ్లి షర్లు ఆర్థిక సహాయం కూడా చేస్తారు.

'కళ కళ కోసం కాదు. దాన్ని వ్యాపా రంగా మార్చుకోవటమే కళాకారుడి సమర్థ తకు నిదర్శనం. ఇది వాణిజ్యయుగం. పోటీలో నిలువలేని వాళ్లంతా వ్యవస్థ కుళ్లి

పోయిందని శాపనార్థాలు పెట్టటం సహ జమే' అని మొగుడికి మొట్టికాయలు వేస్తుంది ఎమీ యూల్.

అయినా రచయిత ఆమెను సానుభూతి తోనే బతికిస్తాడు. "వ్యాపార ధోరణి వున్న మరే రచయితకైనా, మంచి భార్య కాగలి గిన సంస్కారముందామెకు" అంటాడు.

ఆ రోజుల్లో సాహిత్య బృందాల్లో, 'జాస్పర్' అనే పదం 'జిత్తులమారి నక్క' అనే అర్థంలో వాడారు. నిజానికి మిల్వే న్‌కు రియర్‌డన్ పట్ల గౌరవం లేదని కాదు. 'వ్యవస్థను నీకు అనుకూలంగా మార్చుకో' అని సలహా కూడా ఇస్తాడు మరోచోట.

"నా మిత్రుడొకడు నవలలు రాస్తాడు. జీనియస్ కాదు. కాని మంచి రచయిత. కొన్ని నవలలు అచ్చయ్యాయి. ఒక పుస్తకం రెండో ముద్రణ పొందింది. కాని, అందివచ్చిన అవకాశాలను ఉపయోగించు కునే చతురత అతనిలో లేదు. మంచి మిత్రులను స్వప్రయోజనానికి వాడుకో లేడు. అతనికన్నా సగం ప్రతిభ ఉన్నవాళ్లు గొప్ప రచయితలనిపించుకోవటం నాకు తెలుసు. పత్రికల్లో, విమర్శకుల్లో పలుకు బడి వున్న పరిచయస్తులుండటం చాలా కీలకం ఈ రంగంలో. మన గురించి వ్యాసాలు రాయించుకోవాలి. మంచి సమీ క్షలు చేయించుకోవాలి. వాళ్లందరూ మనల్ని ఆకాశానికెత్తుతూ ఉపన్యసించాలి. వీటికి కొంత ఖర్చు పెట్టక తప్పదు. కాని ఆ తర్వాత ఇప్పటికి పదింతలు సంపాదిం చవచ్చు మంచి సమీక్షలు వచ్చినా, నా మిత్రుడి నవలను ఏడాది తిరిగేలోగా అందరూ మరచిపోయారు. అది రచయి తకు ఆత్మహత్య లాంటిది" అని మారియా న్‌తో తన మనసులోని మాట చెబుతాడు.

ఎడ్విన్ రియర్‌డన్ మరణం తర్వాత, తన మిత్రుడు 'గొప్ప రచయిత' అని కీర్తిస్తూ వ్యాసాలు రాస్తాడు మిల్వేన్. ఆ ప్రశంసకు ఎమీ యూల్ పొంగిపోతుంది. ఆమె మిల్వేన్‌తో పెళ్లికి అంగీకరించటానికి అది కూడా ఒక కారణం.

లండన్ సాహితీ లోకంలో 1880 దశకం ఓ మైలురాయి. చవకబారు పత్రి కలు అప్పుడే పుట్టగొడుగుల్లా పుట్టుకొ చ్చాయి. 'నవలా రచన ఏకైక లక్ష్యం అమ్ముడుపోవటమే' అనే ప్రచారం కూడా జరిగింది. నిజానికి అంతకు ఓ శతాబ్దం ముందే డేనియల్ డీఫో, "ఇంగ్లీషు వాణి జ్యంలో 'నవల' ఒక ముఖ్యమైన భాగం" అని వ్యాఖ్యానించాడు. వ్యాపార ధోరణి విశృంఖలంగా పెరిగి, సాహిత్య విలువలు దిగజారిన సమయమది. 'వ్యవస్థ' నిబంధ నలకు లోబడి రాస్తే, రాయగలిగిన వాడె వడైనా ఎంతో కొంత చేసుకున్నాడు. ధిక్క రిస్తే మంచివాళ్లు కూడా రాసి ఇంట్లో పెట్టుకోక తప్పలేదు. 1898లో అచ్చయిన తొలి నవలకు గాను, ప్రముఖ రచయిత ఆర్నాల్డ్ బెనెట్‌కు దక్కిన ప్రతిఫలం అక్ష రాలా ఒక్క గినీ! ఆ కాలంలో ఆర్థిక అవ సరాల కోసమే కలం పట్టిన యువతీయు వకులెందరో.

నవలలోని పాత్రల జీవితాలన్నీ ఏదో విధంగా సాహిత్యరంగంతో ముడిపడి వున్నవే. అంకుల్ జాన్ నుండి లెగసీ వచ్చిన తర్వాత మారియాన్ ఒక పత్రిక స్థాపించాలనీ, దానికి తాను సంపా దకుడుగా ఉంటాననీ పట్టుపడతాడు ఆల్ఫ్రెడ్. తన సాహిత్య ప్రత్యర్థుల మీద యుద్ధం ప్రకటించటానికదో మార్గం. కాని లేక లేక వచ్చిన డబ్బును ఇలా మూర్ఖంగా ఖర్చు పెట్టాలా? నవలా రచయితలు, జర్న లిస్టులు, ఎడిటర్లు, లిటరరీ ఏజెంట్లు, ఇందులోని పాత్రలు. సామాజిక సంబంధా లను వ్యాపార సూత్రాలు శాసించినప్పుడు సాహిత్యం దానికి అతీతంగా వుండగలదా?

రియర్‌డన్ పర్ఫెక్షనిస్టు గనక రైటర్స్ బ్లాక్‌తో బాధపడతాడు. అతడికి ఆత్మగౌ

రవం కూడా ఎక్కువ. ఏమీ విడిగా వున్నప్పుడు కూడా ఆమెకు ప్రతినెలా ఆర్థిక సాయం చేస్తూనే వుంటాడు. ఆస్తి కలసివచ్చిన తర్వాత ఆమె, "ఇప్పుడు పరిస్థితి బాగుపడింది. మనం కలిసివుందాం. ఇన్నాళ్లూ నువ్వు సహాయం చెయ్యకపోతే ఏమయ్యేదాన్నో" అని భర్తకు ఉత్తరం రాస్తుంది.

"ప్రేమలేనిచోట వివాహబంధం అర్థరహితం. 'సహాయం' కోసమో, 'కృతజ్ఞత'తోనో మనం తిరిగి సంసారం చెయ్యకూడదు. సమాజం కట్టుబాట్లను అధిగమించి, నీ ఆత్మప్రబోధం ప్రకారం బతకటం నిజమైన సంస్కారమనిపించుకుంటుంది" అని ఆమె ప్రతిపాదనను తిరస్కరిస్తాడు.

రియర్‌డన్, బిఫెన్‌ల గురించి రాస్తూ,

"... వీళ్లు చేతకాని దద్దమ్మల్లా కనిపిస్తే తప్పు మీదికాదు. గొడ్డుచాకిరీ చెయ్యటమే తప్ప, సమస్యల్నధిగమించటం వీళ్లకు తెలియదా అని మీరు ప్రశ్నించవచ్చు. సామర్థ్యమంటే ఏమిటి? వీళ్లవల్ల ఎవరికీ ఏ వుపయోగమూ లేదా?

లేబర్ మార్కెట్లో అమ్ముడుపోని సరుకు కుళ్లిపోక తప్పదు. ఆ దృష్టితో చూస్తే వీళ్లు పుచ్చిన కూరగాయలే. అయితే మానవ సంస్కృతీ పరిణామ చరిత్రలో వీళ్ల పాత్ర తక్కువేమీ కాదు. కళాకారుణ్ణి, కూలీవాడితో పోల్చి ఎందుకూ పనికిరాడనటం ఎంతవరకు సబబు? అవును, వీళ్లు పోట్లాడలేరు. తిరుగబడలేరు. కాని ఎవరితో యుద్ధం చెయ్యాలి? సాహిత్యకారులుగా బతకగలిగితే, ఎన్నెన్ని గొప్ప రచనలందించేవాళ్లో! కాని వాళ్ల ప్రతిభ బూడిదలో పోసిన పన్నీరైంది. కాసులు పండించలేని కావ్యం చిల్లిగవ్వ కూడా చెయ్యదు. మేధావులందరికీ పుట్టిల్లు లండన్ అని చరిత్ర పుస్తకాల్లో చదువుకుని ఇక్కడికి వచ్చారు. కాని అదంతా గతం.

నిజమైన మేధావులు, రచయితలు, కవులు, కళాకారులు ఇప్పుడు లండన్ నుండి దూరంగా పారిపోతున్నారు. లైబ్రరీలు అంతటా ఉన్నాయి. పత్రికలంతటా వస్తాయి. ఇక్కడే ఎందుకుండాలి? ఇక్కడి పబ్లిషర్లకు కాలక్షేపం బఠాణీల్లాంటి పుస్తకాలు కావాలి. ఇక్కడి నాటక శాలల్లో క్లాసికల్ నాటకాలకు బదులు, చవకబారు బూతు ప్రదర్శనల కోసం ఎగబడతారు జనం. ఇప్పుడు లండన్ ఒక సాంస్కృతిక కేంద్రం కాదు. ఒక పెద్ద సూపర్ మార్కెట్ మాత్రమే" అంటూ రక్తాశ్రువులు కారుస్తాడు.

అయితే జాస్పర్ మిల్వేన్ గురించి రచయిత చేసిన వ్యాఖ్యలు ముందు చూపున్న రచయితలుగా పేరు పొందిన బతకనేర్చిన రచయితలందరికీ నేటికీ వర్తిస్తాయి-

"అతడి కలానికి రెండు వైపులా పదును. అనేక పత్రికలకు రాస్తాడు. ఒక్కొక్క దానిదీ ఒక్కొక్క స్టైలు. ఒకేవ్యక్తి యిన్ని రకాలు రాయగలడంటే ఎవరూ నమ్మరు. వ్యాపారం అంటే అదే మరి. కుడిచేత్తో చేసే పని ఎడమచేతికి తెలియకూడదు. రచయిత తన స్వంత అభిప్రాయాలు వ్యక్తం చేయకూడదు. పాఠకుల కోరిక మేరకే రాయాలి. ఇప్పుడున్న పరిస్థితుల్లో మంచి సాహిత్యం సృష్టించటం వృథా. మనం ఏం రాసినా హైప్ క్రియేట్ చెయ్యగలగాలి. పబ్లిసిటీకి సభలూ, సమావేశాలూ చాలా అవసరం. ఆర్భాటంగా ప్రముఖులతో పొగిడించుకోవాలి. మనుగడకోసం పోరాటం అనేది రచయితలకూ, పుస్తకాలకూ వర్తిస్తుంది. బిఫెన్ మంచి పుస్తకమే రాశాడు. కాని దాన్నెవరు చదువుతారు? అదే మిల్వేన్ ఏం రాస్తున్నాడో, ఎలా రాస్తున్నాడో మీరు చూస్తున్నారుగా! వేలాది, లక్షలాది పాఠకుల్ని సంపాదించుకున్నాడా లేదా? పబ్లిషర్లు అతడి వెంట పడుతున్నారా లేదా? "

**-ఎం.వసంత**

అపార్ట్‌మెంటాలజీ 25

యర్రంశెట్టి శాయి

# గూండా నెంబర్ వన్



(గత సంచిక తరువాయి)

"సార్, నేను దొంగనికాదు సార్- ఎక్కడా పనిదొరక్క అపార్ట్‌మెంట్స్‌లో ఎవరయినా ఏదయినా పని ఇస్తారేమోనని వెళ్తే- వీళ్ళంతా 'దొంగ దొంగ' అని నన్ను పట్టుకుని గొడ్డుని బాదినట్లు బాదారు సార్! ఇంగో ఈ రెండు చేతులూ విరిచేశారు సార్" అంటూ చేతులు వేలాడేసి ఏడుపు మొదలుపెట్టాడు.

వెంటనే న్యూస్ రీడర్ అందుకుంది.

"రాజూ! పాపం అతను దొంగ కాకపోయినా కూడా దొంగ అని అలా చిత్రవధ చేసిన ఆ అపార్ట్‌మెంట్ వాళ్ళేమంటున్నారు? వాళ్ళు అంత నీచంగా తోటిమనిషిని హింసించడం ఎందుకు జరిగింది?"

"గజనీ! మనుషుల్లో కొంత మందిలో ఇలాంటి రాక్షస ప్రవృత్తి ఉంటుందనడానికి ఈ రాంభరోసా అపార్ట్‌మెంట్సే ఉదాహరణ గజనీ! ఈ అపార్ట్‌మెంట్స్‌లో మెజారిటీ జనం ఇలాగే దారుణంగా, రాక్షసంగా ప్రవర్తించటం మనం ఇదివరలో కూడా చూశాం గజనీ. వీళ్ళమీద మనం రెండు నెలలు పాటు ప్రత్యేక కథనం కూడా ప్రేక్షకులకు అందించడం జరిగింది.

ఈ దొంగతనం ఆరోపించబడిన ఈ అమాయకుడి మీద వీరు చేసిన దాడిని చూసి మన సభ్యసమాజం తలదించుకునే పరిస్థితి ఉంది. వీళ్ల రాక్షసత్వానికి ఇది పరాకాష్టగా మనం భావించవచ్చు గజనీ"

"మరి ఆ అమాయకుడిని అలా చిత్రహింసలు పెట్టినందుకు- ఆ ఆపార్ట్‌మెంట్ వాళ్ళమీద పోలీసులు ఎలాంటి చర్య తీసుకుంటున్నారు?"

"ఆ విషయం ఇన్‌స్పెక్టర్‌గారినే అడుగుదాం గజనీ. భీమ్‌గారూ! ఈ దారుణానికి కారకులయిన వారిమీద ఏం యాక్షన్ తీసుకోబోతున్నారు"

భీమ్ హాపీగా మావేపు చూస్తూ మాట్లాడుతున్నాడు.

"ప్రస్తుతం గాయాలు తగిలిన వ్యక్తిని హాస్పిటల్‌కి పంపిస్తున్నాను. ముందు ఈ అపార్ట్‌మెంట్ వాళ్ళమీద ఎసాల్ట్ కేస్ రిజిస్టర్ చేస్తున్నాను. ఒకవేళ ఈ దొంగ హాస్పిటల్లో పోతే ఆ కేస్‌ని మర్డర్‌గా మార్చేస్తాను"

అంతవరకూ ఆ డ్రామా అంతా

చూస్తోన్న మాకు ఒళ్ళు మండిపోయింది. మొహిందర్‌సింగ్ టీవీ జర్నలిస్టు దగ్గరకె ళ్ళాడు దూకుడుగా.

"ఏయ్ మిస్టర్! ఏంటి? ఇన్‌స్పెక్టర్ సపోర్ట్ చూసుకుని తెగ రెచ్చిపోతున్నావ్? అసలేం జరిగిందో మమ్మల్ని అడగకుండా, మాట్లాడేందుకు మాకు ఛాన్సివ్వకుండా- అంతా 'వన్‌సైడెడ్'గా చూపిస్తున్నావేంటి? 'నిష్పక్షపాతంగా, నిర్భయంగా, వార్తలం దించే చానెల్ మా తుగ్లక్ టీవీ చానెల్' అని పబ్లిసిటీ చేసుకుంటున్నారుగా? ఇదేనా నిష్పక్షపాతం అంటే"

అతను వెంటనే కెమెరా ఆఫ్ చేయిం చాడు.

"చూడండి సార్! ఈ కేసులో మీ వర్షన్ ఏమిటో మీరు మా తుగ్లక్ చానెల్ ప్రేక్ష కులకు చెప్తామంటున్నారు! అంతేకదా? " అడిగాడతను.

"అవును మరి! చెప్పకపోతే వాళ్ళకి నిజా నిజాలు ఎలా తెలుస్తాయ్? "

"చెప్పండి సార్. ఎవరొద్దన్నారు? "

"కెమెరా ఆన్ చేయమను మరి? "

"ఒక పదివేల రూపాయలు ఎరేంజ్ చేయండి! వెంటనే మీకు అరగంట టైమి స్తాము- అది మా చానెల్ ఫీజ్"

అందరం ఉలిక్కిపడ్డాం

"ఏంటి? మేము మీ చానెల్‌కి పదివేలు లంచం కడితే అప్పుడు మాకు మాట్లాడ్డా నికి ఛాన్సిస్తారా? "

"అవున్సార్"

"అంటే మీది నిర్భయంగా వార్తలం దించే చానెల్ కాదు.. నిర్భయంగా లంచాలు గుంజే చానెల్ అన్నమాట!"

"అలా పదిసార్లు రిపీట్ చేయక్కర్లా! ఇష్టమయితే ఇవ్వాలి.. లేకపోతే మూసు కుని పోవాలి"

అంతవరకూ ఓపికపట్టిన మొహిందర్ సింగ్‌కి ఒళ్ళు మండిపోయింది. ఆ జర్న లిస్ట్ కాలర్ పట్టుకున్నాడు ఆవేశంగా.



"ఏంట్రా! నీకు పదివేలు కావాలా? నువ్ మమ్మల్ని పదివేలడిగిన సీనంతా ఈ సెల్ కెమెరాలో రికార్డ్ చేశాన్రా! ఇప్పుడే ఇది తీసుకెళ్ళి ఇంకో చానెల్‌కిచ్చి మీ తుగ్లక్ టీవీ బండారం బయటపెడతాం, తెల్సిందా? "

రాజు నవ్వాడు.

"ఛ! మీ ఎడ్యుకేటెడ్‌కి బ్రెయిన్ మోకా ళ్ళల్లో ఉంటుందనుకున్నాగానీ ఇలా అస్సలు లేదని ఇప్పుడే తెల్సింది. ఆ సెల్ వీడియో తీసుకెళ్ళి ఏ చానెల్‌కిస్తారో ఇచ్చు కోండి. ఫోండి"

అతని ధైర్యానికి మాకు మతిపోయింది.

ఇన్‌స్పెక్టర్ నవ్వాడు

"పిచ్చివాళ్ళల్లారా! ఒక చానెల్‌లో ఉన్న అవినీతిని ఇంకో చానెల్‌వాళ్ళు బయటపె ట్టర్రా"

"ఎందుకని? "

"అప్పుడు ఆ చానెల్‌లో అవినీతిని ఈ చానెల్‌వాళ్ళు బయటపెడతారు కదరా! ఆ మాత్రం కామన్‌సెన్స్ లేనోళ్ళు ఎక్కడ దొరికిన్రురా నాయినా" అంటూ నెత్తి కొట్టు

కున్నాడు.

ఈ వ్యవహారంలో మేమంతా పీకల్లోతు ప్రాబ్లెమ్స్‌లో కూరుకుపోతున్న ఫీలింగ్ కలిగింది మాకు.

"ఇప్పుడు ఈ చానెల్‌కి పదివేలిస్తేనే మంచిదేమో" అన్నాడు శంకరమూర్తి.

"లేకపోతే మనం పట్టుకున్నవాడు దొంగ కాదని ఈ చానెల్‌వాళ్ళూ, పోలీసులూ కలిసి మనల్ని జైల్లోకి నెట్టినా నెట్టవచ్చు"

"అయితే. ఒక పనిచేద్దాం! కేస్ రిజిస్టర్ చేయకుండా మన దారిన మనం పోదాం" అన్నాడు విజయ్.

"ఆ అయిడియా మంచిగున్నయ్. పదండి పోదాం" అన్నాడు హమీద్ మియా.

అందరం వెళ్ళబోతూంటే ఒక లేడీ కానిస్టేబుల్ అడ్డం వచ్చింది.

"సార్! ఎక్కడికి పోతున్నారు? "

"ఎక్కడికేమిటి? ఇంటికి"

"మీరీ ఏరియా వదలి వెళ్ళకూడదు సార్"

అందరం అదిరిపడ్డాం.

"ఎందుకు వెళ్ళకూడదు? "

"మీమీద కేస్ ఉంది కద్సార్. అది తేలే వరకూ ఇక్కడే ఉండాలి"

మేము అనుకున్నంతా అయింది.

"అంటే? మమ్మల్ని అరెస్ట్ చేస్తున్నారా? "

"ఇంకా లేద్సార్ ఆ దొంగని హాస్పిటల్‌కి పంపించాం- వాడు బతికితే మీరు బతికినట్లే. వాడు ఛస్తే మీరూ చచ్చినట్లే"

హమీద్‌మియా మొఖంలో కొంచెం కలవరపాటు కనిపించింది.

"యేక్యా కిరికిరీ హైభాయ్" అన్నాడు చిరాగ్గా.

"ఈ ఇన్‌స్పెక్టర్ కొంచెం ఎక్స్‌ట్రాలు చేస్తున్నాడు. మనం ఒక లాయర్ని తెచ్చుకుంటే బెటర్" అన్నాడు రెడ్డి.

నాకూ అదే మంచిదనిపించింది. మాకు తెల్సిన లాయర్లెవరా అని ఆలోచించాం! మా కొలీగ్ వాళ్ళ అన్నయ్య లాయరని ఒకసారి మాటల్లో అతను అన్న విషయం గుర్తుకొచ్చింది. వెంటనే మా కొలీగ్‌కి ఫోన్ చేశాం.

అంతా విన్నాక వాడు చెప్పిన మాట ఇది-

"మా బ్రదర్ మీ కేస్ టేకప్ చేయాలంటే ముందు యాభైవేలు ఫీజు కట్టాలి"

వెంటనే ఫోన్ కట్ చేసేశాం. మా అవస్థలు చూసి లేడీ కానిస్టేబుల్‌కి జాలి వేసినట్లుంది.

"సార్! నేనోమాట జెప్తా! ఇంటారా? "

"ఏంటది? "

"మీరంతా ఎడ్యుకేటెడ్ లాగున్నారు. ఇలాంటి లఫడాల్లోకెందుకెళ్తారో? నా మాట విని యస్ఐ సాబ్‌కి ఓ పదిహేను వేలు కొట్టండి. హాపీగా ఇంటికెళ్ళిపోవచ్చు"

మాకు తిక్క రేగిపోయింది.

"ఏంటి? పదిహేనువేలు కొట్టాలా? " మండిపడుతూ అడిగాడు రెడ్డి.

"దొంగ, మేము ఉన్నయ్? వాడు ఉన్నయ్? " కోపంగా అడిగాడు హమీద్ మియా.

"ఇదిగో సార్! పోన్లేగదా ఎడ్యుకేటెడ్ ఉన్నారు. కోర్టుకీ, జైలుకీ, లాకప్‌కీ తిరగాల్నంటే మీకు చాలా ప్రాబ్లెమ్ అవుతదని అయిడియా ఇచ్చినా! ఇష్టం లేకపోతే లాకప్‌కి పొండి సార్- నాదేం పోయింది? " అంటూ లోపలికెళ్ళి యస్ఐతో ఏదో మాట్లాడివచ్చింది లేడీ కానిస్టేబుల్.

వెంటనే నలుగురు కానిస్టేబుల్స్ మా దగ్గరకొచ్చారు.

"పదండి సార్. లాకప్‌లో కూచుందురు" అంటూ మేము ప్రొటెస్ట్ చేస్తున్నా వినకుండా మమ్మల్ని బలవంతంగా లాక్కెళ్ళి

లాకప్ రూమ్‌లోకి తోశారు. వళ్ళు మండి పోయి మేమంతా ఇన్‌స్పెక్టర్‌కి వ్యతిరేకంగా నినాదాలు ప్రారంభించాం.

"పోలీస్ ఇన్‌స్పెక్టర్ డౌన్ డౌన్- లంచాల డిమాండ్లు నశించాలి- న్యాయం గెలవాలి"

ఇన్‌స్పెక్టర్ పగలబడి నవ్వుతూ మా దగ్గరకొచ్చాడు.

"నీయవ్వ. మీరేం పాగల్ గాళ్ళున్నార్రా భయ్. పోలీస్ స్టేషన్లో వర్లుతే బయటికిన బడతాయ్? మనిండియాలో పార్లమెంట్, పోలీస్‌స్టేషన్లు స్పెషల్ మెటీరియల్‌తో కడుతార్రా! లోపట జరిగేవి బయటకి కన బడవ్. బయట ఒర్లేది లోపలికినబడదు. అక్కడ జరిగే ఫ్రాడ్ కనబడకుండా, ఇనబడకుండా మన రాజ్యాంగం అనే సిమెంట్‌తో మూసేసిన్రురా"

"చూడండి - మర్యాదగా మమ్మల్ని వదలకపోతే - హోమ్ మినిస్టర్‌కి ఫోన్ చేస్తాం"

ఈసారి కానిస్టేబుల్స్ అందరూ కూడా నవ్వేశారు.

"ఇదిగో సార్! మా యస్ఐగారిది చీఫ్ మినిస్టర్ లెవల్! హోమ్ మినిష్టర్ లెవల్ ఎప్పుడో దాటాడు" అంది లేడీ కానిస్టేబుల్.

"అయితే మా ఫామిలీస్ అందర్నీ చీఫ్ మినిస్టర్ ఇంటిముందే ధర్నా చేయిస్తాం" అన్నాడు శంకరమూర్తి.

ఇంకో కానిస్టేబుల్ నీతి వాక్యాలు చెప్పాడు.

"ఇగో సార్! మీరెవర్తానకు పోయినా గానీ మీకు సపోర్టుండది! ఎందుకో ఎరుకనా? మీరు ఒక జెంటిల్మెన్‌ని దొంగ అని అనటమే కాకుండా, అతనిని కొట్టారు. అతనేమో చావుబతుకుల మధ్య ఉన్నాడు. అంతేగాక అతను వీకర్ సెక్షన్ కాండేట్! అసంటోన్ని కొట్టినందుకు 'అట్రాసిటీస్' కింద బుక్ చేస్తారు. తెలుసునా? "



అందరం ఉలిక్కిపడ్డాం. "ఇదేదో కొత్త యాంగిల్ తగిలిస్తున్నాడ్రా" అన్నాడు విజయ్. దాంతో అందరికీ భయం పట్టుకుంది.

"బాస్ మనం వీలయినంత త్వరగా బయటపడకపోతే ఈ ఇన్‌స్పెక్టర్ మనల్ని కనీసం పాతిక సెక్షన్లకింద బుక్ చేయటం ఖాయం" అన్నాడు శంకర్‌మూర్తి.

"ఆ మాట నిజమే కానీ బయటపడేదెలా? " డౌటుగా అడిగాడు మొహిందర్.

మేము డిస్కస్ చేసుకుంటుండగానే ఇన్‌స్పెక్టర్ ఒళ్లంతా బాండేజీ కట్లతో ఆ దొంగను తీసుకొచ్చాడు మా దగ్గరకు-

"ఇగో! మీ మీద నేనే కేసు బుక్ జేయకుండా ఉండాల్నంటే ఇతన్తో రాజీపడండి!" అనేసి వెళ్లిపోయాడు.

దొంగ మావేపు హేళనగా చూశాడు.

"ఏందిరా భయ్- నన్నయితే బాగా కొట్టిన్రు కదా! నేను మీమీద కేస్ పెట్టకుండ ఉండాల్నంటే ఎంతిస్తారు? జల్దీ చెప్పాలే" అన్నాడు రుబాబుగా.

"ఏయ్! ఏందిరా వర్లుతున్నావ్? మా



అపార్ట్‌మెంట్స్‌లో దొంగతనం చేసింది చాలక మమ్మల్నే బెదిరిస్తున్నావా? " కోపంగా అరిచాడు రెడ్డి. మేమంతా రెడ్డిని సమజాయించాం.

"రెడ్డీ! మనం ఇంకా పాతకాలంలో ఉన్నాం! ఇప్పుడు దొంగలు, గూండాలు, హంతకులు, చీటర్స్, బ్రోకర్స్.. వీళ్లే మనకు లీడర్స్! వీళ్లమీదే అన్ని ప్రభుత్వాలు ఆధారపడి ఉన్నాయ్. అంచేత మనం వాళ్లతో గొడవ పెట్టుకోకూదదు. వాళ్లకు మర్యాద ఇవ్వాలి! వాళ్ల వృత్తుల్ని గౌరవించాలి" చెప్పాడు శంకరమూర్తి.

ఆ దొంగతో సంప్రదింపులు జరపడానికి విజయ్‌యాదవ్‌నీ, హమీద్‌మియానీ పంపించాం.

చివరకు అందరం ఏటీఎంలో నుంచి పదివేలు తెప్పించి దొంగకు ఇచ్చాం. అప్పుడు ఎస్ఐ మమ్మల్నందరినీ రిలీజ్ చేశాడు.

అందరం పోలీస్‌స్టేషన్ బయటికొస్తోంటే తుగ్లక్ ఛానెల్ జర్నలిస్ట్, కెమెరామెన్ కనిపించారు.

"ఏంసార్! రెండువేలయినా ఇవ్వరా! ఇస్తే మీ అందరి ఇంటర్వ్యూలూ 48 గంటలపాటు మా ఛానెల్లో టెలికాస్ట్ చేస్తాం సార్. నెలరోజుల పాటు స్క్రోలింగ్ చేస్తాం!"

"ఏయ్.. పోరా! ఇప్పుడు టెలికాస్ట్ చేసినా ఒకటే, చేయకపోయినా ఒకటే. ఒక్క పైసా ఇవ్వం, ఫో" అంటూ కసిరికొట్టాడు బోస్.

వాళ్లు నిరాశగా వెళ్లిపోయారు.

ఇదీ పోలీస్టేషన్‌లో మా మొదటి ఎక్స్‌పీరియెన్స్!

అది గుర్తుకొచ్చేసరికి మళ్లీ రెండోసారి ఇప్పుడు పోలీస్‌స్టేషన్‌కెళ్లాలంటే భయం వేసింది మాకు.

"అంటే పోలీస్‌కి భయపడి నోర్మూసుక్కూచోవలసిందేనా మనం? " అడిగాడు రెడ్డి.

"ఆ దొంగని పట్టుకున్నప్పుడు మనకైన అనుభవం గుర్తుంది కదా! అందుకని ఆ న్యూసెన్స్ మనకొద్దు" అన్నాడు బోసు.

"అవ్! పోలీస్‌స్టేషన్ గయేతో అప్నా పైసా చలేజాతే" హమీద్‌మియా అన్నాడు.

"సరే, వాళ్లు ఇంకో వారం వరకూ టైమిచ్చారు కదా! ఈలోగా మనం ఒక మీటింగ్ పెట్టుకుని ఆ గుండాలను ఎలా ఎదుర్కోవాలా అనేదా ప్లాన్ చేద్దాం" అన్నాడు శంకరమూర్తి.

అప్పటికి ఆ మీటింగ్ ముగించేశాం.

ఆ తరువాత నాలుగు రోజుల వరకూ మీటింగ్స్ జరుగుతూనే ఉన్నాయ్‌గానీ ఆ క్రెడిట్‌కార్డ్ బాకీ వసూలు గుండాగ్యాంగ్‌ని ఎలా ఎదుర్కోవాలో మాత్రం మాకు తెలీలేదు.

ఆదివారం దగ్గరపడుతూంటే సూర్యారావ్ పరేషాన్‌లో పడ్డాడు.

"ఈ గూండాల గురించి న్యూస్‌పేపర్లలో చాలా చదివాం గద్సార్. డబ్బు కట్టకపోతే పైకి గాయం కనపడకుండా కొట్టి ఛంపుతారంట" అన్నాడు భయపడుతూ.

చివరకు శనివారంనాడు మీటింగ్ పెట్టక తప్పలేదు.

ఆదివారంలోగా క్రెడిట్ కార్డ్ బాకీ తీర్చక పోతే సూర్యారావ్ పెళ్లాన్ని కిడ్నాప్ చేస్తా రన్న వార్త తెలిసి మీటింగ్‌కి లేడీస్ అంతా కూడా హాజరయ్యారు. ప్రెసిడెంట్ హమీద్‌మియా స్పీచ్ మొదలుపెట్టాడు.

"దోస్తోం! మన సొసైటీలో హర్ రోజ్ గుండాగిరీ బడ్‌తే జారహా హై!

అటు గవర్నమెంట్ దాదాగిరీ- ఇటు కార్పొరేట్స్ అద్దెకు తీసుకునే గుండాగిరీ"

"మధ్యల పోలీస్ గూండాగిరీ" అన్నాడు బోస్ ఆవేశంగా.

"ఇయాళ్రేపు ఈ క్రెడిట్ కార్డ్ గుండాలతో ఇంకా పెద్ద ప్రాబ్లెమ్. మనం ఫేస్ చేస్తున్నయ్!" తన స్పీచ్ కంటిన్యూ చేశాడు హమీద్‌మియా.

"ఇపుడు మన అపార్ట్‌మెంట్స్ కా ఆద్మీ సూర్యారావ్‌ని కూడా ఆ గుండాలు బెదిరించినయ్. ఖతమ్ కర్ దేతే బోల్‌కే చాకూ చూపించినయ్. అంతేకాదు. రంగారావ్ భార్యను బ్రోతల్ పనిచేసి పైసలు కట్టిమని చాలా వల్గర్‌గా మాట్లాడినయ్"

"షేమ్ షేమ్" అంటూ అరచింది లేడీస్ వింగ్ షైనీ.

"ఈ గుండాలను మనం ఎలా ఫేస్ చేయాలో అందరూ వాళ్ల అయిడియాలు చెప్తే- ఉస్‌కే ముతాబిక్- హమ్ ప్లాన్ కరేంగే" అంటూ ముగించాడతను.

ఒక్కొక్కరే లేచి నిలబడి వాళ్ల వాళ్ల అయిడియాలు చెప్పటం మొదలుపెట్టారు.

"ఆరోజు సూర్యారావ్‌ని ఇల్లు లాక్ చేసి బంధువులింటికి వెళ్లిపోమందాం" అన్నాడు విజయ్‌యాదవ్.

"అలా లాభం లేదు గురూ! ఆ గూండాలు రోజూ ఇంటికొచ్చి చెక్ చేస్తూనే ఉంటారు. లేదా ఆఫీస్‌కొచ్చి న్యూసెన్స్ చేస్తారు" అన్నాడు సూర్యారావ్.

"పోనీ నెలకు అయిదువేలు చొప్పున



కట్టి బాకీ తీర్చేస్తానని చెప్పక పోయావా? "

"చెప్పాను సార్! వాడేమంటున్నాడో తెలుసా? నెలకు ఏడువేలు ఇంట్రెస్ట్ అవుతుందిబే. కనుక నువ్ కట్టే అయిదువేలు ఇంట్రెస్ట్‌కే చాలదు.. ఇంక అసలెప్పుడు కడతావ్? అదిగాక నువ్వలా లైఫ్‌లాంగ్ వాయిదాల పద్ధతిలో కట్టుకుంటూపోతే ఇంక మేము నీ బాకీ ఎప్పుడు క్లోజ్ చేయాలి? మాకు బ్యాంక్ నుంచి కమీషన్ ఎప్పుడొస్తుంది? అన్నాడు.

"అదేంటి? మరి బ్యాంక్ వాళ్లు ఫోన్లో మాట్లాడినప్పుడు చెప్పారు కదా! ఎంతో కొంత ప్రతినెలా కట్టమని? " అని అడిగితే,

"ఎవడా బాడుకవ్ చెప్పింది? " అన్నాడు.

"కస్టమర్ కేర్ మేనేజర్"

"ఆ బాడుకవ్ ఎవళు చెప్పనీకి! బాకీలు వసూలు చేయమని కేస్ మాకిచ్చినాంక ఇంక ఏ నంగాగాడూ మాట్లాడొద్దు. ఎరుకనా? " అంటూ ఆ బ్యాంకోళ్లనూ నన్నూ తిట్టడం మొదలుపెట్టాడు. దాంతో ఆ



ఆలోచన వదిలేశా-"

ఇంకా అలాంటి సజెషన్స్ చాలా వచ్చాయ్ గానీ ఏదీ ఎవరికీ నచ్చలేదు.

"మీరింత పరేషానెందుకవుతున్నారో నాకర్థం కావట్లా! మన అపార్ట్‌మెంట్స్‌లో ఇంతమంది మగాళ్ళున్నారు. అంతమంది కలసి ఆ నలుగురైదుగురు గూండాల్ని టాకిల్ చేయలేరా? " అంటూ హేళనగా అడిగింది షైనీ.

మేమెవ్వరం మాట్లాడలేకపోయాం.

"అంటే దీనర్థం మన అపార్ట్‌మెంట్స్‌లో మొత్తం లేడీసే ఉంటున్నారు. మగాడనే వాడు లేడు! అంతేనా? " మళ్ళా అడిగిందామె.

ఆడాళ్ళంతా "అంతే" అంటూ అరిచారు.

"అయితే ఇంకా ఆలస్యం ఎందుకు? మగడ్రస్‌లో ఉన్న ఈ లేడీస్ అందరికీ గాజులు తొడిగి, బొట్టు పెడదాం"

అంతా నవ్వులు- కొంతమంది కాలేజ్ గాళ్స్ విజిల్స్ కూడా వేశారు. వాళ్ళ గొడవకు హమీద్‌మియా కోపంగా లేచాడు.

"దేఖో! గుండాలోగోంసే రకరానా అంత వీజీకాదు. మనకు రెస్‌పెక్ట్, ప్రెస్టీజ్ ఉంది. ఆ గుండాంకు లేయ్! మనకు ఫామిలీస్, పిల్లలు ఉంది. వాళ్ళకు లేయ్"

మళ్ళీ లేడీసంతా "షేమ్ షేమ్" అంటూ అరవటం మొదలుపెట్టారు.

మా అందరికీ వాళ్ళ మాటలు చాలా ఇన్సల్టింగ్‌గా అనిపించినయ్. విజయ్‌యాదవ్ ఆవేశంగా లేచాడు.

"ఇగో! ఆ గూండాలతో రకరాయించడం మాకు చేతకాక కాదు. వాళ్ళు అపార్ట్‌మెంట్స్‌కొచ్చి మంచిగా బిహేవ్ చేయకుంటే నడ్డీ ఇరగ్గొట్టగలం! కాకపోతే కొంచెం వెనకాముందూ ఆలోచించాలి."

"అయితే గాజులేసుకోవాల్సిందే" అంది సీతావరదరాజన్.

మేమలా డిస్కస్ చేస్తూండగానే లేడీస్ అందరూ కలసి పెద్దపాకెట్ తెచ్చి టేబుల్ మీదుంచారు.

"ఏంటిది? " అడిగాడు హమీద్‌మియా.

"మీ మగాళ్ళందరికీ మా లేడీస్ తరపున గిఫ్ట్"

"అలాగా! ఏంటా గిఫ్ట్? "

"ఓపెన్ చేయండి"

మొహిందర్ హడావుడిగా ఓపెన్ చేశాడు.

లోపల గాజులు కనిపించినయ్.

ఆడాళ్లంతా గొల్లున నవ్వుతూ తప్పట్లు కొట్టటం మొదలు పెట్టేసరికి విజయ్‌యాదవ్‌కి పౌరుషం ముంచుకొచ్చింది.

"ఇదిగో! మేము ఇన్ని రకాల ప్లాన్లు వేస్తోంది ఆ గూండాలకు భయపడి కాదు. అనవసరంగా కొట్లాటలు, కత్తిపోట్లు ఎందుకులే అని!" ఆవేశంగా అన్నాడు.

"కత్తిపోట్లతో మనాళ్ళు పోయినా ఫర్లేదు- 'వీరస్వర్గం వీక్' సెలబ్రేట్ చేస్తాం! పోయినవాళ్ళ విగ్రహం కాంపౌండ్ ఎంట్రెన్స్‌లో పెడతాం" అంది షైనీ.

"అయ్ సపోర్ట్ షైనీ" అన్నాడు కృష్ణ

మూర్తి. షైనీ తల పట్టుకుంది.

"నాకు నీ సపోర్ట్ అవసరంలేదని లక్ష సార్లు చెప్పాను"

"ఎన్ని లక్షలసార్లు చెప్పినా ఎంజాయ్ చేస్తూ వింటాను"

విజయ్ మాటలు, షైనీ అవహేళనలు మా అందరికీ వీరావేశం కలిగించినయ్.

"యస్! మనమంతా కంబైన్డ్‌గా ఆ గూండాలను ఎదుర్కొందాం" అన్నాడు శంకరమూర్తి.

"మనం మగాళ్ళమా, కాదా అని ఈ లేడీస్‌కి డౌట్ ఉన్నయ్. అందుకని అపన్ లోగ్ ఓ గుండోంసే మొకాబ్లా కరేంగే!" అన్నాడు హమీద్‌మియా.

మగాళ్ళందరూ తప్పట్లు కొట్టారు.

"ఆ గూండాలు ఇంకోసారి మన అపార్ట్‌మెంట్స్‌లోకి రాకుండా వాళ్ళకు లెసనిద్దాం" అన్నాడు రెడ్డి.

మర్నాడు అందరం పొద్దున్నే లేచి ఆ గూండాలను ఎదుర్కోవాలని డిసైడ్ చేసుకున్నాక డిస్పర్స్ అయిపోయాంగానీ ఆ రాత్రి భయంతో ఎవరికీ నిద్రపట్టలేదు.

ఆ గూండాలతో పెట్టుకుంటే మాకు ప్రస్తుతం సంఖ్యాబలం ఉంది గనక ఒకరోజుకి ఎలాగోలా ఎదుర్కోవచ్చు

కాని ఆ తరువాత ఆ గూండాలు రెచ్చిపోతే ఏం జరుగుతుందో మేము టీవీలో, న్యూస్‌పేపర్లలో చూస్తూనే ఉన్నాం.

మేము ఒంటరిగా వెళ్తున్నప్పుడు ఏ రోడ్ మీదయినా ఎటాక్ చేయవచ్చు లేదా ఏసిడ్ దాడి చేయవచ్చు అదీగాకపోతే పిల్లల్ని కిడ్నాప్ చేయవచ్చు

ఇలా చివరకు మా లైఫ్ మిజరబుల్ అయ్యే ప్రమాదం ఉంది.

ఆ భయంతో రాత్రి పన్నెండింటికి నేను మా అపార్ట్‌మెంట్స్ బేస్‌మెంట్‌లో పచార్లు చేస్తూంటే ఒకళ్ళ తర్వాత ఒకళ్ళుగా హమీద్‌మియా, విజయ్‌యాదవ్, కృష్ణమూర్తి, బోసు, రెడ్డి, మొహిందర్, శంకరమూర్తి అందరూ అక్కడికి చేరుకున్నారు.

"ఏంటి? ఇంత రాత్రయినా మీరెవరూ నిద్రపోలేదా? " అడిగాను వాళ్ళను.

"లేదు" అన్నాడు హమీద్‌మియా.

"అదేంటి.. పన్నెండవుతోంది కదా? "

"నాకు నిద్ర వస్తయ్‌లేదు"

"ఎందుకని? "

"అదే సమజ్ కావటంలే- కొంచెం టెన్షన్ వస్తున్నయ్"

"నాకూ అంతే. ఏదో తెలీని టెన్షన్" అన్నాడు కృష్ణమూర్తి. అందరకీ అప్పుడర్థమయింది.

గూండాలంటే భయంవల్లే నిద్రపట్టటం లేదని.

తమాషా ఏంటంటే మా గ్యాంగ్‌లో ఒకే ఒక్క వ్యక్తి మిస్సయ్యాడు. అతను సూర్యారావు.

ఆ గూండాలను మేము ఎదరుక్కోబోతున్నామన్న సంతోషంతో ఏ టెన్షనూ లేకుండా హాపీగా గాఢనిద్రపోయాడతను.

"పోనీ మనం కల్పించుకోకుండా ఊరుకుంటే? " అన్నాడు బోసు.

"ఇంకేమయినా ఉందా? ఆ షైనీ మిగతా లేడీస్ అందరి దగ్గరా మనందరి పరువు తీసిపారేస్తుంది"

"నిన్న అననే అంది కూడా! మీ వల్లకాపోతే నాకు చెప్పండి. మా లేడీస్ అంతా కలసి వాళ్ళని ఎదుర్కొంటామని" చెప్పాడు కృష్ణమూర్తి.

దాంతో మళ్ళీ పౌరుషం ముంచుకొచ్చిందందరికీ.

"ఏమైనా సరే. మనం వెనక్కు తగ్గటానికి వీల్లేదు" అన్నాడు విజయ్‌యాదవ్.

"అయినా మనం ఈ సినిమాలు, గినిమాలు చూసి వాళ్లని ఓవర్ ఎస్టిమేట్ చేస్తున్నాం గానీ మనం ఇంతమందిమి గుమికూడితే వాళ్లకీ భయంగానే

ఉంటుంది. ఇంకోసారి మన జోలికి రారు..." అన్నాడు రెడ్డి.

"అవ్- మనం ధైర్యంగా ఉంటయ్" అన్నాడు హమీద్ మియా.

వెంటనే కొంత ధైర్యంతో అందరం డిస్పర్స్ అయిపోయాంగానీ మిగతా రాత్రంతా కూడా నిద్ర లేకుండానే గడిపాం.

ఉదయం ఏడింటికే అందరం అపార్ట్‌మెంట్ ఎంట్రెన్స్ దగ్గర కుర్చీలు వేసుకుని కూర్చున్నాం.

అపార్ట్‌మెంట్స్‌లో ఉన్న ఓ పదిమంది స్టూడెంట్స్ కూడా హాకీ స్టిక్స్ పట్టుకుని రెడీగా నిలబడ్డారు.

మా మధ్యలో సూర్యారావ్ హేపీగా ఏదో పాట కూనిరాగం తీస్తున్నాడు. అందరికీ లోలోపల టెన్షన్‌గానే ఉందిగానీ బయటకు మాత్రం చాలా కేర్‌లెస్‌గా, ఎంత పెద్ద గూండానయినా ఇరగ్గొట్టే లెవల్లో కనబడ్డానికి ప్రయత్నిస్తున్నారు.

షైనీ తన గ్యాంగ్‌తో వచ్చి మా అందరినీ అభినందించింది.

"మగాళ్లంటే మీరు" అంది.

"ఇదంతా నీ చలవే" అన్నాడు కృష్ణమూర్తి.

"ఆ చీప్ పొగడ్తలే నాకు చిరాకు"

"ఇది పొగడ్త కాదు- ఫ్యాక్ట్"

"నువ్ చెప్పటం వల్ల చీప్‌గా ఉంది. ఫ్యాక్ట్ కూడా" అంటూ పంచ్ ఇచ్చింది.

సరిగ్గా మధ్యాహ్నం పన్నెండున్నరకి ఆ గూండాల కారు వచ్చి ఆగింది. కనీసం ఇరవై లక్షలుంటుందా కారు.

మన దేశంలో గూండాలు తప్ప ఇంకెవ్వరూ 'ఎఫోర్డ్' చేయలేరది. ఇద్దరు రికవరీ ఆఫీసర్లు సఫారీ సూట్‌లో, బ్రీఫ్‌కేసులు పట్టుకుని దిగారు.

మమ్మల్ని చూసి షాకవుతారనుకున్నాం గానీ అస్సలు పట్టించుకోలేదు వాళ్లు. తిన్నగా గేట్లో నుంచి లోపలికి వచ్చి మా కుర్చీల మధ్య నుంచి నడిచి కరెక్ట్‌గా సూర్యారావు దగ్గర ఆగారు.

మేమంతా లేచి వాళ్ల చుట్టూ గుమిగూడాం.

"ఏందిరా! పైసలు రెడీ చేసినావా?" అడిగాడు ఒక గూండా- సూర్యారావ్‌ని."

"లేదు"

"ఎందుకని?"

"బ్యాంక్‌వాళ్లు నా లోన్ అప్లికేషన్ రిజెక్ట్ చేశారు"

"ఎందుకని?"

"నేనిచ్చిన షూరిటీలు చెల్లవంటున్నారు"

"ఎందుకు చెల్లవ్?"

"వాళ్లిద్దరూ... ఆ బ్యాంక్ దగ్గరే లోన్ తీసుకొని ఎగ్గొట్టారంట"

ఆ గుండాకిక కోపం ఆగలేదు.

చటుక్కున సూర్యారావ్ కాలర్ పట్టుకున్నాడు.

"ఏంది బే డ్రామాలాడుతున్నావ్, సాలా! మొన్నొచ్చినప్పుడు ఇయాళ పైసలిస్తానన్నావ్. ఇప్పుడు నకరాల్జేస్తున్నావా?"

"ఇదిగో సాలే గీలే అనకు. నేనూ అనాల్సొస్తది" అన్నాడు సూర్యారావ్.

ఆ మాటతో అందరం షాకయ్యాం.

పరమ పిరికివాడయిన సూర్యారావ్‌కి అంత ధైర్యం ఎలా వచ్చిందో మాకు అర్థం కావడం లేదు.

"వాడు మనల్ని చూసుకొని రెచ్చిపోతున్నట్లున్నాడు" అన్నాడు బోస్ నా చెవిలో. ఆ గూండా కూడా సూర్యారావ్ అలా రివర్సవటం చూసి కొంచెం కంగుతిన్నాడు. కానీ అంతలోనే వాడికి బీపీ పెరిగిపోయింది.

"బాడ్‌కవ్- మా బ్యాంక్‌కి పైసలెగ్గొట్టినోడికి నేను ఇజ్జత్ ఇవ్వాలి బే? ఛల్ సాలే- నీతాన పైసలేట్ల వసూల్జెయ్యాలో నా కెరుక బే. ఛల్" అంటూ కాలర్ పట్టుకుని

లాక్కుపోవటం మొదలుపెట్టాడు.

సూర్యారావ్ భార్య భోరున ఏడుస్తూ "అయ్యో! ఆయన్ని కిడ్నాప్ చేస్తున్నార న్నయ్యా! ఆయన్ని రక్షించండి" అంటుంటే ఇంక ఉపేక్షించటం మాకు సాధ్యం కావ డంలేదు.

మరోపక్క షైనీ, సీతావరదరాజన్, శ్రీదేవి, బిపాషా అందరూ మాకు గాజుల దండ చూపిస్తున్నారు.

ఆ అవమానం భరించలేక ముందు విజయ్‌యాదవ్ కదిలాడు. "హలో- ఒన్ మినిట్" అన్నాడు ఆ గూండాల దగ్గరకు నడిచి. ఆ గూండాలు ఆశ్చర్యంగా వెనక్కు తిరిగారు.

వాళ్లు ఇంతవరకూ ఏ కాలనీకి వెళ్లినా, ఏ అపార్ట్‌మెంట్స్‌కెళ్లినా ఒక్కడు కూడా ఇలా 'హలో ఒన్ మినిట్' అంటూ రుబా బుతో అనటం వినలేదు.

"ఏంది? " అన్నాడు ఒకడు విజయ్ యాదవ్‌కి ఎదురుగ్గా వచ్చి.

"ఏంది క్యా? సూర్యారావ్‌ని ఎందుకు తొల్కపోతున్నయ్? " అంటూ కల్పించుకు న్నాడు హమీద్‌మియా.

"ఎక్కడికి తీసుకుపోతున్నారు? " అంటూ మరోమూల నుంచి ప్రశ్నించాడు మొహిందర్ సింగ్. ఇలా ఇంతమంది మాట్లాడేసరికి ఆ గూండాలకు పౌరుషం పొడుచుకొచ్చింది.

"వాడు మాకు పైసలు గట్టాలే. గుంజ్కు పోతున్నాం. మధ్య మీకేమయింది? "

"నేను ఈ అపార్ట్‌మెంట్స్ అసోసియే షన్ ప్రెసిడెంట్ ఉన్నయ్. నా పర్మిషన్ లేకుండా ఎట్ల గుంజ్కుపోతయ్ నువ్వు" అన్నాడు హమీద్‌మియా ఆవేశంగా.

అతనలా అనేసరికి లేడీస్ అంతా చప్పట్లు కొట్టారు.

"జిందాబాద్ జిందాబాద్- ప్రెసిడెంట్ హమీద్ మియా జిందాబాద్" అంటూ షైనీ అరిచేసరికి అందరూ నినాదాలు




చేశారు.

ఇది ఆ గూండాలకు ఇంకా కోపం తెప్పించింది. పైగా లేడీస్ ముందు అలా హమీద్‌మియా రుబాబుగా మాట్లాడటం కూడా వాళ్ళకు నచ్చలేదు.

"అంటే ఈ అపార్ట్‌మెంట్స్‌లో ఉన్నోళ్ల గురించి వకాలత్ నీదా? "

హమీద్ మొఖంలో భయం కనబడు తోంది గానీ అంతమంది అపార్ట్‌మెంట్ వాళ్లముందు కొంచెం 'షో' పుటప్ చేయక పోతే వచ్చే అపార్ట్‌మెంట్ ఎలక్షన్స్‌లో గెలవటం ప్రాబ్లెమ్ అవుతుందన్న విషయం గ్రహించి, ఏ మాత్రం భయం లేనట్లు నిర్లక్ష్యంగా జవాబిచ్చాడు.

"అవ్- ఈ అపార్ట్‌మెంట్స్‌ల నాదే జవా బుదారీ ఉన్నయ్"

"ఏంరా నీ జవాబుదారీ- నువ్వేం తురు మ్ఖాన్ అనుకుంటుంటివా ఈడ? నేనీడ్ని జబర్దస్తి తొల్కపోతున్నా! ఏం పీక్కుం టావో పీక్కో" అనేసి సూర్యారావ్‌ని ఈడ్చు కుపోవటం మొదలుపెట్టాడు.

దాంతో హమీద్‌మియా ఆవేశంగా ఆ గూండాని ఒక్కతోపు తోశాడు.

మిగతా కమిటీ వాళ్ళందరూ కూడా ఒక్కసారిగా ముందుకొచ్చి ఆ గూండా గ్రిప్‌నుంచి సూర్యారావ్‌ని విడిపించి అతని చుట్టూ వలయంగా నిలబడ్డారు.

ఆ గూండాకు ఆవేశం ఆగలేదు.

"సాలే- మందెక్కువున్నారని రెచ్చిపోతు న్నారులే! నీయవ్వ.. అందర్నీ ఖతమ్ చేస్తా" అంటూ కత్తులు తీశారిద్దరూ.

మాకా పరిస్థితిలో ఏంచేయాలో అర్థం కాలేదు.

వాళ్ళిద్దరూ కత్తుల్తో ఎటాక్ చేస్తే మేమంతా గాయాలతో హాస్పిటల్లో చేరా ల్సిందే.

అలా అని వెనక్కు తగ్గటం కూడా ఇన్సల్టే.

"ఏంటి? ఖతమ్ జేస్తవా? ఎట్లా ఖతమ్ చేస్తావో నేనూ చూస్తా!" అన్నాడు విజయ్ యాదవ్ వాళ్ల ముందుకెళ్లి.

"కత్తులు మీ దగ్గరే కాదు.. మా దగ్గరా ఉన్నయ్" అన్నాడు మొహిందర్‌సింగ్.

ఆ మాటతో వాళ్ళకు కొంచెం డౌట్ వచ్చినట్లుంది. నిజంగానే మా దగ్గర కత్తు లున్నాయోమోనని అందరి చేతులవంకా చూశారు.

"అరే జన్నీ! ఈళ్లనిప్పుడేమనొద్దు మనం! ఈ సాలేగాళ్ళ సంగతి రేపు చూద్దాం!" అన్నాడు అందులో ఒకడు.

"అవ్! రేపు మన గ్యాంగ్‌ని దించి, ఈ సాలేగాళ్ళందర్నీ బొక్క విరగ్గొడదాం" అన్నాడు రెండోవాడు.

తర్వాత వాళ్ళిద్దరూ వెళ్ళిపోయారు.

వెంటనే మా వాళ్లందరూ నినాదాలు మొదలుపెట్టారు హ్యాపీగా.

"జీత్ గయా జీత్‌గయా.. హమీద్ మియా జీత్‌గయా!"

గో బ్యాక్ గూండాలోగ్... గో బ్యాక్.. గో బ్యాక్"

సూర్యారావ్ హేపీగా అందరికీ కృతజ్ఞ తలు చెప్పాడు.

"మీ అందరి సపోర్ట్ చూసుకుని నేను వాళ్లతో కొంచెం ఎక్స్ట్రా మాట్లాడా బ్రదర్. ప్రాబ్లమేమీ లేదుకదా?"

"నో ప్రాబ్లెమ్. వాళ్ళను ఇంక కేర్ చేయాల్సిన పనిలేదు. హమ్ తుమారే సాత్ హై" అన్నాడు మొహిందర్.

అందరం చాలాసేపు పెద్ద విజయం సాధించిన ఫీలింగ్‌లో గడిపాంగానీ మా మూడంతా సీతావరదరాజన్ చెడగొట్టే సింది ఒకే ఒక్క కొశ్చెన్‌తో.

"చాలా డేర్ డెవిల్స్‌లాగా ఆ గూండాల్ని జీత్ చేశారు, ఓకే! కానీ రేపు వాళ్లు పెద్ద గ్యాంగ్‌తో వచ్చి ఎటాక్ చేస్తే ఏం చేస్తారు?" అడిగిందామె.

అందరికి పల్స్ డ్రాప్ అయిపోయినయ్.

ఆ సిట్యుయేషన్ ఊహించుకోడానికే భయం వేసింది. ఓ పాతికమంది గూండాలు కర్రలు, చెయిన్స్, తల్వార్లు, కొడవళ్ళతో మా అపార్ట్‌మెంట్స్‌లోకి జొర పడటం.. లేడీస్, పిల్లలు హాహాకారాలు చేస్తూ పారిపోవటం.. మా అందర్నీ కింద పడేసి కాళ్ళతో తన్ని కత్తులతో పొడవడం- ఆ సీన్ మొత్తం నిజంగా జరుగుతున్న ఫీలింగ్‌తో కొంచెం వణుకు వచ్చేసింది.

"సీతావరదరాజన్ అడిగింది కరెక్టే? నిజంగా రేపు ఆ గ్యాంగ్ వచ్చి ఎటాక్ చేస్తే ఏం చేద్దాం?" అన్నాడు బోసు.

"ఏం చెయ్యటమేముందీ? ఇవాల్టిలా గానే మనందరం కలసి వాళ్ళని ఎటాక్ చేద్దాం" అన్నాడు విజయ్‌యాదవ్.

ఏంటి ఎటాక్ చేసేది వంకాయ్? అర గంటలో మన అపార్ట్‌మెంట్స్ తాలూకూ పద్నాలుగు డెడ్‌బాడీలు, పాతిక సీరియస్ ఇంజ్యూర్డ్, నాలుగు అత్యాచారాలు- మిగుల్తయ్" అన్నాడు శంకరమూర్తి.

*(మిగతాది వచ్చే నెల)*

# మనసున ఉన్నదీ...

★ జనవరి సంచికలో మరాఠీ సాహిత్య రుషి విష్ణు సఖారాం ఖాండేకర్‌పై జ్ఞానపీఠాలులో ఎన్నో మంచి విషయాలు అందించిన రచయిత అభినందనీయులు. కథ వెనుక కథలో 'తేడా' కథను గూర్చి చెప్పిన వైనం బాగుంది. పిల్లలందర్నీ కనుపాపల్లా చూసుకుంటూ, చెక్కు చెదరని ఆత్మ విశ్వాసంతో నిలబడ్డ వారి తండ్రిగారిపై వేదగిరి రాంబాబు రాసిన తీరు బాగా కదిల్చివేసింది. చక్కటి అంశాలతో కూడిన స్వామి వివేకానంద చతురోక్తులు చాలా ఆకట్టుకున్నాయి.

– పెన్మెత్స సూరిబాబు,
బంజారా హిల్స్, హైదరాబాద్

★ 'సంఘర్షణ' నవల మానవ సంబంధాల మీద పకడ్బందీగా విశ్లేషించిన నవల. పద్మినీదేవి నవలలంటే మాకెంతో ఇష్టం. సంక్రాంతి కానుకగా మంచి నవలను అందించినందుకు ధన్యవాదాలు. అయితే కొత్తగాలి కాస్త నిరుత్సాహాన్ని మిగిల్చింది. మరిన్ని మంచి కవితలు విరివిగా అందించాలని మనవి.

–జి.జి.కె.రావు, శ్రీకాకుళం.

★ టాంక్‌బండ్ కథల పరంపరలో వచ్చిన 'శరణ్య' సహజాతిసహజంగా, చక్కగా రూపుదిద్దుకున్న కథ. 1950లో నిజాం కాలేజీలో నేను బి.ఎ. చదువుతున్న రోజుల్లో జరిగిన అలాంటి సంఘటనల్నే స్ఫూరణకు తెచ్చింది. ఎంతో చక్కగా, రంగురంగుల చిత్రాలతో ముస్తాబై వస్తోన్న అందమైన పత్రిక 'చతుర'కు అభినందనలు.

–జి.శ్రీనివాసరావు,
నాగుల్ బజార్, హన్మకొండ

★ కొత్తగాలి కవితలు బాగా ఉంటున్నాయి. 'సంఘర్షణ' నవల ఏకధాటిగా చదివించింది. నారాయణరావు తన భార్య ప్రభపై చూపించే ప్రేమ చాలా అపురూపమైనది. తమకు పుట్టని పిల్లల్ని సైతం ఆ దంపతులు ఎంతో ప్రేమగా చూసుకోవడం మరచిపోలేనిది. వైదేహిని మోసగించి, ప్రభపై పతిత ముద్ర వేయించి, భార్య సీతను సైతం వంచించిన కామేశ్వర్రావులాంటివారు నేటి సమాజంలో ఎంతోమంది ఉన్నారు. అలాగే ప్రభాకర్‌లాంటి మంచి యువకులు సైతం ఉన్నారు. మొత్తానికి ఈ నవల నిజమైన జీవిత పరిశీలనలో నుంచి వచ్చిందని అన్పించింది. ఇలాంటి మంచి నవలను అందించిన రచయిత్రికి అభినందనలు.

–వాడవల్లి రమాదేవి,
ఆరుగొలను, కృష్ణా జిల్లా

★ ప్రపంచ ప్రసిద్ధ నవలల పరిచయ వేదిక కాలాతీతంలో వచ్చిన ఎమిల్ జోలా నవల 'జెర్మినల్' ఆకట్టుకుంది. 125 సంవత్సరాల క్రితమే కార్మికుల దుస్థితిపై పరిశోధించి రచన చేసిన జోలా గురించి తెలుసుకుని ఆశ్చర్యం వేసింది. చతుర కతలు బాగుంటున్నాయి. వారెవ్వా, కాప్షన్‌మీదే చతురకు అదనపు ఆకర్షణలుగా నిలిచాయి.

– ఎస్.రూప, బాపట్ల

★ 'నిన్నటి నిజం'లో మా కరువు జిల్లాకు చెందిన ఆనాటి గొప్ప వ్యక్తుల గురించి కొన్ని విషయాలు తెలిసాయి. ఘటికులైన స్వామి వివేకానందుడి చతురోక్తులు చాలా ఆసక్తిగా చదివించాయి. అపార్ట్‌మెంటాలజీ కడుపుబ్బ నవ్విస్తోంది. ప్రతినెలా మంచి నవలతోబాటు, ఆసక్తికరమైన అంశాలతో తలుపుతట్టే చతుర కోసం ఇంటిల్లిపాదీ ఆత్రుతగా ఎదురు చూస్తుంటాం.

– పద్మప్రియ, హిందూపురం

---

చిరునామా : మనసున ఉన్నదీ... సంపాదకుడు,
చతుర, ఈనాడు కాంపౌండ్,
సోమాజిగూడ, హైదరాబాద్ –500 082
ఈ మెయిల్ చిరునామా:
vipula.chatura@gmail.com

